ఆంధ్రసచిత్రవార
పత్రిక

మాలతి తండ్రి' (కృ॥ మూ॥ కల్కి రచన)




25-1-63
25 నయాపైసలు

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఆంధ్రదేశంలో సంక్రాంతికి ప్రతిగృహమూ ధనధాన్యాలతో తులతూగే సమయం. ఆంధ్రు లందరి యెదుట "సస్యలక్ష్మి" — సహజంగా సుగంధ పరిమళంతో సాక్షాత్కరించుట సంతోషం. ఈ తరుణంలో ఆ తరుణిని ముఖచిత్రంగా యెన్ను కోవటం ముదావహం.

డి. యల్. నరసింహారావు (నాగపూరు)

* * *

మీరు ప్రతివారము నటీనటులను పరిచయము చేయుచున్నారు. కానీ వరుసగా స్త్రీలను, పురుషు లను పరిచయము చేస్తున్నారు. అట్లు గాక ఒకరి తర్వాత ఒకరిని పరిచయము చేస్తే బాగుంటుంది. వరుసగా పురుషులను వేస్తుంటే విసుగును కల్గించు చున్నది. జమున, సావిత్రి మొదలగువారి పరి చయము కొరకు ఎదురుచూస్తుంటాము. మా కోర్కె నెరవేరుతుందనుకొనుటలో పొరపాటు లేదుకదా ?

సుందరి (బందరు)

* * *

శోభన్‌బాబా ? ? ? ? .......... అరె! బాప్‌రే!! 'శివాజీగణేశన్' అని అనుకున్నాము.......

యమన్ ( వెలంపాలెం )

## కథలు

సంక్రాంతి సంచికలో సింగరాజు రామచంద్ర మూర్తిగారి 'వేట'కథ క్రొత్త తరహాగా ఉన్నది.

ఎన్. శివసుబ్రహ్మణ్యం (మచిలీపట్నం)

* * *

"పాంథశాల" కథ నాతోబాటు చాలామందిని కూడా ఆకర్షించుచుంటుంది. గంభీరమైన పాత్రలతో, గంభీరంగా ప్రారంభించి, గంభీరంగా నడిపించి, గంభీ రంగానే ముగించిన 'పాంథశాల' రచయిత శ్రీ విజయగార్కి నా హృదయపూర్వక ధన్యవాదములు. పత్రికలో ముందు కూడా ఇలాంటి ఉత్తమ కథానికలను చూడగలమని ఆశిస్తున్నాను.

వి. రామస్వామి (హైదరాబాదు)

* * *

పాంథశాల కథ హృదయాల్ని కదిలించేటంత బాగా రాసిన "విజయ"గారికి నా అభివందనలు. మరొక సందేహం. "విజయగారు" స్త్రీయా లేక పురుషుడా తెలిపెదరని ఆశిస్తున్నాను.

ఎస్. అనూరాధ (విశాఖపట్నం)

* * *

"కఠినాత్మురాలు" కథ వాస్తవికతకు చాలా దగ్గరగా యున్నది. ఈ రోజుల్లో అత్తాకోడళ్ల మధ్య ఉండే పేచీలను చక్కగా వివరించారు.

ముప్పర్తి శివాజీరావు (మోరి)

## సీరియల్ కథలు

శ్రీ రంగనాథ్‌గారి 'ఏడుకొండలు' పాఠకుల మన్నన లందినది. అదేవిధముగా ఈ నూతన సీరియల్ 'శ్రీదేవి' కూడ విజయవంతముగా మన్నన లందగలదని ఆశిస్తున్నాను. రచయిత శ్రీ రంగనాథ్‌గారికి నా అభివందనములు.

పోలిశెట్టి అప్పారావు (విశాఖపట్నం)

* * *

కుమారి కళ—బొమ్మల సీరియలు చాలా బాగు న్నది. దేవికగార్కి నా ధన్యవాదములు.

కె. విజయలక్ష్మి (కాకినాడ)

* * *

శ్రీ "యు" గారు వ్రాసిన "విచిత్ర వివాహం" లోని 'రాధ' గాథ చాలా బాధ కల్గించింది. 'రాజు, కామజ్యోతి' ల మీద ఒక విధంగా కోపము, ఒక విధంగా జాలి — రెండూ కల్గాయి. ఎంత తెలివైన వారైనా క్రమశిక్షణ లేకపోవడంవల్ల రాణించరు సరికదా, తాము నాశనమైపోతూ ఎదుటివారిని కూడా నాశనం చేస్తారు. క్రమశిక్షణ లేకపోవడం వల్ల జీవితంలో రకరకాలుగా పట్టీలు కొట్టినవారి నెందరినో నే నెరుగుదును. చివర భాగంలో శ్రీ 'యు' గారు వ్రాసిన మాటలు నా కెంతో నచ్చాయి.

ఎ. కమలం (బిలాస్‌పూర్)

* * *

శ్రీ "యు"గారు వ్రాసిన "విచిత్రవివాహం" నాకు హృదయానందము కలిగించింది. కాని కథ అసంపూర్ణముగా ముగించారు. శాస్త్రిగారి కుమార్తె, పుత్రుల భవిష్యత్తు వ్రాసి ఉంటే చాలా బాగాయుండుననిపిస్తుంది. ముఖ్యంగా ఈ అవ రాధ పరిశోధకునికి పాఠకలోకం చాలా ఋణపడి ఉంది అనుటలో అతిశయోక్తి ఉండజాలదు. నేటి అవకతవకపు సమాజంలో రాజులాంటి సంఘ ద్రోహులు, కామజ్యోతివంటి కామపిపాసినులకు జరిగిన ప్రాయశ్చిత్తము, యింకా యెందరికో జరుగవలసియుంది.

ఉద్యోగానంతరము తమ విరామకాలమును తిరిగి సద్వినియోగము జేయుటకు చేయు వీరి ప్రయత్నము కొనియాడదగినది. వీరి సేవ అపార మైనది. వీరికి నా హృదయపూర్వక ధన్యవాద ములు.

యు. ఎస్. రావు (అనంతపూర్)

## రాజధాని కబుర్లు

"28—12—62" పత్రికలో "రాజధాని కబుర్లు" శీర్షికలో శ్రీ ఐ. ఎల్. ఎన్. గారు వ్రాసింది చదువుతుంటే చాలా బాధ కలిగింది. ఒక్క నాటకాల్లోనే కాదు; ఏ పోటీలోనైనా ఆడ పిల్ల స్టేజి ఎక్కిందంటే విరుత్సాహపరచేవారు, వెకిలి చేష్టలు చేసేవారు, అసభ్యకరంగా ప్రవర్తించే వారు ఈ నాడు చాలా కళాశాలల్లో ఉన్నారు. పురుషు నితో సమానంగా ఉండకుండా, మన సమాజం పూర్వ కాలంలో స్త్రీని అణగద్రొక్కింది. ఈనాటికి స్త్రీ తను కూడా అన్ని రంగాలలో పురుషునితో సమాన మని ఋజువు చేసుకోటానికి ప్రయత్నిస్తున్నది. అలాంటి స్త్రీలకు ప్రోత్సాహమివ్వాల్సింది పోయి అనాగరికంగా ప్రవర్తించటం భావి భారత పౌరులైన విద్యార్థులకు తగదు. ఇలాంటి అసభ్య ప్రవర్తన మన జాతికి అవమానకరం.

రాజనాల (విజయనగరం)

* * *

హైదరాబాదులో రక్షణ నిధి సేకరణకై బయలుదేరిన కొన్ని సంఘాల సందర్భం గురించి శ్రీ ఐ. ఎల్. ఎన్. గారు "రాజధాని కబుర్లు" లో ప్రస్తావించడం ఎంతైనా సబబుగా ఉంది. చందాల కంటూ ప్రొద్దున మంచి ప్రొద్దుకూకేదాకా, ఎవరో ఒకరు వస్తున్నారు. సంగీత కచేరీలని, నాటకాలని టికెట్లు అమ్మిపోతున్నారు. వీళ్లందరిని ప్రభుత్వం అనుమతిస్తున్నదో, లేదో తెలియదు. వీళ్ళు ఈ రకంగా వసూలుచేసే ధనంలో "ఖర్చులు" పోగా కనీసం సగమన్నా రక్షణ నిధికి చేరుతుందో పరిశీ లించవలసియుంది. శ్రీ ఐ. ఎల్. ఎన్.గా రన్నట్లు ఈ రక్షణ నిధికి వసూలైన సైకం మన సైని కులకు ఏ రకంగా ఉపయోగపడుతున్నదీ ప్రభుత్వం ప్రజలకు తెలియపరచాలి. ఇంత ముఖ్యమైన విషయాన్ని నిశితంగా పరిశీలించినందుకు శ్రీ ఐ. ఎల్. ఎన్. గారికి అభినందించుచున్నాను.

జి. నరసయ్య (హైదరాబాదు)

## న్యూఢిల్లీ లేఖ

విడువకుండా ప్రతి వారం పత్రిక చదువుతున్నాను మూడేళ్లనుండి. కొన్ని 'న్యూఢిల్లీ లేఖ'లు సంద ర్భోచితంగా లేకపోయినా యిటీవల శ్రీ కృష్ణగారు వ్రాస్తున్నది అమోఘంగా ఉంది. ఎంత మోతా దులో ప్రయోగించాలో అంతలోనే ప్రయోగి స్తున్నారు నేటి కాంగ్రెసుపాలక సర్వంపై తమ సునిశిత విమర్శనలను. తెలుగులో వెలువడే ఈ విమ ర్శలవల్ల ఆంధ్రేతర కేంద్ర మంత్రివర్యుల కెంత వరకు లాభదాయకమో తెలీదు గాని, అర్థమయితే ప్రజానీకం ఎంతేనా లాభపడుతుంది. ఇందుకు తార్కాణం 21—12—62 వారపత్రికలోని 'న్యూఢిల్లీ లేఖ'—

'జాతీయ రక్షణనిధి' తెరచాటున అసహ్యకర మైన, అవమానకరమైన పనులు చేస్తున్న అనేక కార్యవర్గాలు, సంఘాలు ఎంతేనా బుద్ధితెచ్చుకుని తమ పోకడలో తక్షణ మార్పు తెచ్చుకోవాల్సిన అగత్యం చాలా ఉంది.

వెలగపూడి వేణుగోపాలరావు (నైవేలి)

సైనికులకు మద్యం అవసరమైనంతమాత్రాన ప్రతి రాష్ట్రంలోనూ మద్యనిషేధం రద్దు చెయ్యాలా ? కొన్ని రాష్ట్రాల్లో మద్యనిషేధం లేకపోతే అది ఆ రాష్ట్రాలవార్ల తప్పు కాని ఆ నిషేధం ఉన్న రాష్ట్రాల తప్పు కాదు. ఏదో ఒక దానికి ఎవరో ఒకరిని నిత్యమూ తప్పుపట్టటం మాత్రమే కాదు విమర్శ.

కిట్టప్ప, బాదన్న (కంభం)

## కథ కాని కథ

14—12—62 పత్రిక చూడగానే గుండె ఆగినంత పనయింది. మాకీమధ్య ఒక విచిత్ర సంఘ టన జరిగింది. దానిని "కథ కాని కథగా" పంపు దాము కదా అని వ్రాసినాను. తీరా ఈవారము పత్రికలో "కథ కాని కథ" శీర్షిక ఎలిపివేయబడిన దని చూచి నిర్ఘాంతపోతిని. ఎన్ని రోజులనుండో కథ వ్రాద్దామనే కుతూహలముతో ఎదురు చూస్తున్న నేను నేడు "కథకాని కథ" ఒకటి వ్రాయగలిగాను కదా అని సంతోషించాను. కానీ ఏం చెయ్యను ? ఇంత అకస్మాత్తుగా ఈ శీర్షికను తీసివేస్తా రనుకోలేదు. మరల శీర్షిక పెట్టినప్పు డైనా కథను స్వీకరిస్తారేమో ? వీలైనంత త్వరలో మరల శీర్షికను పెట్టెదరని ఆశించు చున్నాను.

కొండపేటి వెంకటేశ్వరరావు (వెంకటాపాలెం) ☆

# మీ చర్మానికి తగినది




# నివియా

# ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను కోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్య వంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది నివియా ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్.






# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం. 25—1—63
శుభకృన్నామ సం॥ పౌషమాసం॥ బ॥ అమావాస్య
సంపుటము 55 సంచిక. 21
స్థాపితము:
1908
*
ముఖ్య సంపాదకులు.
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకులు
శివలెంక రాధాకృష్ణ
*


## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 13.00 ఇతర దేశాలు ఓడమీద (Sea Mail రు. 20.00 విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు—రూ 114.00 అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00)

*

విడి ప్రతి: 25 న.పై.
సంవత్సర చందా: 13-0-0.

*


ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1




కొత్త నటి. షీలా.

[illegible]

కీ॥ శే॥ కల్కి— పేరు ఆధునిక తమిళ సాహిత్యంలో ప్రసిద్ధమైనది. వీరి 'సీరియల్' కథలు తమిళ పత్రికలలో సంవత్సరాలుగా సాగినా చదువరులు అమిత ఆసక్తితో చదివే వారు! 'మాలతి తండ్రి' పెద్ద కథ రెండు సంచికలలో పూర్తి అవుతుంది. కథ అనువాదం చేసిన 'విశాఖ' వచ్చితాలోకం పాఠకులకు సుపరిచితులే!

* * *

'రెండు రూపాల మనిషి' ఈ వారంతో ముగిసింది మార్లిన్ మన్రో, గ్రేస్ కెల్లీలకు సంబంధించిన వ్యాసాలు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో చదివి ఆనందించిన పాఠకులకు ఈ శీర్షిక కూడా నచ్చుతుందని ఆశిస్తున్నాము!

* * *

ఈ వారం సీరియల్ కథలు కాక మూడు కథానికలు వేశాము. ఉన్న శీర్షికలనే సర్ది వీలయినన్ని కథలు పాఠకులకు అందించాలని మా సంకల్పం!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో మా శుభాభినందనలు!

* * *

ఈ సంచిక ముద్రణ అవుతూ ఉండగా శ్రీ వివేకానందస్వామి శత జయంతి ఉత్సవాలు జరుగుతున్నాయి

భారత ఆధ్యాత్మికవాణిని విదేశాల్లో ప్రతిధ్వనింపజేసిన ఆ మహా పురుషుని జన్మదినం ఈ నెల 17 వ తేదీ.

## లోకంపోకడ



"అదుగో అలా ఐతే గురి కుదరదు సార్! ఆ బొజ్జ కాస్త తగ్గించుకోవాలండీ!!"

## విషయానుక్రమణిక



దీని దుంప తెగ!
ఇంకా లొంగనంటున్నదే!
బంగారం ఆజ్ఞ




మద్య నిషేధం పట్ల తటస్థుణ్ణి
మద్య నిషేధం పోవాలి
మద్యనిషేధం
మద్యనిషేధాన్ని బలపర్చాలి
స్వతంత్ర పార్టీ




జైప్రకాష్ పెకింగుకు శాంతి యాత్ర చేస్తారట భారత దేశానికి హిమాలయాలపై అదుపు ఇప్పిస్తారేమో




ఈ మంచు గడ్డ మీద నడక ప్రమాదకరం!
కొలంబో పథకం
హిమాలయాలపై దుస్సాహస కలత్వం
రక్షక దళాలు



స్వామి వివేకానంద శతజయంతి ఉత్సవాలు ఈ నెల 17 నుంచి దేశవ్యాప్తంగా ప్రారంభమవుతున్నాయి జనవరి 17 వారి జన్మదినం

ఈ సంప్రదింపులలో వారు విజయం పొందితే, ఈ ఆఫ్రికా, ఆసియా రాజ్యాలు కాశ్మీరు సమస్యను కూడా పరిష్కరించటానికి పూనుకోవచ్చు పైగా మన ప్రధానమంత్రి ఈ భారత — చైనా వివాదాన్ని అంతర్జాతీయ న్యాయస్థానానికి తీసుకుపోయి, చేచేతులా పెద్ద తంటా తెచ్చిపెట్టుకున్నారు. మరి కాశ్మీర్ విషయంలో పాకిస్తాన్ కూడా ఇలాంటి పనే చేయాలనుకుంటే దాన్నడ్డుకునే దెవర్తా?

శాంతి సందేశంతో శ్రీమతి బండారునాయకే సందర్శించే ఈ తరుణంలో భారత—చైనా వివాదానికి తెర వెనుక భాగవతం తెలుసుకోవటం ఎంతైనా అవసరం ఉపయోగకారి కూడా

సుదీర్ఘ హిమాలయ సరిహద్దు ప్రాంతంలో చైనీయుల సైనిక దురాక్రమణ గత సెప్టెంబరులో జరిగింది అది తగుమాత్రపు సైనిక చర్యల స్థాయిలో జరిగిందన్నమాట అంటే ఈ చర్య ముఖ్యోద్దేశ్యం చైనా పరిస్థితులను బల పరుస్తూ, శీతాకాలంలో యుద్ధం చేయరనే ప్రచారానికి తావేర్పరచుకొనటమేనని చెప్పవచ్చు శాంతియుత ప్రతిపాదనలకు తా మెప్పుడూ సిద్ధమనే భారత ప్రభుత్వాన్ని, చైనా తక్కువచూపు చూడటంలో ఆంతర్యం అందరికీ చాలాకాలంనుంచి తెలిసినదే చైనీయులు సరిహద్దు సంప్రదింపుల ద్వారా నేపాల్ తోను, రాజనీతి సంబంధాలద్వారా పాకిస్తాన్ తోను (ఒకప్రక్క ఈ రాజ్యాలకు భారతదేశానికి సమస్యలు తెచ్చిపెడుతూ) ఏర్పరచుకొని, తన 'మంచి మిత్రుని' విధానంపట్ల ప్రేక్షకుడుగావుండే దేశాల జమలో చేర్చింది లావోస్‌లో జరిగిన రాజీ, చైనా మన సరిహద్దు ప్రాంతంలో బలపరచుకోటం, భారతదేశాన్ని అమెరికా సామ్రాజ్యవాద మద్దతుదార్లుగా నిరూపించటం, లాభాలుగా (మనకాదు, చైనాకి) చెప్పవచ్చు.

లడక్—టిబెట్, లడక్—సింకియాంగ్‌ల ప్రాంతంపై చర్చలకు సంసిద్ధతనుతెలిపే భారత తీర్మానంలో ఉభయ పక్షాలు ఎదుటివారు చెప్పిన రేఖ వెనక్కి పోవాలని మళ్ళీ ఒకసారి చెప్పటం జరిగింది

# చిక్కులు తెచ్చే ఆఫ్రేషియా మిత్రులు: శాంతిని అశాంతితో ఎదుర్కొనే పెకింగ్ ప్రభుత్వం!

## శ్రీకృష్ణ

భారతదేశానికి మిత్రులనుకుంటున్న ఆసియా, ఆఫ్రికా రాజ్యాలవర్గం, భారతదేశానికంతటికీ, ముఖ్యంగా మన ప్రధాని నెహ్రూకు గొప్ప చిక్కు తెచ్చిపెట్టింది ఈ రాజ్యాల్లో ఆరు ఇటీవల కొలంబోలో సమావేశమై, భారత—చైనాలను సన్నిహితం చేసేందుకు పథకాన్ని రూపొందించాయి మొత్తంమీద ఇంకా గుంభనగానే ఉంచినా, ఆ పథకం ముఖ్యంగాచెప్పే విషయంవల్ల, చైనా తను కావాలనుకున్నది, లడక్‌లోని పెద్ద భూభాగం ప్రాంతాన్ని, ఆ దేశం భుక్తం చేసుకునే అవకాశం కలుగుతుంది ఈ రాజ్యాల సమావేశాన్ని ఆశీర్వదిస్తూ, చైనా ఎందుకు సందేశాలు పంపిందో తెలుస్తుంది దీనివల్ల!

సింహళ ప్రధానమంత్రిణి ఈనెల పదవ తేదీన ఓ మూడు రోజులపాటు భారత ప్రధానితో సంప్రదింపులు జరిపేందుకు, భారత దేశానికి వచ్చింది ప్రధానమంత్రి ఇప్పటికే చాలా ఇబ్బందులలో తల దూర్చారు కొలంబో పథకంలో చెప్పినట్లు, కొత్త యుద్ధ విరమణ ఏర్పాటుకు ప్రధానమంత్రి నిర్ణయం తీసుకుంటే, ప్రజల అండ పొందటం కొద్దిగా కష్టమే అవుతుంది ఈ ప్రతిపాదనలను తిరస్కరించాలనుకున్నట్లయితే ఆయన చైనా యుద్ధ ప్రచారానికి తావొసగటమేకాక, ఆఫ్రేసియా తటస్థ రాజ్యాల సుహృద్భావం, సానుభూతి కోల్పోవలసి వస్తుంది.

ఇదికాక ఇంకో ప్రమాదం కూడా ఉంది. ఇప్పటి భారత సైనికులు ప్రతిఘటనంతో దిట్టలుగా ఉన్నారనీ, చాలాచోట్ల సైనికులు, చైనీయులు పట్టుకున్న స్థావరాలకన్న ముందుకు చొచ్చుకుపోయి, కొత్త స్థావరాలు నెలకొల్పుకోగలిగారనీ, చైనీయులు గ్రహించారు దౌత్య మార్గాల ద్వారానేకాక, సెప్టెంబర్ 9 న 'సరిహద్దు స్థితిపై నివేదికను' ప్రకటించారు ఆవెంటనే చైనాలోని అధికార పత్రిక 'పీపుల్స్ డెయిలీ,' చైనా ప్రకటించిన ప్రాంతాలపై దురాక్రమణద్వారా భారతదేశం పరిస్థితిని ఉద్రిక్తం చేస్తున్నదని దుమ్మెత్తిపోసింది. శాంతియుత పరిష్కారానికి భారతదేశం చేస్తున్న ప్రతిపాదనలను వమ్ము చెయ్యటమే ఈ ప్రచారం

55-వ పేజీ చూడండి



# పన్నీరు–కన్నీరు

## నందివాడ భీమారావు

### జరిగిన కథ

పిరిపాలెంలో సూరపరాజుకరణం సూర్యనారాయణగార్ల కుటుంబాలు ప్రశస్తికెక్కినవి. సూరపరాజు తల్లి లక్ష్మమ్మ. ఆ ఇంట పెద్దబామ్మగారున్నది, సూర్యనారాయణకి నలుగురు పిల్లలు. ఆ ఊరికి వరదలువచ్చాయి వరసింహంగారూ, వచ్చారు. అంతకుక్రితం కూరపాడులో వేంకటశాస్త్రిగారి కూతురు పెళ్లి మున్నెబ్బు సాయంలో జరిగింది. కాని,ఆమె మానభంగమైందనే అవమానంలో ఆత్మహత్య చేసుకుంది. శాస్త్రిగారు మరణించాడు ఆయన ఇల్లు తగలబడిపోగా, కొడుకు మాయమయ్యాడు. కొత్తగావచ్చి వరసింహం సూరపరాజు మద్దతుతో పిరిపాలెంలో బడి పంతులయ్యాడు. సూరపరాజు కుమారుని వివాహం కారణంగా సూర్యనారాయణగారికి ఆయనకు స్పర్థ ఏర్పడుతుంది. సుబ్బారావు కుటుంబం ఆర్థికంగా చితికిపోతుంది. సూరపరాజుగారి మరణానంతరం సుబ్బారావు విశాఖపట్నంలో కాంట్రాక్టు వ్యాపారంలో నష్టపడి ఇంటికి వస్తాడు.

## 13

### అవతలిగట్టుకి

సూర్యం కాలేజీ చదువు కొచ్చేటప్పటికి సంసారం బొత్తిగా చితికిపోయింది. చదువులు చాలించి చిన్నవైనా ఏవో ఉద్యోగాలు సంపాదించుకున్న సుబ్బారావు తమ్ముళ్లిద్దరూ సంసార బాధ్యతలూ, అన్నగారి కష్టాలూ పాటించకుండా తమ దారిన తాము వెళ్లారు. సుబ్బారావుకి మామూలుగా ఉద్యోగంలో ప్రవేశించే వయసు దాటి చాలా ఏళ్లయింది. సుబ్బారావు మామగారు అప్పటికి రిటైరయ్యారు

51-పేజీ చూడండి



శ్రీశైల క్షేత్రంలో తిరుమల తిరుపతి దేవస్థానం సత్రానికి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు.

# ప్రాథమిక సూత్రాల్లేని పతంగుల మహోత్సవ నగరం

జనవరి నెల వచ్చిందంటేనరి, హైద్రాబాద్ ప్రజలకు ఏటేటా రెండు వింతలు కనబడతాయి. ఒకటి, ఏ వీధి చూసినా గాలిపటాల (పతంగ్) దారాలు పట్టుకుని ఆకాశంవైపు విస్మయానందాలతో చూస్తూ ఉండిపోవటం, నీలాకాశం వైపుకు పరుగెత్తుకు వెళ్తున్నట్లు రంగు రంగుల పతంగులు, చాలావాటికి తోకలుండవు, గగన వీధిన స్వైర విహారం చేస్తూ ఉంటే, నిజంగా చూడ ముచ్చటగానే ఉంటుంది. వాటిల్లోనే పోటీలు కూడా. ఎగురుతున్న గాలిపటాలను గాలిలోనే కూల్చివెయ్యటానికి క్రిందనుంచే దారాలు మెలిపెడుతూ ఉంటారు. ఈ సరదా, కేవలం చిన్నపిల్లలకే కాదు, పెద్దవాళ్లకీ మరీను. గాలి జోరుకి పట్టు వీడిపోయో, పోటీలో నెగ్గలేకపోయో, ఇక గాలిలో ఉండలేక, విలవిలలాడుతూ, నీరసంగా క్రిందకుదిగిపోయే పతంగులను, సొంతం భూమిమీదకు రాకుండానే పైపైనే ఎగరేసుకు పోవటానికి, సాయుధాలతో సిబ్బంది, రహదారి రోడ్లమీద విచ్చలవిడిగా, ఆకాశంవైపుకే చూసుకుంటూ పరుగెత్తుకుంటూ పోతూవుంటారు. వీళ్ల చెవులకు కార్ల మోతగాని, టాక్సీల హారన్లు గాని, సైకిళ్ల బెల్ గాని వినపడవు. వాళ్ల ధ్యాసంతా కేవలం పతంగులమీదే! వాళ్లది ఊర్ధ్వదృష్టి. సరదాకు, సంతోషానికి, ఆనందానికి ఎన్నయినా పండగలు మనకు ఉండనే ఉన్నాయి. ఈ సంక్రాంతి పండగకు మాత్రం ఈ పతంగులు ఎగరెయ్యటమనేది ఈ రాజధాని నగరంలో అతి ప్రమాదంగానే పరిణమిస్తోంది. ఒళ్లు తెలియని ఆవేశంలో వాళ్లేం చేస్తున్నారో వాళ్లకే తెలియదు. మొన్న మధ్యనే, ఓ కుర్రాడు, రైలు పట్టాలమీద యీ పతంగ్ వింతలు చూస్తూ వచ్చే రైలును కూడా గమనించలేకపోయాడు. ఇలాంటి హృదయవిదారక సంఘటనలు ప్రతి యేటా జరుగుతూనే ఉంటాయి, దీన్ని అట్టే సీరియస్‌గా పట్టించుకున్నవారే ఉన్నట్లు కనబడరు. బాల్య చాపల్యంచేత, హద్దులు మీరి యీ పతంగుల దారాలు పట్టుకుని తిరగటంలో, పిల్లలు ప్రమాదాన్ని గుర్తించకపోవచ్చు. మరి పెద్దవాళ్లు కూడా యిదే ధోరణేను. ప్రభుత్వం వారు మాత్రం ఓ హెచ్చరిక చేసి ఊరుకుంటారు. రోడ్లమీద నిలబడి, యీ పతంగులను గాలిలోకి వదిలెయ్యటానికి వీల్లేదని! అయితే ఈపని చేసే వారిమీద ఏమీ చర్య తీసుకోరు. పైగా చూసీ చూడనట్లు వదిలేస్తారు. ఈ మధురానుభూతిని అనుభవించేవాళ్లను, ప్రమాదాలంటే భయపడని వాళ్లను వదిలేస్తే, యీ వలయంలోంచి తప్పించుకుని తిరుగుదామనుకున్న ప్రజలు కూడా ఈబాధ భరించక తప్పదు. ఏ దారపు ఉంగరాలువో, చిక్కుకోక తప్పదు. వలలాగ కాళ్లకు అడ్డంవచ్చి, ఒక్కొక్కసారి, అమాంతంగా సాష్టాంగ దండ ప్రణామం రోడ్డుకు అడ్డంగా చెయ్యాలసి వస్తుంది. తన కివేమి పట్టకుండా ఏ వ్యక్తి అయినా, సూటిగా వెళ్తున్నా, తుపి పతఙ్గమో, కొంటెగా వచ్చి ఈ వ్యక్తి తలమీద వాలిందా, ఆయన తల బూజా వదిలిపోయిందన్నమాటే! పొడుగాటి వాసాలు ఆయన తలమీద కోలాటం వేశాయన్నమాటే! ఆ పద్మవ్యూహంలోంచి బైటపడేటప్పటికి తల ప్రాణం తోకకు వస్తుంది. తాపీగా కూర్చుని, తాము చేసిన ఘనకార్యాలు, కుప్పలు కుప్పలుగా చెప్పుకుంటూ పోతూనే ఉంటారు. ప్రమాదాల్నుంచి తప్పించుకుపోయిన వైనం, కొంతమంది గుండెల మీద చేతులు పెట్టుకుని చెప్తూవుంటే, కొంతమంది పతంగులను ఎట్లా కూల్చింది, యితరుల హస్తాల్లోంచి ఎన్ని లాక్కొచ్చింది, సగర్వంగా చెప్పుకుంటూ ఉంటారు, తల్లిదండ్రులు, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు, ఈ విషయంలో తగు జాగ్రత్త వహించాలసిన అవసరం ఎంతైనా ఉంది. తమ పిల్లలకు, ఈ పతంగ్ మహోత్సవంలో అనుసరించాలసిన ప్రాథమిక సూత్రాలను చెప్పాలసిన బాధ్యత ఉంది. ఏదో ఆడుకుంటున్నార్లే అని వదిలేస్తే, వచ్చే ప్రమాదాలకు, ఇంకొకళ్లదేమి బాధ్యత ఉండదు. ఇది ఒక్క ఏడాదితో సరిపోయేది కాదుగా! ప్రతియేటా ఉండే జాతరే!

రెండో వింత, అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం. ఆలిండియా ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్ అని కొంతమంది పిలుస్తే, మరికొంతమంది

60 వ పేజీ చూడండి

# హరివంశము

## ఉజ్జయిని పర్వం- 11

పంచమినాటి సాయంతనమే ఆచార్యులు సుదాముని మహారాజుల గృహములకు పోనాజ్ఞాపించిరి. అతడు వెళ్లేరనెను. శ్రీకృష్ణదేవు డాచార్యుని చూచి మందహాసము చేయుచు నిట్లనెను: "ఆచార్య! మరి సుదామునకు తోడపెండ్లికొడు కెవ్వరుగా నుందురు!" ఆచార్యుని కన్నులు విశదముగ హసించినవి. ముఖము మాత్రము గాంభీర్యమును వదలలేదు. ఆయన ఇట్లనినారు: "నీ వేల తోడపెండ్లి కొడుకవు కారాదు!" ఆచార్యాణి ముఖమింతయయినది: "అవును! తండ్రీ! నీవు తోడపెండ్లికొడుకు కావలెను" అన్నది. అని శ్రీకృష్ణుని మరియు తిలకించి ఇట్లు లన్నది: "మిత్రవిందను తోడపెండ్లి కూతరను చేయుచున్నాను."

శ్రీ కృష్ణదేవుడు గల్లున నవ్వెను.

"తల్లీ! పెండ్లి గూడ చేయింతురా!"

"తండ్రీ! అది ఈ ఆనుకూల్యమునుబట్టి యున్నది."

శ్రీకృష్ణదేవుడు మరల నవ్వెను. ఆచార్యుడును మందహాసము చేసెను.

"సరి! ఈ మాటలతో కాలమతీతమగుచున్నది. మరల షష్ఠి ఘడియలు వచ్చును. సుదాముడు బయలుదేరవలయును" అనెను.

దారుకుడు రథమును సిద్ధము చేసి, వాకిట నిలచియుండెను. శ్రీ కృష్ణుడు గూడ సుదామునితో బయలుదేరెను. ఆచార్యు డేమియు ననలేదు. ఆయనయు వారితో బయలుదేరెను. ముువ్వురును రథమును సమీపించిరి; అధిరోహించిరి. శ్రీకృష్ణదేవుడు దారుకునితో ననెను: "దారుక! నీవు దిగుము. నేను రథమును తోలెదను." దారుకుడు మందహాసము చేసెను. రథము మొగలులోనుండి క్రిందకు దిగెను. శ్రీ కృష్ణు డా స్థానములో కూర్చుండెను. ఆచార్యుడును, సుదాముడును రథమున ముందుప విష్టులైరి. ఆచార్యాణియు, మహానందుని భార్యయు వాకిట నిలచుండియుండిరి. శ్రీకృష్ణదేవుడు పగ్గములను పట్టుకొనెను. రథమునకు పూన్చిన హయములేదో నూతనశక్తి తమలో ప్రవేశించినట్టుల మంద హేషలుగా పరవళ్లు త్రొక్కినవి. భగవంతుడును విచిత్ర హేషలుగా వాని నదలించినాడు. ఆచార్యునకు అది విచిత్రమైనది. ఇతడేమి మనిషి! ఇంతవరకును ఒక్క విధముగా నుండెను. రథము మొగలులో కూర్చుండగా మారిపోయెను. ఆచార్యు డనుకొనినాడు. భగవంతునకు బృందావనము జ్ఞప్తికి వచ్చుచున్నట్టు లున్నది. ఆశ్రమ విరుద్ధముగ హేషానినాద వినోదియగుచున్నాడు. అట్లులనుకొనగా ఆయనకు నవ్వు వచ్చినది; నవ్వినాడు. వాకిట నిలబడియున్న ఆచార్యాణి గొలు నవ్వినది. మహానందుని భార్యయు నవ్వినది. ఆచార్యు డాచార్యాణిని చూచి, "ఏలనే! పతివ్రతా! నవ్వుచున్నావు" అనినాడు.

"తమరు ఎందులకో నేనును అందులకే" అన్నది ఆచార్యాణి.

"చూచినావుగా! భగిని! మీ వదినకు శ్రవనీరు వంటబట్టినది. కాశికలో నెప్పుడైన నిట్లు మాట్లాడినదా?" అనినాడు ఆచార్యుడు.

ఆచార్యాణి సిగ్గుపడినది. సిగ్గుతో నా పెద్ద ముత్తైదువ ముఖము వసంతము చిగిర్చినట్లుగా నున్నది.

ఆచార్యు డామెను చూచి మరియు మందహాసము చేసినాడు.

శ్రీ కృష్ణదేవుని దిక్కై "ఏమి శ్రీ కృష్ణ! రథమును తో[illegible]" అనినాడు.

శ్రీ కృష్ణదేవుడు గంభీరవాక్కై, "ఆచార్య! తల్లిగారు కూడ మనతో వత్తురు" అనినాడు.

"అదియా సంగతి! మీ మీ ఆలోచనములు నా కేమి తెలియును" అని ఆచార్య సాందీపని భార్యను చూచి, "రమ్మవే! వృద్ధురాలవైన పెండ్లికూతుర! మహారాజు లిండ్లకు పోదాము" అనినాడు.

ఆచార్యాణికి మరియు సిగ్గైనది.

శ్రీ కృష్ణుని చూచి, ఆచార్యాణి ఇట్లులన్నది:

"తండ్రీ! నీవు కొంటెవాడవురా!

"యశోద నన్ను అట్లులనే అనెడిది" అనినాడు శ్రీ కృష్ణదేవుడు.

ఆచార్యాణి కన్నులు చెమ్మగిల్లినవి.

"నాయనా! నేను యశోదయంతటి దాననందువా తండ్రీ! నీ విక్కడయున్న దినములలో నిన్ను సరిగా చూచితినన్న పేరు వచ్చిన చాలునా! అంతకన్న నేమియు వలదు."

ఆచార్యు డామెను విచిత్రముగా పరిశీలించెను. అంతలో ఉస్సురనెను. భగవంతు డాయనను చూచియు చూడనట్టు లుండిపోయెను. ఆచార్యాణిని సంబోధించి, "తల్లీ! వేళ యతిక్రమించుచున్నది. ఇంతలో నే వర్జమో వచ్చును. మనము బయలు దేరి పోవలయును" అనెను.

ఆచార్యాణికి రథము నధిరోహింపక తప్పలేదు. ఆమె రథము నధిరోహించి ఉపవిశయైనది తడవుగ రథము విచిత్ర గమనములుగా ముందునకు సాగెను. మాతలియు, దారుకుడును వేర రథముపై యా రథము ననుసరించిరి. వారికి ఆ రథ గమనమే విచిత్రమనిపించినది. రథ గమన విశేషములను తెల్పు వేద మొక్కడున్నచో, దానికి శ్రీకృష్ణుని ఈ రథము నడుపు పద్ధతి యొక వ్యాఖ్యానము. కాదు; అదే ఇది. దేవయోనులలో, మనుజులలో నెందరు సారథులు లేరు! వారు ఇట్టివారుకారు. సూర్యుని సాయంత్రపు చల్లబడిన ముదిమి ఎండలు మీదపడుచుండగా నా రథము సూర్యహయములను పోలి దివ్య గమనములతో ఉజ్జయిని వీధులలోనడచెను. ఉజ్జయినికి ఉజ్జయిని ఒడ్లు విరిగి ఆ విచిత్రమును దర్శించెను. రథ గమన వేగమువలని ధ్వని వంశీనాదమువలె నుండెను. గుర్రముల వడక యచ్చరల నాట్యమువలె నుండెను. సంతోష పారవశ్యమున హయములు చేయు హేషలు తూర్య ధ్వనులను పోలి, రథ చక్రముల యందలి చిరుగంట తాళము వేయుటను పోలి, పెక్కుమున యందలి ధ్వజపటము నొరసిపోవు గాలి చేయు ముర్మర ధ్వనులు శ్రుతి పట్టుటను పోలి, భూమిని తాకియు, తాకకపోవుటయుగా రథము కదులుట వలన కల్గిన మ్రోత మద్దెలలను పోలి, యంతయు నప్పుడు పెండ్లివారు మేళములతో తాళములతో ప్రయాణము చేయుచున్నట్టు లుండెను. దారుకుడు మాతలితో ననినాడు: "మాతలి! ఇది విద్యరా! స్వామియన్న మేమి యనుకొనినావు. ఆ విద్యను మన మిట్టు లభ్యసింపవలసియున్నది."

మాతలి ముందు మౌనము వహించెను.

తరువాత యిట్లులనెను:

"దారుకస్వామి! ప్రభువు నా కేల ఇట్టి విద్యను ప్రదర్శించి చూపుచున్నాడు. నేను విరోధివర్గములోని వాడను. మరి ఇది యేమి సౌహార్దము."

దారుకుడు మందహాసము చేసెను.

"మాతలి! స్వామికి విరోధులని ఎవరురా! అది యట్లులుంచుము. నీకు పౌండ్రకునిపై మనస్సు విరుగలేదు."

"స్వామి! అది యేదో అనుబంధము. ఎట్లు విరుగును. నేను, ఆయన మనస్సు వంటివాడను"

"అనగా నాయనయును ప్రభువునందు భక్తి చేయుచున్నాడని యందువు!"

"నా తాత్పర్య మదియే!"

మరి వారు మాటాడలేదు.

అంతలో రాజ ప్రాసాదములు వచ్చినవి. మేడల మీదనుండి మహారాజు ఆ వచ్చు రథములను చూచెను. అంతలో అంతర్హితుడయ్యెను. మరల రాజాధిదేవితో, మిత్రవిందతో మేడలమీదకు వచ్చెను. ఆయన ఆమెతో నేమి యనెనో, ఆమె గల్లున నవ్వినది. ఆయన ఆ కూతుతో నేమి యనెనో ఆమె సిగ్గుపడినది. వారి చూచి మహారాజు గల్లున నవ్విన నవ్వులు గాలి యొక్క ఊతపు కదలికలలో శిప్రలోని పై జలములు కదిలి తచికలాడి గలగలమన్నట్లు, గాలి పొరలలో తేలి రాజ ప్రాసాద బహిఃప్రాంగణమున వాగిన శ్రీకృష్ణదేవుని కర్ణములలో చక్కిలిగింతలు పెట్టినవి.

ఆచార్యాణి మేడలపైవు చూచినది. శ్రీ కృష్ణుని చూచి మందహాసము చేయుచు, "తండ్రీ! అటు చూడుము" అన్నది.

శ్రీ కృష్ణదేవుడును మందహాసము చేసినాడు. "తల్లీ! ఏమో అనుకొన్నాను" అనినాడు.

తిరిగి యాచార్యాణి తలఎత్తి చూచినంతలో మిత్రవింద యట లేదు.

మహారాజును, మహారాణియు నొకటిగా నవ్వుకొనుచు మేడలు దిగుట కననైనది.

అంతలో వారు క్రిందికి వచ్చిరి.

వారితో సుదాముని తల్లిదండ్రులును వచ్చిరి.

వచ్చిన యందరును రథము నవతరించిన సాందీపని దంపతులకు శిరసా ప్రణమిల్లిరి.

—హరీత శివశర్మ. ★

"దొంగలు, దొంగలు రక్షించండి."

ఈ అరుపులు నల్లటి నిశీథిలో బిగ్గరగా, వికృతంగా—సన్నగా పడే తుంపర్లతో కలిసి—అప్పుడే కునుకుతీస్తున్న ఊళ్లో వినిపించాయి—దూరంగా పొలిమేరలో ఉన్న తాటితోపుల దగ్గర్నించి. నలుగుర్నీ లేపుకుని మొత్తం పదిమందీ కలిసి కర్రలూ, లాంతర్లూ తీసుకుని పరుగులెత్తారు జనం ఆ వైపుకు. చుట్టూరా పకడ్బందీగా నిల్చుని జమాజెట్టీల్లాంటి పదిమంది కలిసి తాటితోపంతా వెదికారు. కొన్ని నిమిషాల క్రితం బిగ్గరగా వినిపించిన అరుపులూ, ఇప్పుడు ఈ పదిమందీ కలిసి చేస్తున్న సందడి మినహాగా తాటితోపంతా నిశ్శబ్దంగా గంభీరంగా ఉంది. ఎక్కడా మనిషి ఉన్న జాడే లేదు ఓ అరగంటసేపు గాలించి వెదకింతర్వాత వాళ్ల ప్రయత్నం ఫలించింది. "ఇదుగో ఇక్కడ!" అన్నారు ఎవరో. నలుగురూ ఆటువంపుకు పరుగులెత్తారు. "దొరికాడా దొంగ!" సంతోషంతో

—45 వ పేజీ చూడండి



# వనితాలోకం

# [illegible]లో రాకపోకల సౌకర్యం

యం. సుగుణ

ఈమధ్య ఒక సోదరి సిటీలో సినిమాలు అంటూ సినిమాల్ని గురించి వ్యాసం రాసేరు. ఇక్కడ అలాగే చాలా ఇబ్బందు లున్నాయి. నలుగురైదుగురు రాస్తే కొంచెం లాభం ఉంటుందేమో అని ఆశగా ఉంటుంది. ఇక్కడ అన్నిటికంటె ముఖ్యంగా అందరికీ ప్రతిరోజూ అనుభవం ఉన్నది, రాకపోకల కొరకై ఉన్న సిటీ బస్సులు. ఇవి బాగానే ఉన్నాయి కాని, వాటిని నడిపే పద్ధతి బస్సులో కండక్టర్ల విధి, చెప్పాలి. దానికి తోడుగా మన ప్రయాణీకుల సంగతి చెప్పుకోవాలి.

బస్సుకోసమని గంట గంటన్నర క్యూలో నిలిస్తే వచ్చిన బస్సులు ఎక్కుతామనే ఆశ ఉండదు. ఎందుకంటే బస్సు వచ్చేదాకానే క్యూ. తరువాత చెల్లాచెదరై పోతుంది. అదీకాక, సీట్లు ఖాళీగా ఉన్నా ఫుట్ బోర్డుమీద నిలబడి ఉండటం ఈ ఊర్లో గొప్ప ఫ్యాషను. ఎంత చెప్పినా ముందుకువెళ్ళి నిలబడరు. అందరూ అక్కడే నిలబడి ఉంటామంటే ఎక్కి దిగేవాళ్లకి ఎంత కష్టమో ఆలోచించండి ? ఇంకా కొంతమంది ఫుట్‌బోర్డుమీద నిలబడి బస్సు స్టాపులో వాళ్ళు దిగి, ప్రక్కగాఉండి, బస్సు నడుస్తుంటే మళ్లీ పరిగెట్టి ఎక్కుతుంటారు. సాధారణంగా బస్సు నడుస్తుంటేనే ఎక్కి దిగే అలవాటు ఉంది. స్టాపులో ఆగితే, ఎక్కుతున్నారనేనా చూడకుండా కండక్టర్లు బెల్లు కొట్టేస్తారు. అలాటప్పుడు మొగవాళ్ళయితే కొంచెం ఆచుకోగలుస్తారు. అదే స్త్రీలు, ముసలివాళ్ళు, పిల్లలు క్రిందపడతారు రోజుకోసారేనా పడటం చూస్తాము. ఒకసారి చాలా ముసలామె బస్సు ఫుట్‌బోర్డుమీద ఒక కాలు వేసింది బస్సు లాగించేడు దాంతో వెనక్కి తూలి, పేవ్‌మెంట్‌మీద తల, రోడ్డుమీద మిగతా శరీరం, వెల్లకిలా పడింది. బస్సుల వాళ్ళు కనీసం కొంచెమేనా సహాయపడరు. ఇలాగే చిన్ని పిల్లలు స్కూలుకి వెళ్లే నిమిత్తం గంటలకొలదీ బస్సుకోసం నిలబడతారు. వాళ్ళని ఎక్కించుకునే దాత ఉండరు. ఒక పదిఏళ్ళ వయస్సున్న అబ్బాయి ఒక చేత్తో పుస్తకాల సంచీ, ఒక చేత్తో మధ్యాహ్నం లంచ్ (టిఫిన్ డబ్బా) పట్టుకుని ఎక్కుతుంటే బస్సు వదిలేడు. బస్సు కదిలేసరికి చాలామంది ఎక్కుతారేమో, ఆ అబ్బాయి ఫుట్‌బోర్డుమీద వ్రేలాడుతూ ఉండగా, టిఫిన్ డబ్బా క్రిందపడి టిఫినంతా పడిపోయింది. ఆ అబ్బాయి మొహంచూస్తే ఎలా గుంటుందో వూహించండి! వంగి డబ్బా తీయలేడు టిఫిన్ పోయిందని దుఃఖం. డబ్బా కూడా పోతే ఇంట్లో కేక లేస్తారు. ఎలాగో వంగితీసేడు. అందులో కొంచెం కూర మిగిలింది. అంతే! ఇలాగ జరక్కుండా చూడాలి అంటే కండక్టరు గేటు దగ్గరుండి ప్రయాణీకుల్ని ఎక్కించుకుని గంట కొట్టాలి. బస్సు నడుస్తుండగా ఎక్కనివ్వకూడదు. ఫుట్‌బోర్డుమీద నిలబడకూడదు. బస్సులో సీట్లు నిండిపోతే 10 మందిని నిలపెట్తారు. బస్సంతా వరుసగా నిలబడితే సదుపాయంగా ఉంటుంది. అందరం తొందరగా దిగొచ్చు అనుకుంటూ గేటు ముందుగా నిలబడితే ఎక్కి దిగేవాళ్లకి చాలా కష్టం. పిల్లలు, స్త్రీలు ఎక్కుతుంటేమటుకు కలకత్తా, ఢిల్లీలాటి నగరాల్లో జాగ్రత్తగా ఉంటారు. ఇలా ఎక్కుతుంటే క్రిందపడితే, బస్సును ఆపించి, ఎక్కిస్తారు. అంటే ప్రయాణీకుల్లో అంత ఐకమత్యం ఉంటుంది. ఇక్కడ మనం ఏదేనా అంటే మర్యాద తెలీదంటారు. అదే చెప్పినా వినకుండా బస్సు ఎక్కితే, ఆపించి కండక్టరు దింపిస్తే, అది మర్యాదకి భంగంకాదు. బస్సు నిండిపోతే ఎక్కనివ్వరుకదా! కాని వరుసగా రెండు బస్సులు ఆగేయనుకోండి. అవి కూడా ఫుల్‌గా ఉంటాయి. మూడో బస్సు కూడా వస్తుంది. అది ఖాళీగా ఉన్నా ఆపరు. సాధారణంగా రెండు మూడు బస్సుల్ని వరుసగా వస్తుంటాయి. మూడోది ఖాళీగాఉన్నా ఎందు కాపరు? ఇలాగ ఎంత రాసినా తరగదు. కండక్టర్లు తమ విధి బాగా గుర్తించి నడవాలి. అలా అందరూ ఉండరు. ఏబస్సులోనేనా సరిగ్గా ఉన్నవాళ్ళుంటే, మేము తప్పకుండా, అమ్మయ్య! ఇతను కరక్టుగా ఉన్నాడు అనుకుంటాము. ప్రతివాళ్ళు ఎక్కలేనివాళ్ల పరిస్థితీ, పడిపోయిన వాళ్ల స్థితీ చూసి తన తమ్ముడో, చెల్లెలో, నాయనమ్మో ఎవరేనా అలాపడ్తే అని ఆలోచిస్తే జాగ్రత్తగా ఉంటారేమో! హైదరాబాద్ చూడకుండా ఉన్నవాళ్ళు మన రాజధాని, పెద్దనగరం, అని గర్వపడతారు. చూస్తే ఒక్క సౌకర్యం ఉండదు. స్ట్రీట్ లైట్లు కూడా సరిగ్గాలేని నగరం. టేక్సీలు స్టాండ్లలో ఉండవు. రోడ్డు దాటుతున్నప్పుడు సైకిల్‌వాలాలు జోరుగా రాసుకుంటూ ముందునించిపోతారు. ట్రాఫిక్ రూల్సు కూడా సరిగ్గాలేవు. ఏమిటో హడావిడిగా ఉంటుంది. ఇవన్నీ మారి చక్కగా అన్ని పట్టణాల్లాగే ఉంటుందా మన హైదరాబాదు? ★



యిదిగో విన్నే...! కాఫీనీళ్ళుకాగాయ్ళు... వచ్చి ఫిల్టరుకి వేస్తావా...? లేక వన్నే...!

(చిత్రం: ఎస్వీ శ్యామసుందర్.)



# నేషనల్ అండ్ గ్రిండ్లేస్

## సర్వదా మీ సేవకు సంసిద్ధం



నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌వారి సమగ్రమైన బ్యాంకింగ్ సర్వీసు ఇప్పుడు ఒక్క ఇండియాలో 40 బ్రాంచీల ద్వారా విస్తృతం చేయబడింది. ప్రతి బ్రాంచి అతి పెద్ద ఖాతానుగాని, అతి చిన్న ఖాతానుగాని సమర్థంతో నిర్వహించగల స్థితిలో కలదు.

మీ స్థానిక బ్రాంచికి వెళ్ళి అది ఎంత సమర్థంగా నిర్వహించబడుతున్నదో చూడండి. మీ బ్యాంకింగ్ సమస్య ఏది అయినా నేషనల్ అండ్ గ్రిండ్లేస్ మీకు సముచితమైన సలహా ఇవ్వగలదు.

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది — మెంబర్ల బాధ్యత పరిమితం

హెడ్ ఆఫీసు : 26, బిషప్స్‌గేట్, లండన్ ఇ.సి.2.

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు: 378 నేతాజి సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్: 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబిద్ రోడ్.

NGB/50 /B-TEL




## స్త్రీల సమస్యలు

"ఆలోచించి చూస్తే స్త్రీకి ప్రతిదీ సమస్యగానే తోస్తుంది" అని ఎస్. సుందరిగారు వ్రాసిన మాటలు అక్షరాలా నిజం. దీని క్కారణం కేవలం ప్రకృతిసిద్ధంగా స్త్రీ, పురుషుల మధ్యగల వ్యత్యాసాలు మాత్రమేకాక, విద్య, వివాహం, ఉద్యోగం మొదలయిన విషయాలలో మహిళలపట్ల మన సమాజం చూపుతున్న వివక్షతే ప్రధాన హేతువని అందరూ గుర్తించిన కఠోర సత్యం. అసలు మన సాంఘిక విలువలలో ఓ విప్లవాత్మకమైన పరిణామం రానిదే భారత స్త్రీకి విముక్తిలేదు. లోకం దృష్టిలోని వారికన్న, మనం తక్కువ అనే భావం ముందుగా ఆడవాళ్లలోనే అంతరించిపోవాలి. తాము అధికులము, అనే అహంభావము పురుషులలో ఎంత ఎక్కువగా ఉన్నదో, తాము ఎక్కువవారము అనే హీన మనస్తత్వం, స్త్రీలలో అంత తక్కువగానే ఉన్నదని చెప్పాలి. సమానత్వం అనేది ఒకరు దయతలచి, మరొకరికి ప్రసాదించేది కాదనీ, ఆత్మవిశ్వాసంతో, ఆత్మగౌరవంతో, క్రమశిక్షణతో, ధైర్య సాహసాలతో ఎవరికి వారు స్వశక్తితో సాధించుకొనేది మాత్రమేనని వనితాలోకం గ్రహించాలి. అంతేకాని, కేవలం ప్రభుత్వ సదుపాయాలకోసం మాత్రమే ప్రాధేయపడినందువల్ల ప్రయోజనం ఏమంత ఉండదు.

శ్రీమతి సత్యాశర్మ (హైదరాబాదు)

*　*　*

"సమస్యలు" వ్యాసం ద్వారా ఎస్. సుందరిగారు స్త్రీల సమస్యలన్నిటిని చక్కగా అర్థము చేసుకొని వెలువరించిన అభిప్రాయములు చాలా సంబుగా నున్నవి. నేటికాలపు స్త్రీలు తాము పై చదువులు చదివి, డిగ్రీలు పుచ్చుకొని, పురుషులతోపాటు ఉద్యోగములు చేస్తున్నంతమాత్రాన, తమ సమస్యలన్నీ తీరినవని ఎంచుట పొరపాటనియు, విశాలదృష్టితో తిలకించినచో స్త్రీలకు ప్రతిది సమస్యగనే గోచరించుననియు, అనే రచయిత్రిగారి అభిప్రాయములతో నేనూ ఏకీభవించుచున్నాను.

కుమారి పొర్ల లక్ష్మిదేవి (కడప)

*　*　*

పై శీర్షికపై యం. సరోజగారు చాలా బాగా భావాలు వ్యక్తం చేశారు. చివరలో కాస్త ఘాటుగా వ్రాస్తే, సాటి స్త్రీనైన నాకే బాధనిపించింది.

ప్రపంచంలో ప్రతీ పురుషుడు పరకాంతను తన తోటి సోదరిగా భావించుకుంటే, ఈనాడు అవినీతి పేరున స్త్రీకి అన్యాయం జరుగుటకు తావే ఉండదు. తమ అక్క చెల్లెళ్ళను తోటి పురుష పుంగవులు అనుకుంటారనే ధ్యాస ఆ సమయంలో నశిస్తుందనే చెప్పాలి. ఈ విషయంపై సృష్టికర్తనే నిందించాలి. అంతేగాని పురుషులపై పూర్తిగా నింద మోపడం రచయిత్రికి ధర్మంకాదు. పురుషుడు ఒంటరిగా పోయే స్త్రీని ఏదో చిలిపిగా కవ్వించి, అల్లరిచేస్తే తలవంచుకొని పోవటమే ఉత్తమం. స్త్రీ సహనం చూపటం చాలా అవసరం. ఈ ఒక్క విషయం మినహా, యం. సరోజగారు చక్కగానే వ్రాశారు అని చెప్పాలి.

తటవర్తి కృష్ణవేణి (సూర్యాపేట)

*　*　*

వ్యాసం ఒకే దృక్కోణంనుంచి పరిశీలించి వ్రాసినట్లు ఉందికాని, విశాల దృక్పథంతో వ్రాసినట్లు కనబడలేదు. పురుషులు స్త్రీలను అవహేళన చేస్తారని ఆవిడకున్న అభిప్రాయం కొంత వరకు సమంజసమే అయినా, ఆవిడగారి అవగాహనలో ఏదో లోపమున్నట్లు తోస్తుంది.

సమాజంపై నాగరికతయొక్క ప్రభావం ఎక్కువగాయున్న ఈ రోజులలో చదువుకున్న స్త్రీలు కూడ పురుషుల గురించి ఇంకా అమ్మమ్మల దృక్పథంతో ఆలోచించటం గర్హనీయం! చిన్న చిన్న విషయాలన్నిటికీ మన ఆడవాళ్ల మనస్తత్వంతో పెద్ద విలువ నిచ్చేకన్నా, ఉన్న పరిస్థితినిబట్టి తేలిగ్గా తీసుకోగలగటం ఎంతో మంచిది. ఆడవాళ్ళు, మగవాళ్ళు అనే వేర్పాటు ధోరణిలో చూచి, ప్రతి చిన్న విషయానికి అనుకంపించే మన్నిత మనస్తత్వంతో ఆలోచించేకన్నా, అక్కడి పని, పరిస్థితి, మనకున్న అవకాశం, హక్కులు మొదలైనవాటిని దృష్టిలో ఉంచుకొని, అందరితోనూ సమానంగా నడుచుకోగల్గటం, చదువుకున్నందుకు మనం అలవరచుకోవటమే కాకుండా, తోటి సోదరీమణులు కూడా అలా నడచుకోటానికి మనం మార్గదర్శకులు అవటం, మన స్త్రీ సమాజానికి, స్త్రీ, పురుష సత్సంబంధాలకీ, దానినిమించి దేశ పురోగమనానికీ ఎంతో ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను.

జ్యేష్ఠ లీలావతి (గాంధీగ్రాం)

## మనోబలం

"రత్నామహీధర్" గారి 'మనోబలం' వ్యాసంలో అంత ముఖ్యమయిన విషయాలు లేవు. స్త్రీకి "మనోబలం" తక్కువ అన్నమాట నిజమే. కానీ, ఇటువంటి వ్యాసములు వ్రాయటంవలన ప్రయోజనమేమిటో నాకు అర్థము కాలేదు.

దోర్నాదుల రాజేశ్వరి (నెల్లూరు)

*　*　*

రచయిత్రిగారు చాలా కోపంగాఉంది వ్రాసినట్టున్నారు—నేటి రోజుల్లో ఆడవారిని అనుమానించే మగవారికన్నా, మగవారిని అనుమానించే ఆడవారే ఎక్కువ!

గుండుమళ్ల రాధ (కటకము)

## అ ల స ట

వ్యాసము సవిస్తరముగా చదివితిని. శారీరకమయిన అలసట—మానసికమయిన అలసట అనే రెండు రకముల అలసటను గురించి బాగుగా విశదీకరించిరి. అలసటకు తగిన మందు 'విశ్రాంతి' అని, దానికి మించిన టానిక్ లేదని వ్రాసిరి. ఇది నిజమే అని నేను ఒప్పుకుంటాను.

మరువాడ వెంకట రమణమ్మ (కాశీబుగ్గ)

*　*　*

ముఖ్యంగా పల్లెటూళ్లలో చాలామంది విశ్రాంతి అనేది ఏమిటో ఎరుగనట్లే పని చేస్తారు. గృహకృత్యాలలో మనం చేసే పనులు ప్రతిదీ మారుతూనే ఉంటుంది ఒకే పని ఎక్కువసేపు గృహ కృత్యాలలో గృహిణికి తారసపడవు. అలసట, చికాకు మొదలైనవి మనం చేసే పనిమీద, చూపే ఉత్సాహం మీద ఆధారపడి ఉంటుంది. గృహకృత్యాలు మాని ఒకరోజు విశ్రాంతిగా ఉంటే ఏమీ తోచదు. అదే ఏదో పనిలో నిమగ్నమైతే ఒక అనిర్వచనీయమైన ఆనందం, విశ్రాంతి ఉంటుంది. ఇటువంటి వాటిలో అలసటకు తావే ఉండదు.

కుమారి అంబటి చంద్రకుమారి (అలహాబాదు)

*　*　*

వ్యాసము కొంతమంది స్త్రీలకు, పురుషులకు బుద్ధి చెప్పుటలో సందేహములేదు. పెద్ద పెద్ద కుటుంబములలో పనిపాటలులేక, శరీరము పెంచేవారు ఇప్పుడయినా ఈ వ్యాసము చదివి శరీరము వంచి పని చేస్తారని ఆశిస్తున్నా.

పిడికిటి కాంతారత్నం (కొయ్యగూరపాడు)

## స భ్య త

నా 'చిన్ని' వ్యాసంమీద 'అన్ని' విమర్శలు వచ్చినందుకు విచారిస్తున్నా. నేను పురుషులను దూషించటమే లక్ష్యంగా పెట్టుకుని వ్రాశాననేది మొదటి ఆరోపణ. అలాటి భావంతో వ్రాయలేదని లేఖకులకు సవినయంగ మనవి చేస్తున్నా. స్త్రీలంతా సభ్యతా వర్తనులని గాని, పురుషులంతా అసభ్యతా వర్తనులని గాని నేను ఎచ్చటా వ్రాయలేదు. ఒకానొక విద్యాధికుని ప్రవర్తన పూజనీయురాలైన నా స్నేహితురాలియెడ సభ్యతా రహితంగా ఉండటంతో — హృదయం వెలార్చిన ఆక్రందన ఆ వ్యాసం వ్రాయటానికి కారణభూతమవటంచేత— నేను ఆ వ్యాసాన్ని పురుషులవరకే పరిమితం చేయటం జరిగింది. నేను పురుషులను కించపరుస్తున్నానని అంటున్నారే గాని, నేను వ్రాసిన విషయాలు అపురూపమని, అసత్యాలని ఎవరూ అనలేకపోయారు. అసభ్యత అనేది స్త్రీ పురుషు లిరువురిలోను ఉంటుం

పైవారమే
ప్రారంభం!
'అందాలకు చిట్కాలు'

# వనితావాణి

దని, కేవలం పురుషులనే నిందించటం ఏపాటి వని బని మరి కొందరి ప్రశ్న. దీనికి కూడ పై వాక్యాల లోనే సమాధానం ఉంది. కేవలం పేరుకోసమే వ్రాశావని, మరొకరి అభియోగం. నిజంగ పేరు కోసమే వ్రాస్తే నామీద ఇన్ని అక్షింతలు పడేవటండీ మీ పిచ్చిగాని! ఉషా హేమచందర్‌గారి లేఖ బాగానే ఉంది—నవ్వుకోటానికి. "పురుషుల అసభ్యతా వర్తనకు మేమేమీ లోను కావటల్లే"దంటూ, పాఠకులంతా ఏక కంఠంగ చెపుతుంటే ఆనందపడాల్సివస్తోంది మరి!—తప్పదు.

"ఉన్నమాట అంటేనే ఉలిక్కి పడాలా?
నిజమాడే కలాన్నే విడాలా?"

—బాల.

* * *

ఇక ఈ వ్యాసం పైన చర్చ నిలిపి వేస్తున్నాము.



# వంటలు

## గుమ్మడికాయ హల్వా

| | |
|---|---|
| బూడిద గుమ్మడి కాయ కోరు | అర్థవవును |
| నెయ్యి | 3 అవున్సులు |
| చక్కెర | పావు వవును |
| జీడిపప్పు | కొన్ని |
| కిస్‌మిస్ | కొన్ని |
| ఏలకులు | 3-4 |
| లవంగాలు | 3 |
| కుంకుమపువ్వు | చిటికెడు |

గుమ్మడికాయ—కోరు సన్నని గుడ్డలో కట్టి నీరంతా పోయేదాకా పిండి, రెండు మూడు చెంచాల నేతిలో వేయించాలి. చక్కెర, కుంకుమపువ్వు చేర్చాలి. గట్టిపడుతూ ఉండగా మిగతా నెయ్యి వేసి గట్టి పడేదాకా వండాలి. ఆపైన జీడి పప్పు, కిస్‌మిస్, పొడిచేసిన ఏలకులు, లవంగాలు కలపాలి. అయిన తర్వాత చమురు చేసిన పళ్లెం మీదకు మార్చవచ్చు.



## చదువల్రావు - బి. వి. సత్యమూర్తి

కాలేజీడే ఫంక్షన్ అయ్యాకా...
గురూగురూ నేను దిగబెడ్తాను నేను...
బస్‌స్టేండ్ వరకూ
ఓక్కు
ఆజేస్ ఆటో
తీసుకుని బస్‌స్టేండ్ దాకా దిగబెట్టేరారా శంకరం...
నువ్వు మన యూనియన్ రూమ్‌లో ఉన్న ఆడవాళ్ల ని దిగబెట్టేరారా
ఓ య్యాస్ ఓసారి అద్దం లో చూస్కో
యూనియన్ రూమ్‌లోకి అడుగు బెడ్తూనే.
వచ్చావా దేవుడా
ఓ..OOOO
బయల్దేరు నాయనా ఇంతోటి రెండు ముళ్ళకి బస్సు కూడా ఎందుకు, నడిచి ఇంటిదాకా వెళ్దాం పదనాయనా



ఎలిజబెత్ టేలర్

రిచర్డ్ బర్టన్‌మాత్రం నిశ్చితంగా ఉన్నాడు. ఒకరోజు సెట్‌నుంచి తిరిగివస్తూ—అంతకు ముందే మార్క్ ఆంటోనీగా వేసిన బర్టన్ (క్లియోపాత్రాగా) లిజ్ టేలర్ నగ్నంగా ఒక పడకమీద పడుకుని ఉండగా తీసిన దృశ్యం చూశాడు ఇలా అన్నాడు "చాలా అద్భుతమయిన 'షాట్!' ఈ చిత్రం తీయటానికి 20 మిలియన్‌లు దాటి ఉండవచ్చు కాని, ఈ ఒక్క సీన్‌కే 20 మిలియన్ ఇవ్వవచ్చు!"

బర్టన్ తన డబ్బు పెట్టలేదుగా

ప్రొడ్యూసర్ వాంగర్‌ని చిత్రం ముగిసే సమయంలో చూస్తే, ప్రపంచంలోని చికాకులన్నీ ఇతనే భరిస్తున్నాడా అనిపిస్తుంది అనిపించినా తప్పు లేదు 'క్లియోపాత్రా' కనక 'హిట్' కాకపోతే, ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్ వారికి ట్వెంటిఫస్ట్ సెంచరీ చూసే అవకాశం ఉండదేమో!

ప్రేక్షకలోకం నిజంగానే లిజ్ 'అల్లరులు' చూసి, విసుగిపోయిఉంటే లిజ్ భవిష్యత్తు సంగతేమిటి? ఆమె మరీ మితిమీరిపోయిందా? ఆమెకి ముందు, అమెరికన్ నటి జేన్ మాన్స్‌ఫీల్డ్, ఫ్రెంచి నటి బ్రిజిట్‌బార్‌డో, ఇలాగే హద్దు మీరిపోయి తమ బాక్సాఫీసు అవకాశాలు చెడగొట్టుకున్నారు

లిజ్ మూలంగా ఎడీఫిషర్ డెబ్బీరోనాల్డ్స్‌ని వదిలేసినప్పుడే ప్రజలలో అసంతృప్తి బయలుదేరింది 'భర్తలదొంగ' అని, 'గృహధ్వంసకురా'లని తిట్టారు కాని, ఈ వివాహం "జీవితాంతం వర్ధిల్లేది" అని ఆమె అనగానే ప్రేక్షకలోకం కొంచెం సహనం చూపించింది

'జీవితాంతం' చాలా తక్కువ కాలమేనని తేలింది

ప్రజల వైఖరి ఎలా ఉంది?

నిజం చెప్పాలంటే—'క్లియోపాత్రా' విజయం లిజ్ 'ప్రశస్తి'మీద ఆధారపడిఉంది కారీగ్రాంట్ కాని, రాక్ హడ్సన్‌కాని, గ్రెగరీపెక్‌గాని ఆమెతో నటించిఉంటే ఈ బాధ ఉండేదికాదు ఆమె 'సహ—నటులు' బర్టన్' హారిసన్‌లు ఇద్దరూ బాక్సాఫీసు హీరోలుకారు

# రెండు రూపాల మనిషి

రెండు రూపాల మనిషి

**త**ల్లిగా, స్త్రీగా, లిజ్ టేలర్‌ని గురించి ఎవరేమనుకున్నా, నటిగా ఆమెను మించిన హాలీవుడ్ తార అసలు లేదనే చెప్పాలి. చివరికి గార్బో, కూడా ఆమెతో సరితూగలేదేమో!

'క్లియోపాత్రా' ప్రొడ్యూసర్ రాబర్ట్ వాంగర్ నాతో ఒకసారి అన్నాడు: "టైటిల్స్‌లో ఆమె పేరు కనిస్తేచాలు. చిత్రం బాగా డబ్బుచేస్తుంది. ప్రపంచానికంతకీ బాక్సాఫీస్ స్టార్ ఆమె ఒకతే!"

ఈ ఆమె వివాహం—ఎడీఫిషర్‌తో—భగ్నం అయిపోవటానికిముందు ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్‌వారి ఆందోళన ఏమిటంటే ఈ విడాకులవల్ల ప్రజలకి ఆమెమీదవున్న అభిమానం తగ్గిందా అని 'క్లియోపాత్రా' సినిమా ముగిసి విడుదల అయ్యేవరకూ దీని వార్త బయటికి పొక్కకుండా ఉంటే బాగుండేదని వీరి అభిప్రాయం.

ఏది ఎట్లాఉన్నా ఈ చిత్రంమీద పెట్టుబడి తిరిగి రావడం చాలా కష్టం. లిజ్ అస్వస్థత, డయిరెక్టర్ మార్పు, షూటింగ్ జరిగే కాలంలో వాతావరణం చెడిపోవటం, ఇవన్నీ కలిసి ఖర్చులు విపరీతంగా పెరిగిపోయాయి—ఇప్పటికి మొత్తంమీద 20—25 మిలియన్‌ల డాలర్లు అయ్యాయి (సుమారు 10—12.5 కోట్ల రూపాయలు)

"ఇంతకుముందు ఏ తారకీ ఇంత బాధ్యత లేదు" అన్నాడు మాంకీయెవిట్జ్ వాత్, "ఇది ఆమె కొక విషమ పరీక్ష"

లిజ్ క్లియోపాత్రాకోసం పని చేసినట్లు ఏ సినిమాతారా ఏ స్టూడియోలోనూ నటించి ఉండదేమో! డయిరక్టర్‌నుంచి తోటి నటులవరకూ అందరూ ఆమెని పొగడేవారే

లిజ్‌ని ఎవరయినా పొగిడితే, చిరునవ్వు నవ్వి ఊరుకుంటుంది అయితే, ఒక షూటింగ్ తర్వాత మాత్రం ఆమె నిలకడ తప్పిపోయింది

మాంకీయెవిట్జ్ 'కట్' అనగానే సెట్‌మీద వారందరూ హర్షధ్వానాలు చేయడం ప్రారంభించారు ఈ ధ్వనులు స్టూడియో బయటికి కూడా వినిపించాయి

లిజ్ ముఖం సిగ్గుతో ఎర్రబడింది

"ఏమిటిదంతా?" అంది డయిరెక్టర్‌తో

—43 వ పేజీ చూడండి

# అవీ - ఇవీ - అన్నీ

## ఆత్మబంధువు
(వెండితెర నవల)

సారథి స్టూడియోసవారి ఆత్మబంధువు చిత్రం యొక్క వెండితెర నవల మా కార్యాలయం చేరింది దీనిని కూర్చినది శ్రీ పిచ్చేశ్వరరావు బొమ్మలు శ్రీ టి వి యస్ శర్మ, ఈ పుస్తకం కావల్సినవారు, మధు బుక్స్; మొగల్రాజపురం: విజయవాడ నించి పొందవచ్చును. సినిమా నవలలు లేదా వెండితెర నవలలనేవాటికి ఒక ఒరవడి పడిపోయి పాఠకు లనేకులు (ప్రేక్షకులలో) వీటికి ఏర్పడ్డ ఈ తరుణంలో వీటి గెటప్‌కు వలసిన ప్రత్యేకతలు స్పష్టం వున్నాయి. ఈ ఆత్మబంధువు వెండితెర నవలలో టి.వి. యస్. బొమ్మలూ ముఖచిత్రం రెండూ చాలా ఆకర్షణీయంగా వున్నాయి.

* *

సంక్రాంతి పుంజాల్నా సినిమాలు యీ నెలలో పోటీలుగా దిగబడిన యీ తరుణంలో సినిమాలను చూడటంమీద వున్నమోజు పాఠకులకు వాటి గురించి వినడంమీద వుండదేమో. ఐనా పౌరాణి కాల కాలం కాదనే పిల్లేరంటూ కృష్ణార్జునయుద్ధం దేశం మీదకు వెళ్ళింది. ఈ యుద్ధంలో వున్నది కేవలం జనరంజనమే గనుక, పైగా రెండు హీరోలున్న ప్రత్యేకత వున్నది గనుక, యీ చిత్రం సాంఘి కాలమీద నవాలుగానే వుండొచ్చును. దేశంలో విడుదల అవుతున్న చిత్రాల్లో చిట్టితమ్ముడు కథలోని కొత్తదనమూ, ఇరుగుపొరుగులోని రేలంగి సంధ్యల కొత్తదైన నటన, ప్రేక్షకుల నాకర్షిస్తే వాటి కథలమీద తర్జన భర్జనల అవసరమేలేదు.

## మంచి నటన

చిట్టితమ్ముడులో 'సాయిబు'గా అక్కడక్కడా అగుపించిన సి. ఎస్. ఆర్., ఆ మధ్య అగుపించినప్పుడు ఏదో ఛలోక్తిగా "ఆఁ! అంతా బలం సన్నగిల్లి బలగమే మిగిలింది....అయినా ఈ చిత్రపరిశ్రమలో "యుద్ధముల వారియు తెరినంతమాత్రాన ఖాతరుండదు సుమా" అనే ధోరణిలో అన్నా, ఇరుగుపొరుగులో ఈ వెటరన్ నటుని అనుభవం, అధ్యయనం రెండూ బయటపడ్డాయి. ఈ చిత్రం యితర్రతా ఎలావున్నా శ్రీ సి.ఎస్.ఆర్. పాత్ర కొక విశిష్టతను చేకూర్చింది. పాత్రకు ప్రాణప్రతిష్ట చేయగల పాతకొత్తల మేలు కలయికగా మిగిలిన నటుల్లో, శ్రీ సి. ఎస్. ఆర్‌ను మొదట చెప్పాలి, ఇప్పుడు. హాస్యం కోసం వాడుకున్నా గాంభీర్యం కోసరం వాడుకున్నా ఎలా వాడుకున్నాసరే యీయువ సామర్థ్యం బయటపడి ఇది నేను యిలా చేయగలను" అనే స్థాయి అగుపిస్తుంది లేదు సినలు నటునిలో — వెనుక మనం ఓసారి అనుకున్నట్లు యిలాంటి నటులను వాడుకోగల పాత్రచిత్రణ రానురాను కొరవడుతున్నది మన పరిశ్రమలో ప్చ్! ప్చ్!

## యువ దర్శకులు

కులగోత్రాలు ... విజయగాంతం ...

...నికి ఛాయ, సంగీతం యిత్యాది ఒక కారణమైతే దాని సారథి, ప్రత్యగాత్మ ప్రజ్ఞ అంతా ఒక ఎత్తు. ఈ యువ దర్శక రచయిత లో కొత్తదనానికి అర్రులుజాచే ఉత్సాహమున్నది ప్రేక్షకులకు లేనిపోని సెంటిమెంట్సు అంటగట్టి మనకు చాతకాని, చెయ్య సాహసంలేనివాటిని వాళ్ళనెత్తిన రుద్దడం ... వాటిల



ఆర్. యస్. ఆర్. వారి "విజయనగర వీరపుత్రుని కథ"లో ...



“పెంపుడు కూతురు” చిత్రంలో హరనాథ్, దేవిక.



జూపిటర్ పిక్చర్స్ “వాల్మీకి”లో లీలావతి, ఎన్. టి. రామారావు.

# అవీ - ఇవీ - అన్నీ

సందర్భంలో అన్నారు ఒక ధ్యేయంతో పకడ్బందీగా పాత్రకు రూపకల్పన యివ్వాలి అనే దీక్షగల ఈ యువదర్శకుడు, కులగోత్రాలను హిందీతెరకు మళ్ళే ప్రయత్నాల్లో వున్నారు

భార్యా భర్తలుకూడా హిందీ ప్రేక్షకులను బాగానే ఆకర్షిస్తుందని భావించవచ్చును ప్రస్తుతం శ్రీ ప్రత్యగాత్మ పి ఏ పి వారికి కొత్త కథను తయారు చేస్తున్నారు గుల్షన్‌నందా (హిందీ) నవల వాధారంగా వీరి తదుపరి చిత్రం రావచ్చును. శ్రీ ప్రత్యగాత్మకు మంచి “సినీ బొమ్మలు” వెయ్యడంలో ఆసక్తి ఉన్నది కుల గోత్రాలు, భార్యా భర్తలు శ్రద్ధగా చూస్తే మనం ఈ విషయం గ్రహిస్తాం

శ్రీ సి ఎస్ రావు దర్శకత్వన వాల్మీకి పూర్తయిందనే చెప్పవచ్చును శ్రీ రావుకు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలు, దేశీయమైన ధ్యేయం గట్టివి ఉన్నాయి మనం మన గొప్పతనం ఇతరులకు తేటగా నాటిగా చెప్పాలని, ఆకాంక్షించే తెలివైన మంచి దర్శకుడు శ్రీ రావు ఈయన డంకా బజాయించిన చిత్రాలు తీశారు మంచివి అనిపించుకున్న చిత్రాలు తీశారు అనుభవం, ఉత్సాహం రెంటితోపాటు సాహిత్య సరసప్రియత్వంగల ఈయన సారధ్యాన వెలువడుతున్న మరో చిత్రం, “వాల్మీకి”, త్వరలోనే విడుదల కావచ్చును పోతే వోల్గా ప్రొడక్షన్ వారు నెం 1 చిత్రం పూర్తి చేసుకు నామకరణ మహోత్సవంలోనే మునిగి ఉంటున్నారు ఆ పేరింకా మనదాకా రాలేదు.

## రక్షణనిధికై

మనకి కూడ రాష్ట్రపతి ‘అవార్డు’ చిత్రాలు ఉన్నాయిగా (అసలీ అవార్డు భాషకోట ఉంటుందిగాదా?) రక్షణనిధికి నవయుగ ఫిలింస్ (వాళ్ల దగ్గర అవార్డు బాపతు చాలా చిత్రాలున్నాయి )వారూ, చిత్రాలనిర్మాతలుకలిసి హైదరాబాద్,విశాఖపట్నాల్లో ఈనెల 4, 11 తేదీలలో నమ్మినబంటు, జయభేరి, తోడికోడళ్ళు, భార్యాభర్తలు, కాళిదాసు, మాంగల్య బలం, మా ఇంటి మహాలక్ష్మి ఇత్యాదులు వేశాక ఆ మొత్తం రక్షణనిధికి వెళ్తుందని తెలిపారు.

## “నైన్ అవర్స్ టు రామా”

అవీ, ఇవీ అన్నీ అంటూ మాట్లాడుతున్నాముకదా ఈ ‘అన్నీ’? అనే పదానికి కాస్త న్యాయం చేకూర్చే లాగ ఏమేనా చెబుదామా అంటే ఆమధ్య గాంధీ మహాత్ముని “అంతిమ ఘడియల”మీద మార్క్ రాబిన్సన్ చిత్రం తీసిన సంగతి పాఠకులకు జ్ఞాపకం చెయ్యవల్సి వచ్చింది “డే ఆఫ్ డార్క్‌నెస్” అనే పుస్తకం (అంధకార దినం) ఒకటి స్టేన్లీ వాల్పోర్ట్ అనే వ్యక్తి రాశాడు అయితే ఈ పుస్తకం (కొన్ని కాపీలు



విలాసంగా ఉన్న యీ తార దేవిక. ఫొటో: ప్రభాకర్.



వోల్గా ప్రొడక్షన్స్ చిత్రంలో రేలంగి, అంజలీదేవి.

# అవీ - ఇవీ - అన్నీ

దిగువ ఆ ...య్యాయలేదండి) మనవాళ్ళు చదువ కూడదనే ఉద్దేశంతో, ఇందులో అభ్యంతరకర మైన కల్పనలున్నాయనే నమ్మకంతో, దేశంలోకి రానివ్వలేదుట కాని, దీన్ని ఆధారంగా చేసుకునే మార్క్ రాబిన్‌సన్ 'నైన్ అవర్స్ టు రామా' అనే సినిమాను మనదేశంలోనే తీశాడు గాంధీమహాత్ముని వేషంలో కాశ్యప్ అనే భారతీయుడే అగుపించాడు మొత్తానికి ఈ సినిమా గురించి చెలరేగిన దుమారం ఎటూ పొందకుండానే పోయింది అప్పుడు. సినిమా పూర్తైనతర్వాత భారతదేశానికి చూపించి మరీ దాన్ని విడుదల చేయాలి అనే మాట పుచ్చుకుని మరీ ఈ సినిమా తీసుకోనిచ్చామని వెనుకటికి మన ప్రభుత్వం అన్నట్లు తెలుస్తోంది

అయితే న్యాయం శాస్త్రం ఇత్యాది కొన్ని నాగరికమైన సూత్రాలున్నాయిగా ఒక విదేశీ సంస్థ మన దేశాన తీసిన ఒకానొక సినిమాను మరో విదేశంలో చూపడానికి మన అనుమతి కావాలి లాంటి సూత్రం ఎక్కడా లేదట ఆ విషయం ఒక్కటే ఇప్పుడు మనకి తెలిసింది ఐతే ఒక ఓదార్పు ఈ యిస్కోపును మన ప్రభుత్వంవారు చూసి అనుమతించనిదే సెన్సార్‌కుపెట్టి మనదేశంలో మనకళ్ళబడ న్నరట (అదెంతకాదు!!)

దిన్న ప్రధాని నెహ్రూ తదితర మంత్రి ప్రభృతులు రాష్ట్రపతి భవనంలో చూశారనీ, వారింకా ఏలాంటి అభిప్రాయాన్ని సమాచార మంత్రిశాఖకు అందించలేదని తెలుస్తోంది మహాత్ముడు గొప్పవాడని అందరికీతెలిసిన ఈ తరుణంలోనే ఇలాంటి అభిప్రాయభేదాలుగల చిత్రం ఒకటి రావడం గురించి ఎవరేనా, ఏమేనా బాధపడ్డా తప్పు లేదుగా ఇక

# హిందీ చిత్రాలగురించి

జె ఎల్ ప్రాషర్ అనే హిందీ నిర్మాత ఎంగ్లియను తామర్‌లేన్ కథతో ఒక చిత్రం తీయ సంకల్పించాడట

అదే నిర్మాత మరో చిత్రం 25 సం ల క్రితంనాటి లక్నో నగర ముస్లిం వాతావరణంతో తీయదల్చుకునారట ఈ రెండు చిత్రాలకు ఎస్ దత్తా సంగీతం సమకూర్చుతాడు

బి ఎస్ రంగా హిందీ చిత్రం తాలూకు 5 పాటలు రికార్డ్ చేశారు ఈయన తీస్తున్న హిందీ చిత్రానికి యింకా పేరు పెట్టలేదు ఈ చిత్రంలో బి సరోజాదేవి, షమ్మికపూర్‌లు నాయకులుగా నటిస్తున్నారు అని వినికిడి

త్వరలో ప్రారంభం!

## తెరమీద - తెర వెనుక

సరికొత్త సినిమా శీర్షిక

ఎదురు చూడండి

*

బొంబాయి సినిమా తారల

వ్యాసాలు!

## బడీ బహెన్

ప్రొడ్యూసర్, డైరెక్టర్ అమర్‌నాథ్ తన చిత్రం బడీ బహెన్ షూటింగు జోరుగా సాగిస్తున్నారు. ఇందులో జాయ్ ముఖర్జీ, వైజయంతిమాలా నటిస్తున్నారు

## కొత్త కలయిక

చాలా రోజులయింది చిత్రగుప్త (సంగీత దర్శకుడు) ఆశా భోంస్లే పాటను అనుమతించడంలేదు గాని యీ యిద్దరూ ఈమధ్య రాజీపడ్డారు ఆశాభోంస్లే 4 పాటలు ఈమధ్య చిత్రగుప్త కోసరం పాడింది

## ఘర్ బసాకే దేఖో

కొత్త హిందీ చిత్రం "ఘర్ బసాకే దేఖో" అనే దానిలో ప్రదీప్‌కుమార్ నటిస్తున్నాడు దీని ప్రొడ్యూసర్ త్రికంభాయి రత్నదీప్ పిక్చర్స్ పేరిట దీన్ని తీస్తున్నారు దీనికి కూడా చిత్రగుప్త సంగీత దర్శకుడు

## ఎదురీత

సంక్రాంతికి దేశంలో విడుదలైన "ఎం ఎ వి. చిత్రం 'ఎదురీత'లోని మాటలూ, పాటలూ చేర్చి కూర్చిన వెండితెర నవల మా కార్యాలయం చేరింది. వెల 75 న. పై. గెటప్ బాగుంది

—వి. కృష్ణానంద్



సి. ఏ. పి. నిర్మాత శ్రీ సుబ్బారావుకు వారి సాంకేతిక బృందం సన్మానం చేసినప్పుడు తీసిన ఛాయాచిత్రం.

ఆర్. ఎస్. ఆర్. వారి 'విజయనగర వీరపుత్రుని కథ'లో పంఢరి.





## స్వోత్కర్ష

పదవి లేక ఏకులం!
అది వస్తే మేకులం!
'పదవి పదవి' అని అరిచే
నాయకులం! కాకులం!
మాటలలో రసికులం!
కోటలలో శిశుకులం!
పదవీ ఆరాధకులం!
భతుకులం! తతుకులం!
మేము ప్రజా సేవకులం!
ప్రజ నౌకల నావికులం!
రాజకీయ నాయకులం!
మాకు తెలుసు సకలం!
ప్రజలందరికీ హితులం!
పదవీ వ్యామోహితులం!
పదవి లేక బాధితులం
పదవి కొఱకు ఆశ్రితులం!
ప్రజా రుధిర పానంచే
బ్రతుకుతున్న నల్లులం
కోట్ల ప్రజల ప్రాణాల్తో
ఆటలాడే పిల్లులం!
పదవి ఎంగిలాకు కొరకు
పోట్లాడే కుక్కలం!
అధికారపు గోతికాడ
కాచుకున్న నక్కలం!
పదవి పచ్చగడ్డి మేసి
తెగ బలసిన ఎద్దులం
పదవి వల్ల కాటిచుట్టు
తిరుగాడే గ్రద్దలం!
రాజకీయ తోటలలో
పందిళ్లకు గాటలం
ప్రజాస్వామ్య బాటలం
ప్రజారాజ్య కోటలం!
మేము ప్రజా ప్రతినిధులం!
ప్రజల నిధికి ప్రతినిధులం
ప్రజా శకట సారథులం
ఆ వోట్లకి వారథులం!

'శ్రీశ్రీ'★

* * *

ఓ పెద్దమనిషి రామారావును పలకరించటానికి వెళ్లాడు. "ఏం నాయనా! విల్లు వ్రాసేటప్పుడన్నా మామగారు గుర్తు పట్టారా నిన్ను."

"అయ్యో అదేమిటండీ అలా అడుగుతారు! అందుకే ఆయన నాపేర చిల్లిగవ్వ కూడా వ్రాయలేదు" వాపోయాడు రామారావు.

నాగభూషణం (మద్రాసు)★






# పాపం! చదువుకొన్నబ్బాయి

యస్. సరస్వతి



'వదినా!' అన్న పిలుపు విని, హాలులో కూర్చుని చదువుకుంటున్న సంధ్య, తలెత్తి శేఖర్‌ని చూసి ఆశ్చర్యపోయింది. తత్తరపాటుతో లేచి నించుని "రండి" అంది.

"వదిన ఇంట్లో ఉన్నదా?" అని ప్రశ్నించేడు శేఖర్. "ఉన్నదండి, పిలుస్తాను! కూర్చోండి" అంటూ మర్యాదగా జవాబు చెప్పి వంటింట్లో పని చేస్తున్న అక్కయ్యదగ్గరికి పరుగెత్తింది. "అక్కయ్యా!" అంటూ బిగ్గరగా అరుస్తున్న సంధ్య కేకలకి—తనతో ఎంతో వినయంగా మాట్లాడిన సంధ్య వాళ్ల అక్కయ్యతో అంత గట్టిగా మాట్లాడటం చూసి నవ్వుకొన్నాడు శేఖర్.

"అబ్బా! ఎందుకే అలా అరుస్తావు? ఎవరు వచ్చారు?" అంది వాళ్లక్కయ్య సరళ.

"ఎవరో వస్తే నీ దగ్గరకు ఎందుకు వస్తానక్కా? మీ శేఖర్‌బాబు వచ్చాడే!" అంది సంధ్య.

"అలాగా! వస్తానుండు! అంతవరకు నువ్వు మాట్లాడుతూ ఉండు" అంటున్న అక్కయ్య మాటలు వినకుండా మేడమీదకి వెళ్లిపోయింది సంధ్య.

"ఏం శేఖర్! రావడమే మానివేశావు?" అంది హాలులోకి వస్తూ సరళ.

"లేదొదినా! అసలు తీరిక ఉండటంలేదు, అన్నయ్యను, నిన్ను చూసి చాలా రోజులైంది. అన్నయ్య ఎక్కడకు వెళ్లాడు? ఈ రోజు ఆదివారం కదా! ఇంట్లో ఉంటాడని వచ్చాను" అన్నాడు శేఖర్.

"లేరు బాబు! ఎవరో స్నేహితుడు వెళ్లిపోతున్నారని, స్టేషనుకు వెళ్లారు." అంది సరళ.

41 వ పేజీ చూడండి

అతి త్వరలో విడుదల!

కవిత కొమ్మల కెక్కి మధురాక్షరమ్ముగా
రామ రామా అన్న కలకూజితమ్మదే
ఆది కావ్యామ్నాయి : ఆ రఘూత్తంసుని
కవిత గొల్పిన ఆది కవియె—

# వాల్మీకి

ఎన్.టి.రామారావు
కాంతారావు రాజనాల రఘురామయ్య
పద్మనాభం రాజసులోచన లీలావతి మీనాక్షమూర్తి.

రచన, సముద్రాల రాఘవాచార్య
సంగీతం ఘంటసాల • కెమేరా, రహమాన్
దర్శకత్వం సి. ఎస్. రావు

నిర్మాతలు 

జూపిటర్ పిక్చర్స్ మద్రాసు

ఈస్టిండియా రిలీజ్

## జరిగిన కథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది సంపన్న కుటుంబికుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్ళిపోతాడు గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు, సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది ఆమె భర్త చనిపోయి రెండు నెలలైంది ఆర్యాపురంలో ఆమెకు యిల్లువుంది అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటే ఆకర్షణ ఏర్పడుతుంది శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు

(గత సంచిక తరువాయి)



అనసూయమ్మకు రెండు మూడు రోజుల బాగా జ్వరం కాచింది. అందువల్ల శ్రీదేవి ఎక్కడికీ కదలలేదు. మరునాడు సావిత్రీ, శ్యామలా కలిసి శ్రీదేవివద్దకు వచ్చారు వాళ్లను మేడమీద తన గదిలోకి తీసుకువెళ్లింది శ్రీదేవి. వాళ్ళు శ్రీదేవితో చాలా సరదాగా మాట్లాడసాగారు. శ్యామల, తను మరునాడు భర్తతో కలిసి బొంబాయి వెళ్ళిపోతున్నానని, వెళ్ళేముందు శ్రీదేవి నొకసారి చూచి, ఆమె వాయిద్యం విందామనీ వచ్చానంది. సావిత్రి తన రాకకు ముఖ్యకారణం తనేననీ, తను ఎంతో బలవంతం చెయ్యడంవల్ల శ్యామల వచ్చిందనీ, లేకపోతే వాళ్ళాయనను వదిలిపెట్టి రావడానికి ఆమె కిష్టంలేదనీ చెప్పింది. శ్యామల, సావిత్రి అన్నీ అబద్ధాలు చెప్తుంది నమ్మవద్దంది.

"పోనీ, నే నన్నది అబద్ధం అని ఇంకెవరిచేతైనా అనిపించు. నువ్వు ఆయనతో కలిసి ఈ ఊరొచ్చిన దగ్గర్నుంచీ, మా ఎవరిళ్లకైనా వచ్చావా? కాలేజీలో మనం కలుసుకున్న తరువాత మళ్లీ నా కెప్పుడైనా కన్పించావా?" అంది సావిత్రి.

"అదికాదు. మరి, ఆయనకు ఈ ఊళ్లో ఏమీ తోచటంలేదని, నన్ను ఇరవైనాలుగు గంటలూ తన దగ్గరే కూచోమంటూంటే ఏం చెయ్యడం?" అంది శ్యామల.

"హవ్వ! ఇదేం విడ్డూరమమ్మా? ఎంత కొత్తగా పెళ్లయితేమాత్రం, రోజల్లా మీ ఇద్దరూ గదిలో తలుపులేసుకు కూర్చోడం ఏమన్నా బావుందా?" అంది సావిత్రి, కళ్లు పెద్దవి చేస్తూ, పెద్దవాళ్ల ననుకరిస్తూ.

"మేమేం తలుపులేసుకు కూర్చోలేదు" అంది శ్యామల కోపంగా మూతి ముడుచుకొని.

"అయితే ............?" అంది సావిత్రి మధ్యలోనే తన మాటను ఆపేసి, నాలిక కరుచుకుంటూ.

"ఛీ! నీతో అసలు మాట్లాడకూడదు" అంది శ్యామల.

"అవునులే, మాతో ఎందుకు మాట్లాడతావూ? ఇప్పుడు మేము కారం, వెగటూనూ—ఆయన తీపీ, మంచీను" అంది సావిత్రి తను కూడా కోపం వచ్చినట్లు మొహం ప్రక్కకి తిప్పి.

ఒద్దరూ ఇంత తమాషాగా వేళాకోళం చేసుకుంటూంటే శ్రీదేవికి నవ్వుమాత్రమేకాక, ఆశ్చర్యం కూడా వేసింది. బయట ప్రపంచానికి ఎంతో అమాయకులుగా కన్పించే యువతులు వారిలో వారు కలుసుకొంటే ఎలాంటి వేళాకోళాలు చేసుకుంటారో ఆమె కంతవరకూ తెలియదు. వయస్సులోఉన్న యువతులు తమ మనస్సుల్లోని కోర్కెల్ని, మాటల్లో గుమ్మరిస్తారని ఆమె అనుకోలేదు. సావిత్రి చమత్కారంగా మాట్లాడుతుంది. కాని, ఆమె మాట కుండ బ్రద్దలు కొట్టినట్లుంటుంది. ఉన్నది ఉన్నట్లు అనడం ఆమె కిష్టం. ఆమెకు దాపరికం నచ్చదు. శ్యామలకు అంత పూర్తిగా బయట పడడం ఇష్టం ఉండదు. శ్రీదేవికి వాళ్ల సంభాషణ చక్కిలిగింతలు పెట్టినట్లుంది.

"పోనీ, అంతా తీపే తినలేంకదా! కారం కూడా ఉండాలి" అంది శ్రీదేవి నవ్వుతూ. శ్యామల కూడా

35-వ పేజీ చూడండి



**రైలు స్నేహితమనేది పాఠకులకి విదితమే. "విమాన స్నేహితులు" అనే క్రొత్త పదాన్ని కూడా దయచేసి దానితో బాటు చేర్చుకోవాలి.**

శ్రీ కె. ఆర్. రంగభాష్యానికి, నాకూ పూర్వమే పరిచయమున్నానూ, విమాన ప్రయాణ మప్పుడే మాకు స్నేహం ఏర్పడింది. శీఘ్రంలోనే ఆ స్నేహం ముదిరి బలపడింది.

ఒకసారి క్రొత్త ఢిల్లీకి విమానయాత్ర చేసి నప్పుడు నాకు ప్రక్కన రంగభాష్యం కూర్చు న్నాడు. విమానంలో ఒక ప్రక్క ఆసనంలో నేను ఉన్నాను. నా ప్రక్కనే విమానంయొక్క చిన్న అద్దాల కిటికీ ఉన్నది. రంగభాష్యం నాకు ఆ ప్రక్కగా ఉన్నందువలన, అస్తమానం మెడని త్రిప్పి, ముఖాన్ని చాచి, ఆ చిన్న అద్దాల కిటికీగుండా క్రిందకి చూడ యత్నించసాగాడు. క్రిందది ఏదీ అధికంగా అతని వలన చూడ్డానికి సాధ్యం కాలేదు. ఇది రంగభాష్యం యొక్క ముఖంలో స్పష్టంగా ద్యోతకమయింది.

"కావలంటే మనం స్థలాలు మార్చుకుని కూర్చుందామా? ఈ కిటికీ ప్రక్కకి మీరు వస్తారా" అన్నాను.

అది అతని చెవిన బడలేదు కామోలు! కానీ, నాతో మాట్లాడ్డానికి ఆ సందర్భాన్ని వాడుకొని, "తర్వాత ఆగేస్థలం నాగపూరేకదూ!" అని ప్రశ్నిం చాడు.

నేను తల ఆడించాను.

"నాగపూరు అయిఉండదు. మధ్యలో సికింద్రా బాదు ఒకటి ఉందిగా" అతనే తిరిగి అన్నాడు.

"అవును; సికింద్రాబాదు ఒకటి మధ్యలో దాపరిస్తుంది" అని నేను అన్నాను.

"మీరు ఢిల్లీకే వెళ్తున్నారా?" అని రంగభాష్యం ప్రశ్నించాడు. తిరిగి తల ఆడించాను.

"నేనూ ఢిల్లీకే వెళ్తున్నాను. ఆకాశ విమా నంలో మీకు ఇదే మొదటిసారి ప్రయాణమేమిటి?"

ఇదెక్కడి గోలరా అని అనుకున్నాను. ఈ అధిక ప్రసంగి అడిగే ప్రశ్న లన్నింటికీ జవాబు ఎవరివ్వ గలరు? ఈసారి విమానం దిగి ఎక్కేటప్పుడు స్థలం మార్చికూర్చోవలసిందే. చెవులో దూది క్రుక్కు కుని ఇతనితో ఎవరు అరవగలరు?

ఇలా నేను అనుకుంటుండగానే విమాన ఉపచారిణి రమణి అక్కడకు వచ్చింది. చేతిలోని పిప్పరమెంటు పెట్టెని సాచి, "స్వీట్సు కావాలా? కాఫీయేనా, టీయేనా కావాలా?" అని అడిగింది. రంగభాష్యం ఆమె ముఖాన్ని తేరిపారజూచాడు. అతని ముఖం ఆముదం త్రాగినవాడి ముఖంలా మారింది.

నేను ఆ వనితమీద జాలి తలచి, ఒక పిప్పర మెంటు తీసుకున్నాను.

"నోట్లో ఏదేనా పెట్టుకోవడం మంచిది. విమాన ప్రయాణ మప్పుడు నోట్లో ఉమ్మిని మ్రింగు తూనే ఉండాలి. లేకపోతే చెవునొప్పి వస్తుంది" అని నాకు తెలిసినదాన్ని చెప్పాను.

"ఉండొచ్చు. కానీ, దీని దగ్గరనుండి తీసు కోవడం నాకు ఇష్టంలేదు. ఇలాంటి ఆడవారిని ఎందుకని 'ఏర్ హొస్టెస్'గా నియమిస్తారో కదా!" అన్నాడు రంగభాష్యం. సికింద్రాబాదులో దిగి, మేం కాఫీ త్రాగే చోట్లో కూడా అతను తిరిగి "ఏర్ హొస్టెస్" మాట ఎత్తాడు.

"పాశ్చాత్య దేశపువారిని ఇందులో కూడా అనుకరించాలా?" అని ప్రశ్నించాడు.

"అలా అనకూడదు. ఆస్పత్రులలో ఎక్కువగా ఆడనర్సులేకదా ఉంటారు. ఎందుచేత? చికిత్స, శుశ్రూష, ఉపచారం — వీటన్నింటికీ ఆడువారే తగినవారు. 'అందుకనే ఇలాంటి ఉపచారణ ఉద్యోగా లన్నింటికీ స్త్రీలనే నియమిస్తున్నారు" అని నేను అన్నాను.

"అదేమీకాదు. పురుషుల్ని నియమిస్తే ఏం కొరత వస్తుంది? ఈ పిప్పరమెంటు పురుషులు ఇవ్వనంటారా? ఈ పనికి స్త్రీలని నియమిస్తే అధికంగా ప్రయాణికులు వస్తారని ఉద్దేశం" అని నొక్కి నొక్కి చెప్పాడు రంగభాష్యం

"ఛ ఛ! ఇవేం మాటలు? దేశం స్వాతంత్రం సంపాదించుకున్నది. 'స్త్రీలందరు పురుషులతో సమా నంగా జీవించాలి' అనీ మన నాయకులందరు చెప్పు తున్నారు. నువ్వింత కర్ణాటకంగా మాట్లాడు తున్నావేం" అని చెప్పాను.

"సమానత్వంలో కూడా ఒక హద్దు




ఉండాలి ఆంగ్లోఇండియను స్త్రీలు ఇలాంటి పనులకు రావచ్చు మన హిందూ జాతి స్త్రీలకి ఇలాంటివన్నీ లాభంలేదు" అన్నాడు రంగభాష్యం

అతనే తిరిగి "అసలే విమాన ప్రమాదాలు అధికంగా ఉన్నాయి వీళ్ళు వేరే ప్రమాదాలను, విపత్తులను తెచ్చిపెడుతున్నారు" అన్నాడు

ఈ సంభాషణని పొడిగించటానికి నేను ఇష్టపడలేదు అయినా అతని మనస్సులో ఏదో విధమయిన ఆత్రం ఉందనిమాత్రం తెలిసింది అది ఏమిటో తెలుసుకోవాలి అని లేశంగా కుతూహలం జనించింది నాగపూరులో ప్రొద్దున్న ఫలహారానికని విమానం దిగినప్పుడు దాన్ని గురించిన కొన్ని వివరాల్ని నేన తెలుసుకొనగలిగాను

## 2

నాగపూరు విమాన నిలయంలో మేం కూర్చుని, విమాన కంపెనీవారిచ్చిన ఉదయ ఫలహారాన్ని తింటున్నాము రంగభాష్యం కూర్చున్న మేజాదగ్గర కావలనే కూర్చోక వేరే మేజాని వెదకి పట్టుకుని కూర్చున్నాను కానీ, నిముష నిముషానికీ నా ధ్యానమాత్రం అతనిమీదికే పరిగెట్టుతూంది

అంతవరకు విసుగు, అలసట నిలయంగా ఉండే రంగభాష్యం ముఖంలో హఠాత్తుగా ఒక వికాసము, ఒక ఆత్రత ఏర్పడడం చూచాను

వేరొక విమాన రమణి ఆ సమయంలో నిలయం లోని గదిలోకి వచ్చింది. ఆమె తనతోబాటే వచ్చిన పైలట్‌లతో ఒక మేజాదగ్గర కూర్చొని ఫలహారం చేయ నారంభించింది ఆమె రాకని చూడ్డంతోనే రంగభాష్యం ముఖం విప్పారింది క్రొత్తగా వచ్చిన విమాన రమణి (ఏర్‌హోస్టెస్) కథా నాయికల తగతికి చెందినది కవులు పూర్ణచంద్రుని వర్ణిస్తారే, అలాంటి గుండ్రటి ప్రకాశవంతమైన ముఖం, పారిజాత పుష్పచ్ఛాయ, నల్లని పెద్ద కన్నులు, ఆ కన్నుల యొక్క రెప్పలు అప్పుడప్పుడు పట్టుపురుగు రెక్కల్లాగా మూసుకుని మూసుకుని తెరుస్తున్నాయి. ఆమె కన్నులయొక్క వాలే చూపులు అక్కడ ఇక్కడా "కురు కురు" యని పయనిస్తున్నాయి ఆమె జుట్టుని మెడదాకా వ్రాలేటట్లు పైకితీసి కట్టుకున్నందున ఆమెయొక్క ముఖానికి అది ఒక ప్రత్యేక శోభ నిచ్చింది

ఆ స్త్రీ గదిలోకి వచ్చినప్పటినుంచి రంగభాష్యం ఆమెనే గమనిస్తున్నట్లు నేను కనుక్కున్నాను మిగతావారు ఏమైనా అనుకుంటారేమోనన్న భయం కూడా లేకుండా సిగ్గుపడకుండా గుడ్లప్పగించి రంగభాష్యం చూడసాగాడు ఆ విమాన రమణి ఫలహారం చేస్తూండగా యథాలాపంగా ఆమె చూపులు రంగభాష్యం మేజామీద నిలిచాయి. రంగభాష్యాన్ని చూడగానే ఆమె ముఖంలో ఒక చిన్న చిరునగవు ఒలికింది

రంగభాష్యం కూడా తిరిగి చిరునవ్వు నవ్వాడు. అతని నవ్వులో ఏదో విధమైన అవివేకం ప్రతిఫలించింది. అయినానూ ఈ సంఘటనవలన వారిద్దరూ పూర్వమే పరిచయస్థులనిమాత్రం వూహించుకున్నాను. విమాన రమణిలవల్ల ఏర్పడే విపత్తుల గురించి రంగభాష్యం చెప్పనారంభించటంలో ఏదో ఒక రసవత్తరమైన సంభవం ఉండిఉండాలి! దాన్ని తెలుసుకోవలసిందే!

విమానములు బయలుదేరేవేళ అయిందని లౌడ్‌స్పీకర్ యొక్క రాక్షస కంఠం హెచ్చరించింది క్రొత్తగా వచ్చిన విమాన రమణి లేచింది. రంగభాష్యం అది చూసి గబగబా నడిచివెళ్ళి, ఆమె ప్రక్కనే నిలుచున్నాడు

"మీరు ఇవాళ ఢిల్లీ విమానంలో రావడంలేదా?" అని అడిగాడు.

31 – పేజీ చూడండి

# వారఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

### గ్రహస్థితి

కర్కాటకంలో అంగారక రాహువులు, ధనుర్మకరాలలో శుక్రుడు, మకర ధనుస్సులలో బుధుడు, మకరంలో సూర్య, శని, కేతువులు, కుంభంలో గురువు, మకర కుంభ, మీన, మేషాలలో చంద్రుడు

**25-1-1963 శుక్రవారము మొదలు**
**31-1-1963 గురువారము వరకు**

## మేషం

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

దైవబలం బాగున్నది ఏవిధంగాను భంగపడవలసిన పరిస్థితి ఏర్పడదు కోర్టు కచేరీలలో కొంత శ్రమ, పనులలో నిదానము తప్పదు వృత్తి, ధనాద్దాయములకు సంబంధించిన పనులలో ఆదుర్దాతో భారం పెంచుకొనవలసిన అవసరం తగ్గుతుంది శుభ కార్యాలు సుఖంగా జరుగుతవి బంధు మిత్రులలో కొంతమంది మీ మనస్సును నొప్పిస్తారు ప్రయాణాలు సుఖంగా జరుగుతగిన సమయం అప్పు ఈయటం, పుచ్చుకొనటం మొదలయిన సందర్భాలలో నిష్కర్షగా ఉండటం అవసరం. తలవని తలంపుగా దుర్వార్తలు తెలుస్తవి వృత్తి, వ్యాపారాలలో మార్పులను ఎదురు చూడవలసిన అవసరం కనుపిస్తుంది ముందు ముందు మేలు కలుగుతుంది కాని, తాత్కాలికంగా ఆందోళన కలుగుతుంది 27, 28 తేదులలో మానసిక ఉద్రేకం, దగ్గరవారి కలహాలు, కార్యభారం

* *

## వృషభం

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

అవకాశమున్నంతలోనే సుఖం పొందగలుగుతారు ఒకరిని శ్రమ పెట్టవలసిన అవసరం లేకుండా ప్రశాంతంగా పనులు జరుపుకొనగలుగుతారు ఎదటివారి సలహాలను తొందరపడి ఆచరించటంవల్ల అపవాదులు రాగల అవకాశాలున్నవి విద్యాభివృద్ధి కరమైన సమయం. మనస్సులో రకరకాల క్రొత్త యోచనలు రేకెత్తగల అవకాశాలున్నవి ఆత్యాశను పురికొల్పగల మనుష్యులు తటస్థపడతారు తొందరపడి చేతిలోని ధనమును దుబారాగా వినియోగించరాదు శుభవార్తలు తెలుస్తవి ఆదాయం పెద్దగా పెరుగుతుందనే ఆశ పెట్టుకోవద్దు వారం రెండవ భాగంలో పాత మిత్రులను కలుసుకొంటారు మీరు ఇంతకుముందు నమ్మకుండా నిర్లక్ష్యం చేస్తున్న విషయాల యధార్థం తెలుసుకోగలుగుతారు 29, 30 తేదులలో ప్రయాణావకాశాలు, విశేష ధనాదాయం

* * *

## మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఒక కార్యం జరిగిన వెంటనే మరొక ప్రయత్నం ఆరంభించవలసివస్తు ఉంటుంది ఆదాయం చాలనంత ఖర్చు అధికారులవలన పని వెంటనే పూర్తి కాకపోవటంవల్ల మిగత కార్యక్రమాలకు ఆటంకం కలుగుతుంది గతంలో మీరు చేసిన శ్రమ, ఖర్చు వృధా అయిన విషయం తెలుస్తుంది సంఘ కార్యాలలో ఆసక్తి తగ్గుతుంది కాని, ఏదో ఒకవిధంగా నిమిత్తమాత్రంగా మీ బాధ్యతలను నెరవేర్చుకుంటు ఉంటారు కుటుంబంలోనివారి సుఖ, సంతోషాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి ఇంతకుముందు చేదోడుగా ఉంటున్నవారు ఈ సమయంలో ప్రక్కకు తప్పుకొంటారు వారం ఆరంభంలో అకస్మాత్తుగా కలహాలువచ్చి, వెంటనే సర్దుమణిగిపోతవి రికార్డులకు సంబంధించిన కాగితాలు మొదలయినవి ఇతరుల చేతికి పోకుండా చూచుకొనండి 25, 26 తేదులలో పొరపాట్లు, స్వల్ప ఫలితం, శ్రమ

* * *

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష )**

మనస్సుకు చికాకు కలిగే సమయం స్నేహితులకు ఉపకారంచేసి మాట పడవలసి వస్తుంది ముఖ్యమైన పుస్తకాలు, విలువగల వస్తువులు ఇతరులచేతికి పోయినంత సులభంగా తిరిగిరావు వ్యవహారరంగం మీ హడావిడి కనుపిస్తుందేకాని, [illegible] జరుగవు వృత్తి, ధనాదాయ ఏ [illegible]లలోమాత్రం మంచి మార్పులు రాగల అవకాశాలున్నవి శుభకార్య ప్రయత్నాలలో సంపూర్తిగా పని జరిగేవరకూ అనిశ్చితస్థితి తప్పదు ప్రయాణాలు మీరు అనుకున్నంత సుముఖంగా జరుగవు కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు మనస్సులో ఒక ప్రక్క ఆందోళన రేకెత్తుతున్నా నిగ్రహించుకొని మీ నిత్య కార్యక్రమాలను నిరాటంకంగా సాగించగలుగుతారు వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు 30, 31 తేదులలో స్నేహితులవలన కార్యసిద్ధి, గౌరవప్రాప్తి

* * *

## సింహం

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మీరు ఇంతకుముందు అనుకున్నంత గడ్డు సమస్యలు ఏమీ ఉండవు పరస్పర సహాయం చేసికొనతగిన మనుష్యులు లభిస్తారు క్రొత్త వ్యాపారాలు ఆరంభించటం, ఆస్తులుకొనటంవంటి ప్రధాన విషయాలలో ప్రసంగాలు, ప్రయత్నాలు ఆరంభం కాతగిన కాలం పిల్లలకు అనారోగ్యంచేసి నెమ్మదిస్తుంది బంధు, మిత్రులకు మీ పలుకుబడిని ఉపయోగించి సహాయంను చేస్తారు బుద్ధి బలము వినియోగించతగిన యంత్రకార్యాలు, లెక్కలు, మొదలయిన పనులలో శ్రమ పడవలసి వస్తుంది దైవానుగ్రహంవల్ల లోపం రాకుండా మాట దక్కించుకుంటారు. ప్రస్తుతం ఆదాయం మందంగా కనుపిస్తుంది. స్వల్ప విషయాలమీద పేచీలు పడవలసివస్తుంది దైవకార్యాలు జరుగుతవి 29, 30 తేదులలో వృధా ఆందోళన, కార్యసిద్ధి, ప్రయాణము

* * *

### ఈ వారము ధరలు

బంగారుధర ఈ వారంలో తగ్గి పెరుగుతుంది వెండిధర 27, 28 తేదులలో పెరగవచ్చు మిర్చిధర ఈవారం ఆరంభంలో తేజీ అవుతుంది ప్రత్తి, నూలు మొదలయిన వాటి ధరలు అకస్మాత్తుగా తగ్గి, మరల కొంత వరకు పెరుగుతవి విదేశీ దిగుమతులకు సంబంధించిన మందులు, రంగులు వీటి ధరలు తేజీ అవుతవి

## కన్య :

**(ఉత్తర 2, 3, 4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

వృత్తి, ఉద్యోగాలలో, తోటివారిని జాగ్రత్తగా చూచుకొనటం అవసరం ఏ సమయంలో ఎవరి మనస్సు ఎటు తిరుగుతుందో తెలియదు మీ బుద్ధికి చురుకుగా యోచన పారకపోవటంవల్ల మీ పనులలో ముందు వెనుకలు జరుగుతు ఉంటవి. పిల్లల ఆరోగ్యం బాగుండదు ఈ సమయంలో సంతోష వార్తలతోపాటు, బంధుమిత్రుల కష్టవార్తలు కూడా తెలియగల సూచన లున్నవి మీ సుఖ సంతోషాల నిమిత్తం ధన వ్యయం అవుతుంది శుభ కార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి ముందు ముందు ఉపయోగించు పనులలో ధనం వినియోగించ గలుగుతారు విలువగల వస్తువులు కొంటారు పరోపకార కార్యాలలో పాల్గొంటారు సంఘంలో గౌరవ ప్రతిష్ఠలు పెరుగుతవి 28, 29 తేదులలో లాభవార్తలు, గొప్పవారి స్నేహం, విందులు

* * *

## తుల .

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఎప్పటి కప్పుడు ముందు ఏమి చేయటము అని అనుకొంటు ఉంటారు అయితే మీ మనస్సులో మెదిలిన సమస్యలు ప్రత్యక్షంలో బాధించవు వృత్తిలో ప్రశాంతత, గౌరవము లభిస్తవి మీరు ఎదురు చూస్తున్న మార్గాలలో కాకుండా, క్రొత్త పనుల యందు ఆదాయవృద్ధి కనుపిస్తుంది. విందులు, వినోదాలు మొదలయిన వాటిలో పాల్గొంటారు. కుటుంబంలో ఒక విధంగా సంతృప్తి, సంతోషము లభిస్తవి. ప్రయాణాలను ప్రస్తుతానికి నిలువు చేసుకొనవలసి రావచ్చు వృత్తి ఉద్యోగాలలో అధికారం లభిస్తుంది ఆదాయం బాగుంటుంది అందరినీ ఆదరించి అభిమానం పొందగలుగుతారు బంధుమిత్రుల రాక పోకలు ఎక్కువగా ఉండతగిన సమయం. వ్యవహారాలలో ఉపయోగం తక్కువ. 27, 28 తేదులలో విద్యా వినోద కార్యక్రమాలు, ధనలాభం.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

బాధ్యతలు ఎదటివారిపైన ఉంచి, చల్లగా

తప్పుకోనగలుగుతారు ఆదాయం బాగుంటుంది ప్రతి విషయంలోను మీకు శ్రమ లేకుండా సహాయపడగల మనుష్యులు లభిస్తారు కీర్తి లభిస్తుంది ఆరోగ్యము, మనశ్శాంతి బాగుంటవి ఈ సమయంలో ధనవ్యయం బాగానే అవుతుంది తలపెట్టిన పనులకు ఎక్కడ ఆటకం వస్తుందోననే ఆందోళన కలుగుతుంది కాని, దైవానుగ్రహంవల్ల మెల్లగా దాటుకోగలుగుతారు వృత్తి, ఉద్యోగాలలో మీ శక్తి సామర్థ్యములు పెరుగుతవి కుటుంబ విషయాలలో మీ మాటకు విలువ లభిస్తుంది ధర్మ కార్యాల నిమిత్తం ఖర్చులు ఎక్కువ విలువగల వస్తువులు కొంటారు ప్రతి విషయము శ్రద్ధగా విచారించవలయుననే ఆసక్తి తగ్గుతుంది 26, 27 తేదులలో అనుకూల వార్తలు, శత్రుజయం

* * *

## ధనుస్సు

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా )**

ప్రస్తుతం ధన సహాయంకన్నా మనుష్య సహాయం, ఆదరణ అవసరం వృత్తి, వ్యాపారాలలో అప్పుడప్పుడు వచ్చే మార్పులు మీ శక్తిని పరీక్షిస్తున్నట్లుగా తోస్తవి ఆచరణ సాధ్యంకాని సలహాల వల్ల ఇబ్బంది పడవలసి వస్తుంది కుటుంబంలోని వారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి సాధ్యమైనంతవరకు ఇతరుల పొగడ్తలను లెక్కచేయకుండా చేతిలోని ధనాన్ని జాగ్రత్త పరచుకొనటం అవసరం విశేష, మానసిక శ్రమవల్ల అసౌఖ్యం కలుగుతుంది ముందుగా వాగ్దానాలు చేయవద్దు అన్ని విధాలా జాగ్రత్తగా ఉండండి సాహస కార్యాలజోలికి పోవద్దు వారాంతంలో మీ మనస్సు కొంతవరకు తేటపడగల అవకాశాలున్నవి నిదానంగా ఆలోచించటానికి, అనుకూలమైన ఒక మార్గాన్ని అనుసరించటానికి అవకాశం లభిస్తుంది

* * *

## మకరం

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

వృత్తి, వ్యాపారాలలో అవకాశం కలసిరాలేదనే ఆదుర్దా మొదట కలుగుతుంది తీరా కలిసివచ్చే సమయానికి సమర్థించుకొనలేక చిక్కుపడతారు ఫలితం తక్కువ మనో నిబ్బరం అవసరం అప్రయత్నంగా అనుకూలించే పనులలో గౌరవము, ధనాదాయం కూడా బాగుంటవి కుటుంబంలో కార్యభారము, ఖర్చుల భారము కూడా పెరుగుతవి బంధువులవద్దనుంచి శుభ సంతోష వార్తలు తెలుస్తవి అధికారులతో పేచీలు రాకుండా చూచుకొనండి ధన వ్యయం అయేటట్లు కనుపించినా వ్యవహారాలను ఆరంభంలోనే త్రుంచి వేయటానికి ప్రయత్నించండి పైత్య, వాయు, ప్రకోపాలవల్ల అనారోగ్య సూచనలు కనుపిస్తవి సూర్యగ్రహ జపం, స్తోత్ర పారాయణం జరుపుకొనటంవల్ల ఆరోగ్యం, ఆత్మశక్తి పొందగలరు 20 నుంచి శుభ సూచనలు కనుపించును

* * *

## కుంభం

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ భాద్ర 1, 2, 3 పా )**

త్రిప్పట, దేహ శ్రమతో కూడిన కార్యక్రమాలు కాని, ఒడిదుడుకులుకాని లేకుండా చాలా ప్రశాంతంగా జరుపుకొన గలుగుతారు ఆదాయాన్ని ఎదురుచూడకుండా పదిమందిలో పేరుకోసము, సుఖ సంతోషాల నిమిత్తము చేయు పనులే అధికంగా ఉంటవి. మిమ్మలను గురించి ఈర్ష్యతో నాట్లాడుకొనే మనుష్యులు ఉంటారు పెద్దమనుష్యుల స్నేహం సంబంధాలు కలిపే అవకాశా లున్నవి అనేక వ్యవహారాలలో పదిమందిని మీ మార్గానికి తీసుకొని రాగలుగుతారు ఖర్చులు మీ తాహతును మించకుండా ముందు జాగ్రత్త అవసరం తలవని తలంపుగా దేహబాధలు కలుగుతవి రాజకీయాలలో కార్యసిద్ధి, పదిమందియొక్క మెప్పుదల పొందగలుగుతారు 29, 30 తేదులలో ధనప్రాప్తి, దైవ కార్యాలు

* * *

## మీనం

**(పూ భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి )**

గ్రహస్థితి అనుకూలంగా ఉంది వృత్తి వ్యాపారాలలో ప్రయోజనకరమైన మార్గంలో పోగలుగుతారు విలువగల వస్తువులమీద ధనం వినియోగిస్తారు సంతోషవార్తలు తెలుస్తవి నౌకరుల మీద ఆధారపడిన పనులలో కలహాలకు అవకాశం ఉంటుంది ప్రయాణాలు సంతోషంగా నెరవేరుతవి ఒక సమయంలో అధికంగా ఆదాయం కనుపించినా, మరొక సమయంలో అసంతృప్తి పడటం జరుగుతూ ఉంటుంది తరచు అధికారులను, పెద్దమనుష్యులను కలుసుకొంటారు అకస్మాత్తుగా కార్యభారం పెరగటంవల్ల మొదట కలవరపాటు కలుగుతుంది కాని, సులభంగా సమర్థించుకుంటారు వినోద సంబంధమైన ఖర్చు లెక్కువ 25, 26 తేదులలో వృధా వివాదాలు, స్వల్ప ఆదాయము ★

---

# మాలతి తండ్రి

29 వ పేజీ తరువాయి

"లేదు నేను బొంబాయికి వెళ్తున్నాను విమానంలో ఎక్కితే మీకు ఇంకా తల తిరిగి మైకం వస్తూందా?" అని అడిగిందా రమణి

రంగభాష్యం సన్నగా నవ్వేస, "అది మీకు ఇంకా జ్ఞాపకం ఉందే! చాలా సంతోషం!" అని చెప్పాడు

వారిద్దరూ నడుస్తూ, మాట్లాడుతూ ఉన్నందువలన, ఆ తర్వాత మాట్లాడిన మాటలు నా చెవిన సరిగ్గా పడలేదు

ఆ స్త్రీ రంగభాష్యందగ్గర సెలవు తీసుకుని బొంబాయి విమానంకేసి వెళ్ళింది రంగభాష్యం ఆ చోట్లోనే నిలుచుండిపోయాడు నేను అతని దగ్గరగావెళ్ళి, "మన విమానం బయల్దేరబోతూంది" అన్నాను

"మనం కూడా వెళ్ళాల్సిందే!" అన్నాడు రంగభాష్యం

"ఒకవేళ మీరు ఆ విమాన మేనకతోటి బొంబాయికే వెళ్ళిపోతారేమోనని అనుకున్నాను" అని అతన్ని వేళాకోళం చేశాను

రంగభాష్యం దానికోసరం కోపం తెచ్చుకోలేదు

"వెళ్ళటానికి నాకు సమ్మతమేను కాని, టిక్కెట్టుని వేరేదారికి మార్చి ఇవ్వరుకదా!" అన్నాడు

విమానంలోకి ఎక్కాము రంగభాష్యం ఏదేదో మనోరాజ్యాలల్లోనూ, పగటి కలలలోనూ మునిగి ఉన్నాడన్నది స్పష్టంగా తెలిసింది మా విమానంలోని "ఏర్‌హొస్టెస్" తీసుకువచ్చి చాచిన పిప్పెరమెంటుకూడా సంశయించకుండా తీసుకున్నాడు

గ్వాలియర్ విమాన నిలయంలో విమానం ఆగగానే, అలవాటు ప్రకారం ఫలహారం చేయటానికి భోంచేసేచోటుకి వెళ్ళాం అతని ప్రక్కన నేను గానేపోయి కూర్చున్నాను మెల్లిగా అతనితో మాట్లాడం ప్రారంభించాను నిజజీవితంలోంచి ఏదైనా కథదొరికే సందర్భం దొరికితే, దాని అలక్ష్యంగా వదిలేయకూడదుకదా ?

"ఆ అమ్మాయిని మీకుముందే తెలుసునా ?" అని అడిగాను

"మీరేం తప్పుగా అనుకోవటం లేదంటే చెప్తాను నాకు ఎవరితోనైనాను చెప్పి ఆలోచన అడగాలని తోస్తుంది" అన్నాడు రంగభాష్యం

"ఏమీ తప్పు అయిన కార్యం కాకపోతే నేను తప్పుగా దాన్నిగురించి అనుకోను మిగతావారికి యోచన చెప్పటానికి నేను ఎప్పుడు తయారే" అన్నాను నేను

మెల్లమెల్లగా అతను విషయాన్ని చెప్పాడు అదేం ప్రమాదమైన విషయంగా నాకు తోచలేదు కాని అతడు ప్రపంచంలో ఇంతకంటే ముఖ్యమయిన విషయం వేరే ఏది ఉండదన్నట్లున్నాడని తోచింది

రంగభాష్యం పోయిన నెలలో ఒకసారి ఢిల్లీకి వచ్చి, తిరిగి వెళ్ళేటప్పుడు ఢిల్లీ విమాన నిలయంలో చెన్నపట్నానికి బయలుదేరే విమానంలో ఎక్కడానికి వెళ్ళాడుట చిన్న నిచ్చెనలాంటి మెట్ల మీదనుంచే విమానంలోకి ఎక్కవలసి వస్తుంది రంగభాష్యం ఆ మెట్లమీదనుంచి ఎక్కి ఒక కాలు విమానంలో పెట్టినప్పుడు సరిగ్గా వేయనందున తడబడి పడబోయాడుట అప్పుడు అక్కడే నిలుచున్న విమాన రమణి చటుక్కున అతని చేతిని పట్టుకుని నిదానపరచి విమానంలోకి ఎక్కించిందిట సంప్రదాయం ప్రకారం ఆమెకు "థాంక్స్" చెప్పాడుట

"పడిపోబోయారే ? తల గిర్రుమని తిరిగిందా?" అని ఆ అమ్మాయి తన భాషలోనే అడగడంతోటి, ఇతనికి ఒకే ఆశ్చర్యం సంతోషంగాను వుండింది ఏమీ బదులు చెప్పడానికి తోచక విమానంలోనికి వెళ్ళి స్థలం చూసుకుని కూర్చున్నాడు తిరిగి ఆమె చేతిలో పిప్పెరమెంటు పెట్టెతో వచ్చినప్పుడు,

"అప్పుడు ఒకప్రశ్న అడిగారే ! దానికి నేను జవాబుచెప్పనా ?" అన్నాడు రంగభాష్యం

"ఏంప్రశ్న అడిగాను ?" అంది ఆ అమ్మాయి

"తల గిర్రుమని తిరిగిందా అని అడిగారు ఈ ప్రపంచపు మనిషికి ముందర, హఠాత్తుగా దేవలోకపు మేనకవచ్చి నిలుచుంటే, తల గిర్రుమని తిరిగి మైకం రాకుండా ఎలా ఉంటుంది" అన్నాడు.

ఆ మేనక చిరునవ్వునవ్వి అవతలకి వెళ్ళిపోయింది. రంగభాష్యమో తనకింత ధైర్యం ఎలా వచ్చింది ? అని ఆశ్చర్యపడుతూ వున్నాడు



ఉత్సాహానికి
హుషారుకు
కారణం!
రాగోలైన్




ఈ పుష్టికరమైన ఆహార పానీయమును
మీరుకూడా పుచ్చుకొని యెల్లప్పుడు
ఉత్సాహంగా వుండండి!!

ఫైన్ కెమికల్ వర్క్సు,
పి. బి. 71, మైసూరు-4



# RATNAM'S N-OIL

(పై పూతకు మాత్రమే)

అంగ నరములు బలహీనత చెంది, చిన్నదైనచో తిరిగి యధా ప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/-లు. వి.పి. 1-4-0. కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ. 25-0-0 లు.

**డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)**
మలకపేట బిల్డింగ్స్, ఆజంపూరా మార్కెట్‌వద్ద,
హైదరాబాద్ 24 (ఆంధ్రప్రదేశ్)



## మంచి పుస్తకాలు

జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు - రూ 3-50
యువతి - స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు ... రూ 3 50
సంతానము - గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు ... రూ 3 50
అమ్మక రహస్యాలు - వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00
ఉద్యోగదర్శిని - మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు రూ 5 00
ఆత్మజ్ఞానము - శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు రూ 2-50
పోష్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును

దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర



## కేలండరు ఉచితం

**గ్లోరియా** ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్ని వెంటనే తెచ్చును. ముఖంలో ముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్ని తెచ్చును ఎండకు వచ్చే నలుపును, మొటిమలను నమ్మకంగా పోగొట్టును గ్లోరియాతో పెద్దబొమ్మకేలండరు ఉచితంగా యివ్వబడును వెల రూ 1-75 అన్నిషాపుల్లో దొరకును.

JANITA PRODUCTS, ELURU. A.P.



# శిరోజాలు రాలుట



సహజంగా
నిలుప వచ్చును
వీరు చేయ
వలసిం దల్లా
ఇంతే

మీరు వాడే తల నూనెలో అర కిలో కొబ్బరి నూనె లేక ఆముదంలో ఝురణ్ ఒక సీసాడు కలపండి. ఈ విధంగా తయారైన మిగుల గుణకారియైన నూనెను రోజూ తలకు రాసుకొని శిరోజాలు రాలి పోయే అవస్థను తొలిగించుకోండి. ఇంతేగాక మీ శిరోజాలు దట్టంగాను పొత్తుగాను పెరుగుతాయి.

# ఝురణ్

పొత్తయిన పొడవగు శిరోజాల కోసం

సోల్ డిస్ట్రిబ్యూటర్లు.- సుగంధ ఫేక్, అహమదాబాద్-1
ఏజెంట్లు:- పి. నరోత్తమ్ అండ్ కం., బొంబాయి-2.

MPS-TEL



సగం ఖరీదు కంటే తక్కువ
15 రోజులే! పాకెట్ రేడియో!




WAS Rs.76. NOW only Rs.29

సరికొత్త పాకెట్ రేడియో బ్యాటరీ/కరెంటు లేకుండా నిజంగా పనిచేస్తుంది స్థానికంగా ప్రపంచములోని ప్రతిమొక్క రేడియో స్టేషన్ వార్తా/సంగీత ప్రసారాన్నయినా తప్పక యెప్పుడైనా యెక్కడున్నా అందుకొంటుంది. ఇది జపాన్‌లో తయారైన క్రిస్టల్ రిసీవర్ ధర రు 29/- మాత్రమే. పోస్టేజి రు. 2/-. దీర్ఘకాలం పనిచేసే పూచీతో, వినుటకు తయారుగా పంపబడును. ఆలస్యం చేయవద్దు చాలామంది కోరుతున్నారు. మీ ఆర్డరు నేడే పంపి వెంటనే పొందండి.

**Headquarter & General Supplies Co.,**
(A)2194-Kalyan Pura, Delhi-6.


న్యూటన్ ప్రెడింగ్ కంపెని, 8, పెద్దునాయక్ వీధి, మద్రాసు-3.

# మాలతి తండ్రి

తర్వాతి ఆగ్నేయంలో విమానం దిగినప్పుడు ఆ విమాన రమణి ఇతన్ని వెదుక్కుంటూ వచ్చి.

"నా దగ్గర మాట్లాడినట్లే వేరే ఎవరిదగ్గరా మాట్లాడకండి. చెంపమీద దెబ్బపడుతుంది" అంది.

"దాన్ని గురించి భయమేంలేదు. వేరే ఎవరి దగ్గర నేనలాగ మాట్లాడగలను ?" అన్నాడు రంగ భాష్యం.

ఈ విధంగా వారిద్దరికీ ఏర్పడ్డ పరిచయం, మ్రోతిక సీరీయల్‌లాగా, మద్రాసు చేరేవరకు సాగింది.

చెన్నపట్నంలో విడిచి వెళ్ళవలసిన సమయం వచ్చినప్పుడు, ఆ విమానమేనక విలాసం తెలుసు కోవాలని రంగభాష్యం సాధ్యమయినంతవరకు ప్రయత్నించాడు. కానీ ఫలించలేదు.

"దైవేచ్ఛ ఉంటే తిరిగి ఎప్పుడైనా మనం కలుసుకుంటాం" అన్నది విమానమేనక.

"అలాగని దేవునికే నేను వదిలి వేయదలుచుకో లేదు. నేనూ కొంచెం ప్రయత్నిద్దామని ఉద్దేశం" అన్నాడు రంగభాష్యం.

మొదట్లో విమాన ప్రయాణంలో ఇది ఒక విచిత్రమైన అనుభవం అని మాత్రం రంగభాష్యం అనుకున్నాడు. కాని ఆ విచిత్ర అనుభవం అతని హృదయంలోకి పోయి నాటుకుపోయిందని పోగా పోగా తెలిసింది. ఆ అనుభవాన్ని అతను మరువ లేకుకోలేదు. ఆ అమ్మాయిని మరువనేరక పోయాడు. దగ్గిర దగ్గర పిచ్చిలాగానే అయిపోయింది.

అందువలననే తిరిగి ఢిల్లీకి వెళ్లే సందర్భం కోసం ఎదురుచూస్తున్నాడు. కానీ తనెక్కిన విమానంలో ఆ విమానమేనక కనబడకపోవటంతో నిరుత్సాహం, కోపంవచ్చింది. నాగపూరులో ఆమెని చూసినతర్వాతనే అతనికి తిరిగి ఉత్సాహం ఏర్పడింది.

## 4

క్రొత్తఢిల్లీలో నేను దిగినచోటు రంగభాష్యం అడిగి తెలుసుకున్నాడు. నాల్గురోజులయ్యాక నన్ను చూట్టానికి ఒకరోజు వచ్చాడు. వచ్చేటప్పుడే కుతూహలంతో తాండవమాడుతూ ఆడుతూ వచ్చాడు.

"రంగభాష్యం, ఎందుకింత కుతూహలం !" అని అడిగాను.

"ఆమెని నేను తిరిగి కలుసుకున్నాను" అన్నాడు.

"ఆమెని అంటే ఎవరిని ?"

"ప్రపంచంలోనే నాకు ఇప్పుడు ఒకే 'ఆమె' ఉంది. వేరే ఎవ్వరైనా ఉంటుంది ?"

"ఆ విమాన మేనకని గురించి చెప్తున్నావా"

"అవును, ఆమె పేరు మేనకకాదు. మాలతి ! అన్నాడు

ఆమెని ఎక్కడ చూశావు ?"

"నేను దిగిన హోటలుకే నిన్న ఆమె కూడా వచ్చింది. ఒక ముఖ్యమయిన విషయం చెప్పింది"

"అదేం విషయం ? తనకి ఇంకా కల్యాణం అవలేదని చెప్పిందా" అన్నాను నేను

రంగభాష్యం కొంచెంసేపు తెరిచిన నోరు తెరిచినట్లుగానే ఏమీ తోచక భ్రమించిపోయి నిలుచున్నాడు.

"ఏం! ఇలా భ్రమించిపోయావు! మూర్ఛపోయి పడిపోకు! ఇక్కడ నేలమీద రత్నకంబళీ ఏనా లేదు" అన్నాను.

"ఆ ప్రశ్నని నే నామెను అడగనేలేదు" అన్నాడు రంగభాష్యం.

అది అడక్కుండా వేరే ఏం అడిగి ఏమి లాభం? సరి, పోనీయి. మరిచేతే ఏమిటా ముఖ్యమయిన సందేశం."

"మాలతి 'ఏర్‌హోస్టెస్' ఉద్యోగాన్ని వదిలేస్తుందిట!"

"అయ్యొయ్యో! ఆమె ఎందువల్ల ఇలాంటి విపరీతమైన కార్యం చేస్తోంది?"

"నాలాగే అనేకమంది ఆమె దగ్గర, 'నిన్ను చూస్తూనే తల గిర్రుమని తిరిగి మైకం వస్తోంది!' అంటున్నారుట. అసలే విమాన ప్రమాదాలు ఎక్కువవుతున్న స్థితిలో, తనవల్ల వేరే విపత్తులు రాకూడదు అని ఉద్యోగానికి రాజీనామా చెయ్యబోతుందట! పనిని వదిలిపెట్టి మద్రాసుకే వచ్చేస్తుందిట!" అన్నాడు.

"మద్రాసు కేదో దురదృష్టం పట్టింది" అన్నాను నేను.

"మద్రాసు నగరం మూడేళ్ళ ఇరవై యొక్క జన్మలాయి చేసిన తపఃఫలమని చెప్పండి!"

"ఆ మాజీ విమానమేనకమద్రాసు నగర వీధిలో వెళ్లేటప్పుడల్లా ఎవరైనా తల గిర్రుమని తిరిగి పడిపోతూఉంటారో ఏమిటో? అందువల్ల అసలే గోతుల మయమయిన మద్రాసు నగర వీధులు ఇంకా మిట్టపల్లాలై పోతుందే అనే నా బెంగ!"

"అవును! మద్రాసు నగర వీధులు ఏవిధంగా పాడయితేమాత్రం మీకూ నాకూ ఎందుకు? ఈమె ఈ దరిద్రపు విమాన ఉద్యోగము వదిలేస్తోంది అన్నదే నాకు ఎంతో ఉత్సాహాన్ని ఇస్తోంది. పురుషుల తోటి సహవాసమే ఆమెకు నచ్చలేదుట. పురుషుల మధ్యలో పని చేయటానికే ఏదోలా ఉందిట అందువల్లనే ఒక స్త్రీల కళాశాలలో ఉపాధ్యాయినిగా అవాలని తీర్మానించుకుందిట. ఆ ఉద్యోగానికి అప్లికేషను వేసిందిట ఉపాధ్యాయిని ఉద్యోగం దొరకగానే మద్రాసుకు వచ్చేస్తుందిట!......ఇప్పుడేమి చెప్తారు?" అని ప్రశ్నించాడు.

"ఏమని చెప్పేది? ఆ స్త్రీల కళాశాలని దేవుడే కాపాడాలని ప్రార్థిస్తున్నాను" అన్నాను.

"ఆ స్త్రీల కళాశాల చేసిన పూజా ఫలమని చెప్పండి!"

---

పబ్లిషర్ : ఈ పుస్తకం వెంటనే విమర్శించాలి.

విమర్శకుడు : చదవాలంటావా?

పబ్లిషర్ · అది మనవోడల్లు డిది అని జ్ఞాపకముంచుకో; చాలు.

విద్యారాణి (బెజవాడ)

---

ఈ విధంగా మా సంభాషణ ఆరోజు ముగిసింది. ఆ తర్వాత రంగభాష్యం ఢిల్లీలో నన్ను రెండు మూడుసార్లు కలుసుకున్నాడు. ఉత్సాహ సముద్రంలో మునిగి ఉన్నాడు. మాలతిని తిరిగిచూసి, ఆమెకి పెళ్ళికాలేదని నిర్ధారణ చేసుకున్నాడుట!

'నీ తలలో ఆలాగని విధివ్రాత వ్రాశాక ఆమెకు వేరే కళ్యాణం అయిఉంటుందా?" అన్నాను నేను.

రంగభాష్యంతో ఆవిధంగా తమాషాగా చెప్పానే గాని, నాకు అతనిమీదనూ, ఆ అమ్మాయి మీదను ఒక విధమైన అనుతాపం ఏర్పడింది. "నిజమైన ప్రేమికుల్ని ప్రపంచం అంతా ప్రేమిస్తుంది!" అని ఆంగ్లంలో ఒక సామెత ఉంది. సావిత్రి—సత్యవంతుడు, రోమియో—జూలియెట్, లైలా—మజ్నూ లలాంటి ప్రేమికులు ఈనాటికీ లోక ప్రజల ప్రేమకు పాత్రులై ఉన్నారుకదా? ఇద్దరు ఒకరిపై ఒకరు అనురాగం నిలిపి ఉంటే, దాన్ని చూడ్డంలోనే మనకు సంతోషం ఏర్పడుతుంది. రంగభాష్యాన్ని, ఆ విమాన రమణినీ తలుచుకున్నప్పుడు నా కలాగే సంతోషంగా ఉండేది.

"నిజమైన ప్రేమ బాట సరళంగా ఉండదు" అని ఆంగ్లభాషలో మరొక సామెత ఉంది. ఈ ప్రేమికుల విషయంలో అది నిజం కాకూడదే అన్న సందేహం ఎందుచేతనే నామనస్సులో జనించింది.

## 5

ఇప్పు డిప్పు డంతా దేశం పూర్తిగా స్త్రీ సంఘాలు ఏర్పడుతున్నాయి. "స్త్రీ సంఘాల్ని" నా స్నేహితుడు "స్త్రీ సంకటాలు" అని అనడం అలవాటు. వనితా సంఘాలు స్థాపించడమూ, సంఘసేవ చేయడమూ ఒక్కోసారి పురుషులకు సంకటం కల్పించేది నిజమేను. కానీ, పురుషుల సంఘాలు వలన స్త్రీ దైవములకు కొన్ని సమయాల్లో ఇబ్బంది కలిగిస్తోంది. కనుకనే సంఘాలవల్ల కలిగే పరస్పర ఇబ్బందులని తప్పించుకొన సాధ్యముకాదు.

ఒకరోజున స్త్రీ సేవా సంఘానికి చేరిన ఇద్దరు నారీమణులు నన్ను చూడ్డానికివచ్చి చీటీరాసి పంపారు. ఏదో సంఘసేవ సహాయార్థం నాటకం వేస్తున్నారనీ, దానికి టిక్కెట్టు అమ్మడానికి వచ్చారనీ తెలుసుకున్నాను. ఇలాగ టిక్కెట్టులు అమ్మడానికో, చందా లేక విరాళం వసూలు చేయడానికో ఎవరైనా వస్తే మనకి ఇరకాటమేకదా! అయినా కానీ, నారీమణులు ఇలాంటి సత్కార్యాలకివస్తే ఖరా ఖండిగా ఎలాగా నిరాకరించగలము? ఏదో ఒక టిక్కెట్టు కొనుక్కుని పంపేద్దామని అనుకొని వారిని రమ్మని చెప్పాను వచ్చిన ఇద్దరిలో ఒక స్త్రీని చూసేసరికి నేను నిశ్చేష్టుడ నైనాను. నా విమాన స్నేహితుడు రంగభాష్యం మనసు చూరగొన్న విమాన రమణి ఆమె.

"మిమ్మల్ని నేను ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం ఉందే?" అని మాలతే మొదట్లో అడిగేసింది.

"అవును ఒకసారి విమాన ప్రయాణ ముప్పుడు నాగపూరులో చూశాను" అన్నాను.

ఒకటికి రెండుగా టిక్కెట్లుకొని, మెల్లగా రంగభాష్యం గురించి ఎత్తాను

"మీరు విమాన ఉద్యోగం వదిలేస్తారని రంగభాష్యం అప్పుడే చెప్పాడు" అన్నాను.

ఒక్క క్షణం ఏదో ఆలోచించి నన్ను చూసి,




# దేశదేశాల్లో వనస్పతి వాడబడుతోంది!

వనస్పతి మరియు అటువంటి జిడ్డుపదార్థములు ప్రపంచమంతటా — జీవన ప్రమాణములు ఉన్నత స్థాయిలోగల దేశములలోకూడా — వాడబడుతున్నాయి. డెన్మార్క్, హాలెండ్ మరియు అమెరికావంటి వెన్న సమృద్ధిగాగల దేశములలో కూడ ఈ జిడ్డు పదార్థములకు, పాలనుండి లభించే జిడ్డు పదార్థములకంటె ఎక్కువ గిరాకీ ఉంది.

**వనస్పతి మరియు అటువంటి జిడ్డు పదార్థములు ప్రపంచమంతటా వాడబడుతున్నాయి!**

వనస్పతి తయారు మొదలవక ముందు ప్రపంచమంతటా పాల జిడ్డు పదార్థములు, జంతు క్రొవ్వు మరియు శాక నూనెలుమాత్రమే వంటకు వాడబడే జిడ్డు పదార్థములుగా ఉండేవి. జంతు క్రొవ్వు మరియు పాల జిడ్డు పదార్థములు కావలసినన్ని లభించేవికావు. నూనెలు, ద్రవరూపములో ఉండుటచే ఇబ్బందిగా ఉండడమే కాకుండా వాటిలో ఎన్నో మలిన పదార్థములు ఉండేవి. మరియు విటమినులు ఉండేవికావు. అందువలన తక్కువ ధరదైన, పోషకమైన, పేరుకొన్న వంటకువాడే జిడ్డు పదార్థమునకై ప్రపంచమంతటా పరిశోధనలు జరుపబడ్డాయి. వాటి ఫలితముగా కనుగొనబడ్డదే వనస్పతి!

శాక నూనెను శుద్ధీకరించి, వాసనతీసివేసి, హైడ్రోజెన్ చేర్చి మరియు దానికి విటమినులు చేర్చి, తయారు చేసినదే వనస్పతి శుద్ధీకరించుటవలన ముతక శాక నూనెలలో ఎల్లప్పుడూఉండే బంకమన్ను, దుమ్ము, 'ఫ్రీ ఫేటీ ఆసిడ్స్' మరియు రంగు తీసివేయబడతాయి. వాసనను పోగొట్టు పద్ధతివలన చెడ్డ వాసన మరియు చెడ్డ రుచి తీసివేయబడతాయి. హైడ్రోజెన్‌ను చేర్చుటద్వారా ద్రవ రూపములోనున్న నూనె పేర్కొంటుంది. మరియు ఎక్కువ కాలము పాడవకుండా ఉంటుంది. విటమినులను కలుపుటవలన వనస్పతి శాక నూనెలకంటే పోషణలో ఎక్కువ శ్రేష్ఠమైనదిగా, అతి శుద్ధమైన పాల జిడ్డు పదార్థములతో సరిసమానమైనదిగా అవుతుంది

వనస్పతి తక్కువ ధరదైన, పేరుకొన్న వంటకు వాడే జిడ్డు పదార్థమేకాక, ఒక శ్రేష్ఠమైన ఆహార పదార్థము కూడా! సమ కొలతలలో తీసుకొంటే, గోధుమ లేక బియ్యముకంటె వనస్పతి $2\frac{1}{2}$ రెట్లు ఎక్కువ పోషణను ఇస్తుంది. ఇంకా, అది కార్ఖానాలో తయారైనపుడువలె శుద్ధముగా, తాజాగా, పోషకవంతముగా మీకు లభిస్తుంది. వనస్పతి ప్రతి గ్రాములో పెరుగుదలను కలిగించే చర్మము మరియు కంటికి రక్షణ కలిగించే విటమిను 'ఏ' పుష్కలముగా ఉంది.

ఇంకా వివరములకు ఈ ఎడ్రసుకు వ్రాయండి:

**'ది వనస్పతి మ్యాన్యుఫేక్చరర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా**
**ఇండియా హౌస్, ఫోర్ట్ స్ట్రీట్, బొంబాయి-1'**

JWT-VMA-4017

# మాలతి తండ్రి

చిన్నగా నవ్వి, "అయినా ఈ నాటకానికి వస్తారు టిక్కెట్టు కొనుకున్నారు" అంది.

ఇంకా కొంచెం మాట్లాడి, ఏ నాటక సహాయార్థం మాలతి డొనేషన్ టిక్కెట్లు అమ్ముతోందో, ఆ నాటకంలో ఆమె వేషం వేసుకుని నటిస్తోంది, అని తెలుసుకున్నాను.

నేను ఎదురు చూసినట్లుగానే కొంచెం సేపటికల్లా రంగభాష్యం దగ్గరనుంచి టెలిఫోను వచ్చింది.

"సాయంకాలం ఒక అమెచ్యూర్ సహాయ నాటకానికి వెళ్దామనుకుంటున్నాను మీకూ చేర్చి టిక్కెట్టు కొన్నాను తప్పకుండా రావాలి" అని ఆతృతతో చెప్పాడు.

నాటకానికి ఇద్దరం వెళ్ళాము తలకి రెండేసి టిక్కెట్లు చొప్పున తీసుకువెళ్ళాం! అమెచ్యూర్‌లు వేసిన నాటకంగాచూస్తే అంత మోసంగా లేదు. బాగుందనే చెప్పొచ్చు. అయినా రంగభాష్యానికి ఎందుకో ఆ నాటకం నచ్చలేదని తెలిసింది.

"ఇదేం కథ? పోయి పోయి నాటకం వేయనానికి ఇలాంటి కథేనా దొరికింది? ప్రపంచంలో వేరే మంచి విషయమేలేదా?" అని సణుక్కుంటూనే ఉన్నాడు

నా అభిప్రాయం ప్రకారం అదేమంత మోసమైన కథకాదు. పేదతనంవల్ల తప్పుచేసి, చెరసాల కేగిన ఒక ఖైదీ కథని మూలంగా పెట్టుకుని నాటకం వ్రాశారు. చెరలో ఆ ఖైదీ పడ్డ కష్టాలు, తప్పించుకొని పారిపోయాక పడ్డ బాధలు — ఇవే ముఖ్యమైన నాటక అంశాలు. ఎందుకని రంగభాష్యానికి ఈ విషయం అంతగా నచ్చలేదో అప్పుడు నాకు అర్థమవలేదు. కానీ కొంచెం కాలమయ్యాక నానికి కారణం తెలిసింది

నాటకం ముగియగానే, "పోదామా" అని అతన్ని అడిగాను

"మాలతిని చూసి కొంచెం మాట్లాడేకనే వెళ్ళాలి. కథ బాగా లేకపోయినా ఆమె నటన అపూర్వంగా ఉంది" అన్నాడు రంగభాష్యం.

అలాగే సభికులు వెళ్ళేంతవరకు ఉండి, నాటక రంగస్థలంకి వెళ్ళి మాలతిని చూచాము. నాటకాన్ని గురించి నా అభివందనాలు తెలిపాక, రంగభాష్యం తన పొగడ్తలు ప్రారంభించాడు

"మీ నటన చాలా బాగుంది. అయినా నాటక కథ శుద్ధ అబద్ధం. మరోసారి మంచి విషయాన్ని గురించి కథ వ్రాసి, నాటకం వేయండి" అన్నాడు.

ఆ సమయంలో మేం ఇద్దరమే కాకుండా మూడో మనిషి ఒకడు అక్కడ నిలుచుని ఉన్నాడు. మాలతి అతన్ని చూపించి, "దయచేసి అతనిదగ్గర చెప్పండి. ఇతను వ్రాసిన నాటకమే అది. నేను కూడా నాటక విషయం బాగా లేదనీ చెప్పాను" అంది.

ఆ మనిషి "సభలో అందరికీ కథ బాగా నచ్చింది. ఎక్కువగా సంతోషించి ఎన్నోసార్లు 'అప్లాజ్' ఇచ్చారు! అధ్యక్షులు కూడా నాటక వస్తువుని శ్లాఘించారు. ఈయనకి మాత్రమే నచ్చలేదు. ఈయన ఏదో అపూర్వ పుట్టుక లాగుంది" అన్నాడు.

ఆ సమయం రంగభాష్యం ముఖం మారిన విధం చూసి నేను త్రుళ్ళాను. కానీ, మరుక్షణమే సమాధానపడి "సరి. మనం వెళ్దాం" అన్నాను. మాలతి దగ్గర అనుమతి తీసుకుని బయలుదేరాము. (సశేషం)

# శ్రీదేవి

27-వ పేజీ తరువాయి

నవ్వింది. ఆమె చామనచాయగా, పొట్టిగా, సన్నగా ఉంటుంది. గుండ్రటి మొహం. ఆమె నవ్వితే బుగ్గలు సొట్టలు పడ్తాయి సావిత్రి చాలా పొడుగ్గా, నల్లగా ఉంటుంది ఆమె మరీ సన్నగా ఉంటుంది మొహం మీద స్ఫోటకం మచ్చలు కూడా ఉన్నాయి ఆమె రూపం అంత ఆకర్షణీయం కాకపోయినా, హృదయం చాలా మంచిది.

"అబ్బో! కొందరికి తీపి ఎంత తిన్నా మొహం మొత్తదు. కావలిస్తే మా శ్యామల నడగండి" అంది సావిత్రి

"అబ్బ! చాల్లేవే ఎక్కడికొచ్చినా వేళాకోళ మేనా ఇదెప్పుడూ ఇంతేలెండి. మీరోపాట వాయించండి" అంది. శ్యామల సావిత్రి కూడా శ్రీదేవిని పాట వాయించమంది శ్రీదేవి తోడిరాగాలాపన చేసి, "వెడలెను కోదండపాణి" అనే కీర్తన వీణమీద వాయించింది. శ్యామలా, సావిత్రీ ఇద్దరూ శ్రీదేవి వాద్యం చాలా బాగుందని మెచ్చుకున్నారు.

"సంగీతం వింటే మనస్సుకు హాయిగా ఉంటుందంటారు గాని, అది నిజమని నే ననుకోనే" అంది ఆలోచిస్తూ సావిత్రి.

"ఏం? నాకు బాగానే ఉంటుంది. నీ కెలా ఉంటుంది?" అని అడిగింది శ్యామల సావిత్రిని చూస్తూ.

"నాకు ఏమిటో చెప్పరాని బాధ కలుగుతుందే. అలా వింటున్నకొద్దీ ఏడుపు వచ్చేస్తుంది. సంగీతం హృదయంలో ఏ ఒక మెత్తని, లోతైన స్థలాన్ని స్పృశించి, అక్కడ ఒక తెరను తొలగించి, ఏదో బాధతో కూడిన దృశ్యాల్ని చూపిస్తున్నట్లుంటుంది" అంది, అప్పటికే చెమ్మగిల్లిన కళ్లతో సావిత్రి.

"నీది చాలా ఆర్ద్ర హృదయమేమోనే! మీకెలా ఉంటుంది?" అని శ్రీదేవిని శ్యామల అడిగింది.

'నాకు సంగీతంలో ఏదో పిలుపు వినిపిస్తున్నట్లుంటుంది. హృదయం, తన అంతస్సు దాటి పైకి వెళ్తున్నట్లుంటుంది ఏదో ఉత్తేజం కలుగుతుంది ఆవేశం వస్తుంది ఏదో సాధించాలనిపిస్తుంది" అంది శ్రీదేవి ఆమె దృష్టి ఎక్కడో ఉంది

"చాలా తమాషాగా ఉంది నాకూ ఉత్తేజం కలుగుతుంది కాని, మీ ఇద్దరికీ కలిగినంత మార్పు కలగదు. నాకు చుట్టూ ఉన్న వాతావరణంమీద ప్రేమా, సానుభూతీ కలుగుతుంది

బహుశా ఇక్కడొక మనస్తత్వ శాస్త్రవేత్త ఉంటే, మన అనుభవాల్నీ, మన మనస్తత్వాల్నీ సమన్వయం చేసేవాడేమో?" అంది సావిత్రి మళ్లీ యథాస్థితికి వచ్చి

"మనస్తత్వ శాస్త్రవేత్తలకు ఇవన్నీ ఎలా తెలుస్తాయి?" అని అడిగింది శ్రీదేవి. ఆమెకు ఎక్కువ విషయాలు తెలుసుకోవాలని చాలా ఆతృతఉంది సావిత్రిమీద ఆమెకు, ఎన్నో విషయాలు తెలిసున్న మనిషి—అని నమ్మకం కుదిరింది

"ఏమో! నిజాని నాకూ తెలియదు ఏదో నోటికొచ్చింది వాగేశాను మీరు ఉత్తేజం, ఆవేశం, అనే మాటల్ని వాడితే నేనూ ఏదో అనేశాను" అంది సావిత్రి తను ఎక్కువ గంభీరమైన విషయాల్ని చర్చించడం ఇష్టపడక

"నే నా మాటల్ని ఏదో పుస్తకంలో చదివి, జ్ఞాపకముంచుకున్నాను నాలో అప్పుడప్పుడు ఏదో మార్పు వస్తూంటుంది బహుశా ఆ మాటలు ఆ మార్పును బాగా వర్ణిస్తాయనుకుంటాను" అంది శ్రీదేవి.

"సావిత్రి కూడా చాలా పుస్తకాలు చదివింది" అంది శ్యామల

సావిత్రి, శ్రీదేవివైపు చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. శ్యామలకు తను వెళ్లవలసిన టైమైందనిపించింది శ్రీదేవి వీళ్లిద్దరివల్లా ఏవో కొత్త విషయాలు తెలుసుకుందామని అనుకుంటూ, ఏమని అడగాలో, ఎలా అడగాలో తెలియక, ఏ విషయం కదుపుదామా? అని ఆలోచించసాగింది. ఇంతట్లో వంటవాడు కాఫీ, ఉప్మా, మైసూర్‌పాకూ,తెచ్చి ముగ్గురిముందూ ఉంచాడు. శ్యామల వద్దని మొహమాట పడుతూంటే, శ్రీదేవి తీసుకోమని బలవంత పెట్టింది. సావిత్రిమాత్రం ఏమీ మొహమాట పడకుండా, టిఫిన్ తినేసి కాఫీ త్రాగేసింది.

"మీరు సంగీతం వింటే బాధ కలుగుతుందన్నారు కదా ఎందుకు కలుగుతుందో చెప్పగలరా?" అని శ్రీదేవి, సావిత్రి నడిగింది

"ఉహూ! చెప్పలేను. కానీ ఎక్కడో ఒక ఇంగ్లీషు కవి రాసిన వాక్యాలు మాత్రం చెప్పగలను. 'మన విషాద తలంపులను చిత్రించే పాటలే అత్యంత మధురమైన గీతాలు' అని కాబోలు దాని అర్థం. ఇది షెల్లీ అనే ఆయన రాసిన ఒక పద్యంలోది."

**అమెరికాలో కొన్ని సినిమా హాళ్లలోకి సరాసరి కార్లు తీసుకుపోయి అందులో కూర్చొని సినిమా చూసేవారు.**

**ఓ పెద్దమనిషి డిక్కీలో పసిపిల్లవాణ్ణి వదేసి తీసుకుపోతున్న నేరానికి పోలీసులు పట్టుకున్నారు "తక్కువఖర్చులో ఇద్దరం సినిమా చూడాలంటే ఇంతకన్న మంచిమార్గం తోచలేదు." అన్నాడా పెద్దమనిషి.**

(శ్రీదేవి (శ్రీకాకుళం)

"ఎంత తమాషాగా రాశాడు!"

"సావిత్రికి ఎన్నో ఇంగ్లీషూ, తెలుగు పద్యాలు వచ్చు పాటలూ, గేయాలూ చాలా బాగా పాడుతుంది కాని, ఎప్పుడూ పాడదు"అంది శ్యామల

అలాగా? అయితే ఒక్కపాట పాడండి"

"శ్యామల మాటలు నమ్మకండి. ఆ పాటలంటే నాకు ఇష్టమే గాని నాకు రావు" అంది సావిత్రి నవ్వుతూ.

"ఉహూ! వీల్లేదు. పాడాలిసిందే. ఏమండీ, ఏమండీ నాకోసం ఒక్కపాట పాడరూ!" అని చిన్నపిల గా శ్రీదేవి అడిగింది

"మీరు అడిగితే, ఏమైనా చెయ్యాలని ఉంటుంది నాకు! నేను పాడ్తాను గాని, నా గొంతుక బాగులేకపోతే నన్ను తిట్టకండేం!" అంది సావిత్రి శ్రీదేవీ, శ్యామలా, తాము ఏమీ అనుకోమనీ, సావిత్రిని పాడమనీ అన్నారు. సావిత్రి, "నా పాట, నీ మాట గానమయ్యేవేళ, నా గుండె నీ ఉండి మ్రోయింపవా వీణ, రాగ మెరుగని వీణ, రక్తి నెరుగని వీణ, తీయకే గడియేని తీగపై నీ చేయి........" అనే పాట పాడింది

"అబ్బ! ఎంత భావుకత్వముంది ఈ పాట" అంటూ శ్రీదేవి వెంటనే వీణమీద, సావిత్రిచేత ఆ ముక్కలు మళ్లీ మళ్లీ అనిపిస్తూ, వాయించేసింది. సావిత్రికీ, శ్యామలకూ, శ్రీదేవి ఉత్సాహం, ఆనందం చూసి ఎంతో సంతోషం వేసింది. వారిద్దరికీ, శ్రీదేవి తమకు ఎంతకాలంనుంచో పరిచయమైన వ్యక్తిలా తోచింది. తమ భావాలకు అనుగుణమైన వ్యక్తి తమకు స్నేహితురాలిగా దొరికిందని సంతోషించారు. శ్యామల మరునాడు భర్తతో ఊరెళ్లిపోతున్నా, సావిత్రిమాత్రం తను తరుచూ వచ్చి శ్రీదేవిని కలుస్తూంటానని చెప్పి, ఇద్దరూ వెళ్ళిపోయారు

వారిద్దరూ వెళ్ళిపోయిన చాలాసేపటివరకూ శ్రీదేవి వారిగూర్చి ఆలోచిస్తూ కూర్చుంది ఆమెది పరిశీలనాత్మకమైన మనస్సు ఆమె ఒంటరిగా, ఎక్కువ కాలం గడుపుతున్నప్పుడు తను చూసినవాటి గురించీ, విన్నవాటి గురించీ తెగ ఆలోచిస్తుంది. ప్రతి విషయాన్నీ, తేలికగా తోసిపారెయ్యదు. అందులోఉన్న సారాంశాన్ని కనిపెట్టడానికి ప్రయత్నం చేస్తుంది ఆమెకు అంతవరకు లభించిన స్నేహితులు గాని, చుట్టూ ఉన్న వ్యక్తులు గాని ఆమె మనస్సును పూర్తిగా ఆక్రమించుకోవడం గాని, ఆమె బుద్ధికి తగిన పని కల్పించడంగాని చెయ్యలేకపోయారు. సావిత్రిమాత్రం ఆమెకు, తన గురించి ఆలోచించవలసిన అవసరం కల్పించింది సావిత్రియొక్క స్వభావం, కొద్దిసేపు గంభీరంగానూ, మరికొంతసేపు ప్రతి విషయాన్నీ తేలికగా తీసుకుంటున్నట్లూ పరస్పర విరుద్ధ భావాల కలావాలంగా కన్పించసాగింది శ్రీదేవికి అలాఉన్న వ్యక్తితో ఎలా మెలగాలో అర్థం కాలేదు శ్రీదేవికి అయినా, తనలో లేనివి, తను ఆధారపడదగినదీఅయిన ఒక తెలివి, ఆలోచనా, సావిత్రిలో శ్రీదేవికి కన్పించాయి అంతేకాకుండా సావిత్రి శ్రీదేవంటే ఆ కొద్ది సేపటిలోనూ ఎంతో ఆప్యాయతా, ప్రేమా చూపించింది అందువల్ల ఆమె స్నేహాన్ని వృద్ధి చేసుకోవాలనుకుంది శ్రీదేవి

శ్రీదేవి గదిలో ఒక మంచం, పరుపూ, రెండు కుర్చీలూ, ఒక నిలువుటద్దం, ఒక పుస్తకాల బీరువా ఉన్నాయి అది అసలు దుర్గాప్రసాద్ గది అతను ఈ ఇంటికి ఎక్కువగా రావడం మానేశాక శ్రీదేవి ఆ గది నాక్రమించుకొంది పుస్తకాల బీరువాకి తాళంఉన్నా, శ్రీదేవివద్ద దాని తాళంచెవి ఉంది కాని, అందులోఉన్నవన్నీ ఇంగ్లీషు పుస్తకాలు. రెండో, మూడో తెలుగు పుస్తకాలున్నాయి అవి స్త్రీ పురుషుల ప్రణయ జీవితాన్ని వర్ణించే పుస్తకాలు వాటిని శ్రీదేవి చదివింది అవిఆమెకుఅంతగా నచ్చలేదు. విజ్ఞానాత్మకమైనవి దొరుకుతే బాగుండుననుకొంది ఆమె మంచంమీద కూర్చుని అద్దంవైపు చూస్తూ ఆలోచిస్తూంటుంది ఒక్కొక్కప్పుడు ఆమె మనస్సు అద్దంమీద లీనమౌతుంది, మరొకప్పుడు ఎదురుగా ఉన్న అద్దమే ఆమెకు కన్పించదు అద్దంలోని ప్రతిబింబమే, ఆ గదిలో ఆమె సహచారి తన భావాలన్నీ ఆ రూపంతో చెప్పుకుంటున్నట్లుంటుంది. ఆలోచించి, ఆలోచించి ఆమె నిద్రపోయింది




# నీల్-కాల్ సిరా

సిరాలన్నిటిలో ప్రశస్తమైనది

ఉచితం

నీల్ కాల్ సిరా 2oz బాటిలు కొన్న వారికి, లక్ష్మి, గణేశ్, వెంకటేశ్వర, వహీదా రహమాన్, స్నానసుందరి మొదలగు పెద్దసైజు(19" × 14") వర్ణచిత్రములలో ఒకటి యివ్వబడును

కళాపరిషత్ - తెనాలి

KV



"ఏవిటే! ఇంట్లో అమృతాంజనం లేదా?

మరి యీ దిక్కుమాలిన జలుబుకు నేనేం చేసేది?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం అమృతాంజనం యింట్లో వుందంటే మీరు విశ్రాంతిగా వుండవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్

14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4

బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

JWT-AM 1880


# శ్రీదేవి

మరునాడు ప్రొద్దున్న జగన్నాథంగారు పొలం వెళ్తున్నప్పుడు శ్రీదేవి అంతక్రితంరోజు శ్యామల తన వద్దకు వచ్చిన సంగతి చెప్పింది శ్యామల చాలా బాగా ఫిడేలు వాయిస్తుందని ఆయన చెప్పారు. తరువాత ఆయన, "కాని శ్యామల ఆర్టిస్టు కాదు. వాళ్ల నాన్నగారు నాకు స్నేహితులు. అందువల్ల నేను చాలా శ్రమపడి ఆ అమ్మాయికి నేర్పాను ఇప్పుడు ఆ అమ్మాయికి పెళ్ళయిపోయింది భర్తతో బొంబాయి వెళ్లిపోతుంది ఇక ఫిడేలు మూలపడేస్తుంది" అన్నారు

"ఆర్టిస్టు అంటే ఏమిటి?" అని అడిగింది శ్రీదేవి

"ఆర్ట్ అంటే కళ. అది ప్రతివారికీ రాదు. పాట అందరూ పాడచ్చు గొంతుక కూడా శ్రావ్యంగా ఉండచ్చు కాని, ఆపాట విన్నవాళ్ల హృదయంలో ఒక కదలిక వస్తేనే అది కళ అవుతుంది లేకపోతే అది వట్టి పాటే అందుకే అనేకమంది సంగీత విద్వాంసులున్నా, వారు ప్రజల్ని రంజింపచెయ్యలేక పోతున్నారు ఉదాహరణకు మన నాయుడుగార్నే తీసుకుందాం ఆయన కమాను, ఫిడేలు తీగెమీద వేసి లాగేసరికే మనం ఆ స్వరానికి ముగ్ధులౌతాం. ఆయన నిజమైన కళాకారుడు మరొక ఫిడేలు విద్వాంసుడు పదేళ్లు ప్రాక్టీసు చేసి, పది గంటలు మనకు వాయించి వినిపించినా ఆ—అనుభూతి మనలో కలగదు అలాగే ఫ్లూటు వాయించినప్పుడు ఆ నాదం మనల్ని ఎక్కడికో తీసుకుపోతుంది. ఈ భౌతిక ప్రపంచాన్ని మర్చిపోతాం ఆ వాయిద్యంలో సమ్మోహనశక్తి ఉంది. అది వింటున్నంతసేపూ, జీవితంలో మనం ఎప్పుడెప్పుడో చూసిన చక్కని దృశ్యాలూ, ఎప్పుడో కలిగిన మధురానుభవాలూ అన్నీ జ్ఞాపక మొస్తాయి హృదయం మేల్కొంటుంది బుద్ధి పని చెయ్యదు అందుకే పశువుల్ని కూడా శ్రీ కృష్ణుని వేణుగానం పరవశుల్ని చేసింది. బృందావనంలో గోపికలంతా తమ పతుల్ని పోగొట్టుకొని, శ్రీ కృష్ణునివెంటపడ్డారు. నిజమైన కళంటే అదమ్మా!" అని జగన్నాథంగారు ఆగారు ఆయన కళ్లు చెమర్చాయి. ఏకాగ్రదృష్టితో శ్రీదేవివైపు చూశారు "నువ్వు భాగవతం చదివావా?" అని అడిగారు

"లేదండీ నేనేమీ చదవలేదు తాతగారి దగ్గర పుస్తకం ఉండడం చూశాను అంతా పద్యాలు. నా కర్థంకావు"

"అయినా పరవాలేదు నాలుగుసార్లు చదివితే అదే అర్థం అవుతుంది 'గోపికా గీతికలు' చదువు భక్తీ, ప్రేమా ఈ రెంటియొక్క స్వరూపం బోధపడుతుంది. కళాకారులంతా గోపికలేనమ్మా, శ్రీ కృష్ణుడే పరమాత్మ. ఆయనను తమ కళ ద్వారా ఉపాసించిన భక్తులు వారు! మీరాబాయికూడా తన భజన్‌లో అదే చెప్తుంది లోకమంతా స్త్రీలేనట, 'ఆయన' ఒక్కడే పురుషుడట" అన్నా రాయన తనలో తను నవ్వుకుంటూ

"మీరా భజన్ ఒకటి నాకు నేర్పుతా నన్నారు?" అంది శ్రీదేవి జగన్నాథంగారు కర్ణాటక సంగీతాన్నేకాక, హిందుస్తానీ సంగీతం కూడా అభ్యసించారు. అందుకని, శ్రీదేవికి అది కూడా నేర్పుతా నన్నారు. ఆయన మాటల్ని పూర్తిగా అర్థం చేసుకునే వివేకం, ప్రపం

చానుభవం ఆమెకు ఇంకా లేకపోయినా, జన్మతః ఆమెకు ఉత్తమ సంస్కారం ఉండడంవల్ల, ఆత్మతో ఆయన భావాల్ని గ్రహించగల శక్తి ఉంది. ఆయన మాటలు ఆమె మనస్సులో అలా నిలిచిపోయాయి. జగన్నాథంగారు, త్వరలోనే మీరాభజన్ నేర్పుతామన్నారు. శ్రీదేవంటే ఆయనకు చాలా అభిమానం.

## 5

ఆరోజు మధ్యాహ్నం రిక్షాలో సుభద్రమ్మ ఇంటికి వెళ్ళింది శ్రీదేవి. ఆమె వెళ్ళేసరికి వేణు పిల్లలతో కారమ్సు ఆడుతున్నాడు. హుషారుగా కబుర్లు చెప్తూ, వాళ్లని నవ్విస్తున్నాడు. సుభద్రమ్మ ఇంట్లో లేదు. శ్రీదేవిని చూడగానే, "రండి. రండి. మీకోసం ఎదురుచూస్తున్నాం. వీళ్లిద్దరూ నన్నోడించేస్తున్నారు. మీరుంటే నాకు కొంత ప్రోత్సాహముంటుంది" అన్నాడు వేణు.

"వద్దు వదినా. నువు మా పక్షం ఉండాలి. మనమంతా కలిసి బాబాయిని ఓడించాలి" అని లీలా, సురేష్ శ్రీదేవి చెయ్యి పట్టుకున్నారు. వీళ్లిద్దరి ఆనందంచూసి శ్రీదేవి నవ్వింది.

"మీరు అలా పక్షపాతం చూపించొద్దు. నేను ముందర మిమ్మల్ని ప్రార్థించాను. కాబట్టి, మీరు నా తరఫున ఉండాలి"

"అబ్బే! అలా వీల్లేదు. వదినె మా జట్టే!"

"ఊహూ! నా జట్టు. ఏమండీ. అంతేకదండీ?"

"అసలు నాకు ఆట వస్తేకదా, ఎవరి పక్షమైనా వహించడానికి" అంది శ్రీదేవి కారమ్సుబోర్డు దగ్గర పిల్లలమధ్య కూర్చొని.

"ఫరవాలేదు. మీ బదులు కూడా నేనే ఆడేస్తాను. మీరు అలా కూర్చుంటే చాలు. నన్ను ఆడమని చెప్తే చాలు."

"అలా వీల్లేదు. వదినె ఆట వదినే ఆడాలి. మేమిద్దరం ఒక పార్టీ. నువ్వూ, వదినే ఒక పార్టీ" అంది లీల వేణుతో.

"ఓ! మీ యిష్టం" అన్నాడు వేణు. అతనికి కావలసిందీ అదే. లీలా, సురేష్, శ్రీదేవికి ఆడడం చాతకాదని, ఆమె బాబాయి పార్టీలో ఉంటే, తామే గెలుస్తామనీ అనుకున్నారు. శ్రీదేవి ఆడుతున్నప్పుడల్లా వేణు ఆమెకు ఎలా ఆడాలో చెప్ప నారంభించాడు. శ్రీదేవి మొదటిసారిలా బెట్టుచెయ్యక, అతను చెప్పినట్లు ఆడడమే కాకుండా తనను 'అండీ' అని మన్నించవద్దనీ, శ్రీదేవి అని పిలుస్తేచాలనీ అంది. వేణు, ఆమెను 'నువ్వు' అనడం ప్రారంభించాడు.

ఆట జరుగుతూన్నంతసేపూ, వేణు శ్రీదేవిని ఏదో వంకపెట్టి పలకరిస్తూనే ఉన్నాడు. "ఆ కాయిన్ నువ్వు వెయ్యగలవా?" "నన్ను ఏ కాయిన్ వెయ్యమంటావో చెప్పు?" "నువ్వు చెప్పిన కాయిన్ వేస్తాను!" "నువ్వు ఏ పాకెట్లోకి వెయ్యమంటే అందులోకి వేస్తాను!" "నీ వేళ్ళు అంత సన్నంగా, సుకుమారంగా ఉన్నాయి. గట్టిగా స్ట్రయికర్ని కొట్టే నొప్పెట్టాయి, జాగ్రత్త!" ఇలా ఏదో విధంగా శ్రీదేవిని పలకరిస్తూ మాట్లాడిస్తూనే ఉన్నాడు. శ్రీదేవి అతనిమాటలన్నింటికీ ప్రత్యుత్తరాలిస్తూ, ఉత్సాహంగా మాట్లాడసాగింది.

లీలా, సురేష్ ఎంత బాగా ఆడినా గెలవలేకపోయారు అందువల్ల అవాళ మధ్యాహ్నం కాఫీ తయారుచేసే డ్యూటీ వాళ్లమీదపడింది. సుభద్రమ్మ మార్కెట్‌కి వెళ్ళింది. అక్కడనుంచి కోవెలలో భాగవతం చెప్తారు కాబట్టి అది విని, సాయంకాలం అయిదింటికి వస్తానని చెప్పి, మధ్యాహ్నం కాఫీ వీళ్లనే పెట్టుకోమంది. కారమ్సు ఆటలో ఎవరోడిపోతే వాళ్ళు కాఫీ పెట్టాలని పందెం వేసుకున్నారు, వీళ్లల్లో వీళ్ళు. లీలకు వంటచెయ్యడం కూడా వచ్చు. అందుకని, ఓడిపోయిన లీలా, సురేష్ ఇద్దరూ కాఫీ పెట్టడానికి వంటింట్లోకి వెళ్లారు. శ్రీదేవి తను కూడా వెళ్ళి సాయం చేస్తానంది గాని, వాళ్ళు వద్దనేశారు. వేణు కూడా ఆమెతో "ఫరవాలేదు. వాళ్ళు బాగానే చేస్తారు. మీరు కూర్చోండి" అన్నాడు. శ్రీదేవి అతనికి, తనను మన్నించవద్దని మళ్లీ జ్ఞాపకంచేసి, అతని కెదురుగా కుర్చీలో కూచుంది. వేణు నవ్వాడు.

"ఈ నాలుగు రోజులనుంచి మీరు—సారి—నువ్వు కన్పించకపోతే నా కేమీ తోచలేదు" అన్నాడు వేణు.

"నాకూ ఇంటిదగ్గర ఎక్కువ కాలక్షేపం కాదు. కాని, కొన్ని పనులు అడ్డురావడంవల్ల రాలేకపోయాను" అంది శ్రీదేవి.

"నే నొక విషయం అడుగుతాను. కోపంరాదు కదా?"

"ఏమిటది?"

"ఏమీలేదు. నిన్ను చూసిన మొదటిరోజునుండి నాకు నువ్వు నా ముఖ్య స్నేహితురాలివనిపించింది. నీ స్నేహాన్ని నేను అభ్యర్థిస్తున్నాను."

"ఇంతేనా? ఇందులో పెద్ద విశేష మేముంది?"

"నీకు అలా అనిపించచ్చు. కాని, అది నాకు చాలా ముఖ్యమైన విషయం. నీలాంటి స్త్రీ, నాలాంటి వాడితో మాట్లాడుతోందంటే అది నా అదృష్టం. నే నొక శుద్ధ పనికిమాలినవాణ్ణి. నాకు మా అన్నయ్య చనిపోయిన దగ్గర్నుంచి జీవితంఅంటే విరక్తి పుట్టేసింది. ఈ పనికిమాలిన జీవితంలో సుఖం లేదు. వదినె మరీ ఒంటరిదైపోతుందనీ, పిల్లలు దిగులుపడ్తారనీ ఆలోచించకపోతే, నే నేనాడో ఆత్మహత్య చేసుకొని ఉందును"

"అరె! మీకు అంత అవసరమే మొచ్చింది?"

"నీవు భయపడనక్కరలేదు. నే నింక అలా ఆలోచించడం మానేశాను. అది నిన్ను చూసిన దగ్గర్నుంచే"

"నాలో ఏముంది?" అంది శ్రీదేవి.

"నీ అందం చాలా గొప్పదని నేను ప్రత్యేకంగా పొగడక్కరలేదు. ఆ సంగతి ఇతరుల ద్వారా నీకే తెలుసు. కాని, నేను కూడా నీలాటి అందకత్తె నింతవరకూ చూడని మాట వాస్తవమే! అదొక్కటే కాదు నీ హృదయం ఎంతో మంచిది. నన్ను అపార్థం చేసుకోకుండా, నీ హృదయంలో నాకు తావిమ్మని కోరుతున్నాను."

"మీరు నన్ను చాలా పొగుడుతున్నారు."

"లేదు. ఒకర్ని పొగడడం నా చేతకాదు. నేను అసలు ఎవరినీ లెక్కజేసే మనిషినికాను. కాని, నిన్ను చూసిన దగ్గర్నుంచి, నా బుర్ర పాడైపోయింది. నీవు కన్పించకపోతే ఈ నాలుగురోజులూ నాకు అన్నం సరిగా సయించలేదు. నీకు నామీద కొద్దిగానైనా అభిమానముందని తెలుస్తే గాని నా మనసు కుదుట బడదు."

"మీరు అంత బాధపడుతున్నారని నాకు తెలియదు. నాకోసం అంత ఆతృతపడేవాళ్ళున్నారని తెలుస్తే నాకూ సంతోషంగా ఉంటుంది. వాది

H.M.V.వారి
"షెర్లా"
నాజ్యూమైన 4 Speed
"రికార్డు ప్లేయర్"
AC మరియు బ్యాటరీలలో లభించును
ధర. ACరు.215/-; బ్యాటరీ రు.185
(ఎక్సైజ్, స్థానిక పన్నులు అదనం)
మావద్ద L. P. &E. P. యిండియన్/యింటర్నేషనల్ గ్రామఫోను రికార్డులు లభించును.
మాధవ & కో,
పార్కురోడ్_విజయవాడ.1




# శ్రీదేవి

ఒక దురదృష్ట జీవితం. అన్నీ ఉండి కూడా సుఖపడ లేని జీవితం.''

''అయితే నీ మనస్సులో బాధ నాతో చెప్పాలి'' అన్నాడు వేణు.

ఇంతలో లీలా, సురేష్ కాఫీ కప్పులు తీసుకు వచ్చి, శ్రీదేవికీ, వేణుకీ చెరొకటీ ఇచ్చారు.

''ఇప్పుడు కాదులెండి. మరొకసారి చెప్తాను.''

''ఊహూఁ! వీల్లేదు. నామీద నీకు అభిమానం ఉంటే ఇప్పుడే చెప్పాలి. నా దగ్గర ఏమీ దాచవద్దు. నీ మనస్సు ఏ మాత్రం బాధపడుతోందని తెలిసినా నా కేమీ తోచదు. లీలా, సురేష్ మీరు ఆ కొత్త టెన్నిస్ బంతితో ఆడుకోండి'' అన్నాడు వేణు. వాళ్లిద్దరూ ప్రొద్దుటినుంచి ఆ బంతి ఇమ్మని వాళ్ల బాబాయ్ని వేడుగుతున్నారు. అతనంతవరకూ ఇవ్వలేదు. అది తీసుకోమనగానే వాళ్లిద్దరూ, అది తీసుకొని ఆడుకోడానికి పెరట్లోకి వెళ్ళిపోయారు.

''చెప్తే మీ మనస్సుకు కూడా కష్టం కలుగుతుంది. అయినా ఇందులో పెద్ద విషయమేమీ లేదు. అయినా ఎందుకో మనస్సు దిగులుగా ఉంటుంది. అదేమిటో అర్థంకాదు''

''నువ్వు చెప్పకపోయినా, నీ మనస్సులోవున్న బాధ నేను కొంతవరకూ అర్థం చేసుకున్నాను. పారిజాతం పువ్వులాంటి నీ హృదయాన్ని ఇతరులు నలిపేస్తున్నారు. నీ గురించి నీ వాళ్లెవరూ పట్టించుకోవటంలేదు. నిజంకదూ!''

''అవును. వాళ్ల దిగుళ్లకే వాళ్లు ప్రాధాన్యం ఇస్తున్నారు. కాని, అదీ సహజమేననుకుంటాను.''

''వాళ్లకు హృదయంలేదు. నీలాంటి సుకుమార మైన స్త్రీయొక్క మనస్సుమీద వాళ్ల పరస్పర వైషమ్యాలూ, దెబ్బలాటలూ ఎంత ఒత్తిడి కలిగిస్తే, ఎంత బాధను కలిగిస్తాయో వాళ్లు ఆలోచించటంలేదు. వాళ్ల జీవితాలు అప్పుడే ఒక త్రోవకు వచ్చేశాయి. నీ జీవితం కూడా వాటిలాగే అంధకారమయం చెయ్యాలని చూస్తున్నారు. నాకేగనుక నీలాటి అందాలరాశి దొరికితే పువ్వులతో పూజిస్తాను. నా ప్రాణంపోయినా నీకు కష్టం కలగనివ్వను'' అన్నాడు వేణు కొంచెం ఉద్రేకంగా.

''మీకు, అత్తయ్య ఈ విషయాలు చెప్పిందా?''

''ఎక్కువగా చెప్పలేదు. కాని, ఊళ్లో, నీ అమ్మకీ, నాన్నకీ పడదని చాలామందికి తెలుసు.''

ఒక్క నిముషం ఆలోచించి, శ్రీదేవి ''ఇద్దరూ మంచివాళ్లలాగే కన్పిస్తారు. కాని, ఎందుచేతనో వారికి పడదు'' అంది.

''ప్రేమలేని వివాహాలన్నీ అలాగే ఉంటాయి. ఆ తల్లి తండ్రులమధ్య పిల్లలు మరీ నలిగిపోతారు.''

''అవును. అమ్మను నాన్నగారేమైనా అన్నరోజున నా మనస్సెంతో బాధపడుతుంది. ఇద్దరికీ సమాధానం చెప్పాలనుకుంటాను. ఒకవిధంగా చూస్తే వారిద్దరిదీ తప్పుండదు. కానీ, నాన్నగారి కిట్టే కోపం వస్తుంది. అమ్మ అలాంటప్పుడు, సర్దుకొని ఊరుకోక, ఆయన మనసు నొచ్చేమాటేదో అంటుంది. దాంతో ఆయన మరింత రెచ్చిపోతారు. తను నోటి కిష్టంవచ్చినట్లు మాట్లాడుతారు. అప్పటికీ అమ్మ సర్దుకోదు. తను ఏదో అనేస్తుంది. అలా వాళ్లిద్దరిమధ్యా పెద్ద దెబ్బలాటయిపోతోంది. అది చూసి నాకు తల ఏ గోడకైనా బాదుకోవాలని పిస్తుంది. వెర్రెత్తిపోతున్నట్లవుతుంది. నాన్నగారు ఎప్పుడు బయట కెళ్ళిపోతారా అనిపిస్తుంది. ఆయన వెళ్ళిపోయిన తరువాత కూడా బాధగానే ఉంటుంది. ఇదంతా ఏమిటో చెప్పలేనంత భయం, బాధా కలిగించి మనస్సులో ఎప్పుడూ ఎలాగో ఉంటుంది.''

''పాపం!'' అన్నాడు వేణు ఆమె యందు జాలి చూపిస్తూ. అతనితో ఆమాత్రం చెప్పుకోవడం శ్రీదేవికి కొంత హాయి అనిపించింది. వేణు ఆ నిముషంలో ఆమెకు ఎంతో ఆప్తుడిలా కన్పించాడు. తనయందు అంత సానుభూతి చూపిస్తున్న వ్యక్తిని ఆమె అభిమానించకుండా ఉండలేకపోయింది.

''మీతో చెప్పుకోడం నాకు కొంత మనశ్శాంతిగా ఉంది. అయినా, ఇవన్నీ ఎవరితో చెప్తాం? పై వాళ్లతో చెప్పుకుంటే వాళ్ల దృష్టిలో మనం హీనమవడం తప్ప వేరే లాభంలేదని అంటుంది మా అమ్మమ్మ. అందుకని, ఎవరికీ చెప్పడం ఇష్టం ఉండదు'' అంది శ్రీదేవి.

''అలా అనకు. ఎవరి దగ్గరైనా దాచు గానీ, నావద్ద దాచకు. నువ్వంటే నా కెంత అభిమానమో నీకు తెలియదు. నాకు కూడా ఒకొక్కప్పుడు జీవితం చికాకుగా, అర్థవిహీనంగా కన్పిస్తుంది. అప్పుడు నీ విశాలమైన కళ్ళూ, అందమైన మొహం జ్ఞాపకమొస్తాయి. నా మనస్సులోఉన్న విషయం నీముందు బయట పెట్టడానికి ఎంతో భయపడ్డాను. నువ్వు నీ స్నేహాన్ని నాకు ఇవ్వకపోతే, ఈ పాటికి గోదావరిలో దూకేసేవాణ్ణి.''

''ఛ! ఛ! నాకోసం మీరు అంత బాధపడడమెందుకు? నాలో గొప్పతనం ఏముంది? అయినా, మమ్మల్ని ఎందుకు హీనంగా చూడాలి? మీకు తెలిసినన్ని విషయాలు చాలామందికి తెలియవు. మీవన్నీ కొత్తరకం భావాలు. మొన్న మీరు ఇంగ్లీషువాళ్ల గురించి చెప్పిన విషయాలు ఎంతో బావున్నాయి. వాటి గురించి నేను చాలాసేపు ఆలోచించాను. అలావుంటే ఎంత బావుంటుంది!''

''నీకు కూడా అటువంటి ఆలోచన లున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది. స్త్రీలంటే నాకు చాలా గౌరవం. వారి దృక్పథంలో మార్పు వచ్చిననాడే సంఘం బాగుపడుతుంది.''

''నా ఉద్దేశంలో జీవితం అలాగే గడపాలి గాని, ఇప్పటిలా అందరికీ లొంగి, ఒకరి చెప్పుచేతల్లో బ్రతుకుతూ ఉండడం నా కిష్టంలేదు'' అంది శ్రీదేవి. వేణు, తమ ఇద్దరి స్వభావాలూ ఒకటే నన్నాడు. అంతలో సుభద్రమ్మ రావడం చూసి, ''మన స్నేహం ఎప్పటికీ ఇలాగే ఉండాలి. రోజూ నువ్వు వస్తూండాలి సుమా! నిన్ను చూడకపోతే నాకు తోచదు'' అన్నాడు. శ్రీదేవి, తను రోజూ రావడానికి ప్రయత్నిస్తానంది.

అప్పుడే ప్రవేశించిన సుభద్రమ్మ, ''ఎంతసేపయిందమ్మా నువ్వొచ్చి? నాకు తెలియనేలేదు. పోనీ, కొవెంకు సురేష్‌చేత కబురు పంపలేకపోయావా'' అంది.

''నేను వచ్చి చాలా సేపయింది గాని, ఏదో పిల్లతో ఆడుతూ, సరదాగా గడిపేశాను. ఇంటిదగ్గరుంటే ఏమీ తోచదు'' అంది శ్రీదేవి. సుభద్రమ్మ శ్రీదేవికి కాస్సేపు ఆర్లీకలు చెప్పింది. వేణు బట్టలు వేసుకొని, చిన్న చిరునవ్వు శ్రీదేవివైపు చూసి నవ్వి, టెన్నిస్ రాకెట్ తీసుకొని, ''వస్తా!'' నని చెప్పి బయటికి వెళ్ళిపోయాడు. శ్రీదేవి కూడా మందహాసంతో తలూపింది. మరొక గంటసేపు గడిపి శ్రీదేవికూడా తనింటికి వెళ్ళిపోయింది.

వేణు తిన్నగా కాలేజీకి వెళ్ళిపోయాడు. అక్కడ నళిని అతనికోసం ఎదురుచూస్తోంది. ఆమెతో మరిద్దరు స్నేహితురాళ్లు కూడా ఉన్నారు. నళిని అవాళ వంగపండురంగు చీర కట్టుకొంది. అటువంటి రవికే వేసుకుంది. తెల్లని ఆమె శరీరచ్ఛాయమీద ఆ బట్టలు ఎంతో శోభను గూర్చాయి. అంతవరకూ ఆమె, కొంతమంది విద్యార్థినులతో బాడ్మింటన్ ఆడిఉండటంవల్ల చీరకొంగు నడుముకి బిగించి కట్టిఉంది. వేణు ఆట చూడడానికి, ఆమె టెన్నిస్ కోర్టు ప్రక్కన ఉన్న సిమెంటు బెంచీలపై స్నేహితురాళ్లతో కూర్చొని ఉంది. ఇద్దరు లెక్చరర్లూ, మరొక స్టూడెంటూ, వేణూ టెన్నిస్ ఆడారు.

టెన్నిస్ ఆడడం అయిపోయాక నలుగురూ, విద్యార్థినులూ, కలర్సు త్రాగుతూ ఆట గురించి చర్చించారు. నళినికి టెన్నిస్ బాగా ప్రాక్టీసు చెయ్యాలని ఉంది. అప్పటికింకా కాలేజీ విద్యార్థినులు టెన్నిస్ ఆడటం తక్కువే. మిక్సెడ్ డబుల్సు ఆడడంకోసం, రాజమండ్రీ రైల్వేకాలనీలో ఉండే ఆంగ్లో ఇండియన్ స్త్రీలు వస్తూండేవారు. వేణుకు ఇద్దరు ఆంగ్లో ఇండియన్ యువతులతో కూడా పరిచయం ఉంది. అతను ప్రతివారితోనూ చాలా సులభంగా పరిచయం చేసుకోగలడు. అతను, నలుగురిలో ఉంటే వాళ్లందరికీ ఏవో కథలూ, కబుర్లూ చెప్పి నవ్విస్తూ, వారి అభిమానాన్ని సంపాదిస్తాడు. హాస్టలులో విద్యార్థులు చాలామందితో అతను దృఢస్నేహం సంపాదించాడు. స్త్రీలతో మాట్లాడి, వాళ్ల మెప్పున్న పొందడం అతనికి పుట్టుకతో అబ్బిన కళ! ఎంత బెట్టుగాఉండే స్త్రీలనైనా, పలకరించి చనువు

---

ఒక పెద్దమనిషి తనను గెలిపించినందుకు న్యాయవాదికి ఓ తోలుసంచీ బహుమతిగా ఇచ్చాడు.

''ఏమయ్యా! నా ఫీజును ఈ ముష్టిసంచీ ఇస్తున్నావా? నాకు రొక్కమే కావాలని ముందే చెప్పానుగా'' న్యాయవాది గుడ్లురిమాడు. ''నాకు రావల్సిన రు.500 వెంటనే ఇవ్వు'' అన్నాడు.

ఆ పెద్దమనిషి మళ్లీ మాట్లాడకుండ సంచీవిప్పి, అందులో వున్న రెండు ఐదువందల రూపాయల చెక్కులలో ఒకటి తను తీసుకొని రెండోది న్యాయవాదికిచ్చి చక్కాపోయాడు.

నాగమణి (బరంపురం)

---

బొక్కొంటాడు. పైగా వా రందరికీ, తామంటే అతని కొక ప్రత్యేక అభిమానం ఉందనే అభిప్రాయం కలిగించగలడు. అతని దగ్గర డబ్బుంటే ఇతరుల కోసం విచ్చలవిడిగా ఖర్చు పెడతాడు. అతని దగ్గర లేకపోతే ఇతరుల దగ్గర సులభంగా అప్పు చేసేస్తాడు. వాళ్ళు తిరిగి అడగనూ అడగరు; అతను ఇవ్వనూ ఇవ్వడు.

నళినికి వేణు అంటే చెప్పలేని అభిమానం. అతనితో కలిసి టెన్నిస్ ఆడాలని ఆమె కోరిక. ఒక టెన్నిసే కాకుండా అన్నిటిలోనూ అతనితో కలిసి మెలసి తిరగాలని ఆమె కోరిక. ఆమె చాలా చొరవగల యువతి. మగవారితో అన్ని విషయాలలో కలిసి మెలసి తిరుగుతుంది. చాలామంది పురుషులు ఆమె నడవడిక మంచిది కాదనుకొని, తమకు లొంగుతుందేమోనని ప్రయత్నించారు. కాని, ఆమె తనవద్ద అసభ్యంగా ప్రవర్తించిన పురుషుణ్ణి నలుగురిలో తిట్టి, అవమానించగల సమర్థురాలు. అందువలన ఆమె అంటే చాలామందికి భయం కూడా ఉంది. కాని, వేణు కోసం ఆమె చాలా శ్రద్ధ తీసుకొనేది. సాయంకాలం వారిద్దరూ రిక్షాఎక్కి నళిని ఇంటికి వెళ్ళారు.

ఇన్నీస్‌పేటలో ఆమె దొక చిన్న ఇల్లు. ఆమె దే కులమో ఎవరికీ తెలియదు. ఆ చుట్టుప్రక్కల వాళ్ళు వాళ్ళని బొందిలీలంటారు. తండ్రి చిన్న తనంలోనే చనిపోయాడు. ఒక అన్న బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆస్తి కొంత ఉంది. తల్లీ, కూతురూ చాలా దర్జాగా ఉంటారు. నళినికి కావలసినంత స్వేచ్ఛ ఉంది. వేణు ఆమెను కలుసుకొనిన దగ్గర్నుంచీ ఆమె ఇంటికి అనేక సారులు వచ్చాడు. నళిని—గది ప్రత్యేకంగా ఉంటుంది. అతనూ, నళినీ ఆ గదిలో ఎంతసేపు కూర్చున్నా, ఎవరూ అడగరు. ఆమె గదిలోకి వెళ్ళగానే మంచంమీద కూర్చున్నాడు, వేణు. నళిని కాఫీ తెస్తానని లోపలికి వెళ్ళింది. వేణు సిగరెట్టు ముట్టించాడు. నళినితో స్నేహం అతి సులభంగా అతనికి లభించింది. తను ఏది కోరితే అది చెయ్యడానికి నళిని సిద్ధంగా ఉన్నట్లు కన్పిస్తోంది. శ్రీదేవి గూర్చి తను ఎంతో బాధపడ్డాడు. మొదట్లో శ్రీదేవి తనకు అందని ద్రాక్షపండు అనుకొన్నాడు. క్రమంగా ఆమె దారిలోకి వస్తున్నట్లు కన్పించింది. ఆవాళ ఆమె ధోరణి చాలా సుముఖంగా కనిపించిం దతనికి. ఆమెను ఎలా మంచి చేసుకోవాలా అని ఎంతో ఆలోచించాడు. చివరికి కృతకృత్యుడయ్యాడు. శ్రీదేవి కొద్దిరోజులలో తనను ఆరాధిస్తుంది. ఆమె అందమైన ముఖం, ఎర్రని పెదవులూ, జ్ఞాపకమొచ్చాయి. తనలో తను చిరునవ్వు నవ్వుకున్నాడు.

"ఏమిటి నీలో నువ్వే నవ్వుకుంటున్నావు?" అంటూ నళిని రెండు కప్పులతో కాఫీ తెచ్చి, ఒకటి వేణు కిచ్చింది.

"ఏమీలేదు. కాలేజీలో నువ్వంటే అందరికీ చాలా భయమే. నాకు మాత్రం నువ్వు నట్టి అమాయకంగా ఎలా కన్పిస్తావా? అని ఆలోచిస్తున్నాను"

"నువ్వు అందరిలాంటివాడివి కావుగా. నీలో ఏదో ప్రత్యేకత ఉంది. అందుకని నీకు అలా అనిపిస్తోంది."

"అసలు వాళ్ళు నిన్నలా చూడడానికి కారణం ఏమిటి?"

"అదొక చిన్న కథ. క్రిందటి సంవత్సరం ఒక కుర్రాడు నన్ను అల్లరిపెట్టాలని చూశాడు. నేను సైకిలుమీదనుంచి వస్తూంటే కాలేజీ గేటు దగ్గర నన్ను ఆపి, నా జడలో పువ్వొకటి అడిగాడు. మర్యాదగా అడిగితే ఇచ్చేదాన్నేమో! కాని, పెంకితనంగా 'డార్లింగ్' అని సంబోధిస్తూ అడిగాడు. దానితో కోపంవచ్చి 'ఇడియట్' అని తిట్టాను. చుట్టూ ఉన్న మగపిల్లలు నవ్వారు. వెంటనే నా జడలో పువ్వు తీద్దామని ప్రయత్నించాడు. వెంటనే కాలినున్న జోడుతీసి వాడి దవడ శుద్ధిచేశాను. వాడా అవమానం భరించలేక, నేను వెళ్ళిపోతూంటే 'రేపు నీ పని చెప్తా చూస్కో!' అన్నాడు. ఆవాళ సాయంకాలం మా ఇంటికి 'జబ్బార్' అని ఒక మా స్నేహితుడు వచ్చాడు. ఆయన చాలా డబ్బూ, పలుకుబడీ, బలం ఉన్న మనిషి. మర్నాడు ఆయన నాతో వచ్చి, గేటుదగ్గర ఆ కుర్రాణ్ణీ, అతనితో సహా మరి నలుగురు స్టూడెంట్సునీ చావ చితకకొట్టేశాడు. పైగా, నా జోలికి ఎవరైనావస్తే 'జాగ్రత్త' అని హెచ్చరించి వెళ్ళాడు. ఈ ఊరులో ఆయనంటే కొంత భయం ఉంది."

"మొత్తానికి విద్యార్థులకు గట్టి పాఠం చెప్పావన్న మాట. చివరికి కుక్కకాటుకి చెప్పుదెబ్బ తినిపించావు!"

"ఆ! లేకపోతే వీళ్లను, 'అన్నయ్యా!' 'తమ్ముడూ!' 'మా జోలికి రాకు'—అని బతిమాలితే వింటారనుకుంటున్నావా? దండోపాయానికిగాని లొంగరు. మరి కొందరు కుర్రాళ్ళు, చదువుకోడానికి రారు. కేవలం అమ్మాయిల్ని ఏడిపించడానికే వస్తారు. వారికి మరోవిధంగా చెప్తే అర్థంకాదు. ఇదంతా పెద్ద గొడవవుతుందనీ, తమ పేరు బయటికి వస్తుందనీ, అందువల్ల తమకు వివాహం కావడం కష్టమౌతుందనీ కొందరు ఆడపిల్లలు అలాటివన్నీ సహించి, పెద్దవాళ్లకైనా చెప్పకుండా ఊరుకొంటారు. కానీ, అక్కడి కక్కడ ఎదురు తిరిగి, తెగతెంపులు చేస్తే ఈ కుర్రాళ్ల రోగం అణుగుతుంది. నా పద్ధతి అంతే" అంది నళిని.

"మంచి పద్ధతి. నువ్వసలు ఎవరినీ లెక్కచెయ్యవనుకుంటాను. కాని, నీ అంత చొరవగా అందరు ఆడపిల్లలూ ఉంటే బాగుణ్ను. ఎక్కడో మాటికీ కోటికీ ఒకరుంటే ఏం లాభం?"

"అదైనా కొంత మేలేకదా. వాళ్ళను జూసి, ఇతరులు కొంత నేర్చుకుంటారుకదా! లేకపోతే ఈ మగవాళ్ళు, స్త్రీని ఇంకా ఇంకా అణిచెయ్యాలని చూస్తారు."

"నువ్వు కాలేజీలో చదువు పూర్తయింతరువాత దేశంలో స్త్రీలను ముందుకు తీసుకుపోయే పనేదైనా చెయ్యరాదూ?"

"తప్పకుండా చేస్తాను. కాని, నాకు ఏ పని చెయ్యాలన్నా ఓర్పు తక్కువ. నువ్వు సాయం ఉంటే ఏమైనా చెయ్యగల్నేమో."

"నేను కూడా ఎందుకూ? నీ చొరవా, తెలివితేటలూ చాలు."

"చాలవు వేణూ. ఒక్కొక్కప్పుడు అలాగే ఏవో గొప్ప పనులు చెయ్యాలనిపిస్తుంది. కాని, మళ్లీ కాస్సేపటికి అది నా వల్ల కాదనిపిస్తుంది. నాలో చెలరేగే భావాలే, నే నదుపులో పెట్టుకోలేను. ఇతరుల కెలా సేవ చెయ్యగలను? — అనిపిస్తుంది."

"అయితే నే నేం చెయ్యగలను?"

"నిన్ను చూసిన దగ్గర్నుంచి, నాలో ఒక ప్రశాంతత ఏర్పడింది. నువ్వు మాట్లాడుతున్నప్పుడూ, నవ్వుతున్నప్పుడూ, నా వైపు చూస్తున్నప్పుడూ, నా మనస్సు పూర్తిగా నీవైపు ఆకర్షింపబడుతున్నట్లుంది. నా హృదయంలో ఏదో ఆనందం కలుగుతుంది. నువ్వు నన్ను దూరం చెయ్యకుండా ఉంటే చాలు" అంది. వేణు ఏమీ జవాబు చెప్పకుండా ఆమె చేతిని తీసుకొని, ముద్దుపెట్టుకున్నాడు. నళిని అతని ఒడిలోకి ఒరిగిపోయింది. (సశేషం)



## ధన్యవాదాలు — నేను కూడా సిజర్సు మాత్రమే కాలుస్తాను

ఈ యిద్దరేకాదు — ఏభై సంవత్సరములకు పైగా పల్లె పల్లెలలోనూ వాడ వాడలలోనూ దేశమంతటా అనేక తరహాల వేలాది ప్రజలు 'సిజర్సు' సిగరెట్టును కాల్చి కొనియాడుచున్నారు. దినదినాభివృద్ధి చెందుచున్న దాని వాడకమే 'సిజర్సు' యొక్క విలువకు తార్కాణము. 'సిజర్సు' నాణ్యమైన సిగరెట్టు —దాని రుచి మరచి పోరానిది— దాని సువాసన అద్భుతము. చలికాలమైనా. వేసవి కాలమైనా. వర్షాకాలమైనా సరే 'సిజర్సు' ఎల్లవేళలయందును సంతృప్తి పరచును.




JWTS 2280

# పాపం చదువుకొన్న అబ్బాయి!

25-వ పేజీ తరువాయి

తరువాత వారు కొంతసేపు మాట్లాడుతూ ఉండగానే సుదర్శనం వచ్చేడు.

"ఏరా ! ఎలా చదువుతున్నావు ?" అని శేఖర్‌ని ప్రశ్నించి, వారందరూ మాట్లాడుకొన్నతరువాత, ఆ రోజు అన్నా వదినల బలవంతంవలన భోంచేసి హాస్టల్‌కి వెళ్లిపోయాడు శేఖర్.

అంతవరకు పిల్లిలా ఉన్న సంధ్య, 'హమ్మయ్య!' అని గాలి పీల్చుకొంది. సంధ్యకి శేఖర్ ఇంటికి వస్తే భయం. సరళ ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసయ్యాక చదువు మానివేసి పెండ్లిచేసుకొంది. సంధ్యవాళ్లు ఉంటున్న ఊరిలో కాలేజీ లేకపోవడంవలన, వాళ్ల అక్కాబావల బలవంతం వలన వాళ్ళక్కయ్యదగ్గర ఉండి చదువుకుంటోంది. సుదర్శనం డాక్టర్. మరదలంటే చాలా అభిమానం. శేఖర్, సుదర్శనం చిన్నాన్నగా రబ్బాయి. తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. ఆనర్స్ చదువుతున్నాడు. ఈ కాలం అబ్బాయిలందరికి వ్యతిరేకి. తననుకూడా సుదర్శనం వాళ్ళింట్లో ఉండి చదువుకోమంటే, ఎగిరి గంతువేయక, ఇంకొక చదువుతున్నమ్మాయి అక్కడ ఉండగా తను కూడా ఉండటం ఇష్టపడలేదు. శేఖర్‌కి అన్నీ మంచి గుణములున్నా ఒకటే ఒక దుర్గుణం ఉంది. ఏమిటంటే చదువుకున్నమ్మాయిలపై చెడ్డ అభిప్రాయం. అమ్మాయిలకు ఉన్న ఊళ్లోని హైస్కూల్ చదువు చాలంటాడు ఈ చదువుకున్న అబ్బాయి ! ఎక్కువ చదువుకుంటే వాళ్ళకు వినయం, సుగుణం లాంటివి వుండవని అతని అభిప్రాయం. అందుకే వదినగారైన సరళంటే ఎంత గౌరవమో, సంధ్య అంటే అంత చికాకు.

అక్కయ్యకు పెండ్లయిన కొత్తలో ఒకటి రెండు సార్లు శేఖర్‌ని చూసింది సంధ్య. తరువాత వైజాగ్ వచ్చాక అతడి సంగతి చెబుతూ అతనికి చదువుకున్న అమ్మాయిలంటే కోపమని ఒకసారి చెప్పింది సరళ. అది మనస్సులో నాటుకుపోయింది. చదువుకున్న అమ్మాయిలంటే మగవాళ్ళకి ఎందుకింత హేళనో అర్థం కాలేదు.

ఆవేళ సంక్రాంతి పండుగ. పరీక్షలు దగ్గర కొస్తున్నాయని శేఖర్, సంధ్యా కూడా ఇండ్లకి వెళ్ళలేదు. అందుకని సుదర్శనం ఎంతో బలవంతంగా ఆ పండగరోజు తనింటికి తీసుకువచ్చాడు. ఒక తల్లి కడుపున పుట్టకపోయినా ఆ అన్నదమ్ములు అన్యోన్యత లాంటిది ! వాళ్ళిద్దరిని చూస్తుంటే సరళకు చాలా ముచ్చటగా వుండేది. మేడమీద సుదర్శనం గదిలో శేఖర్, సుదర్శనం పడుకొన్నారు. సంధ్య–గదిఆ ప్రక్కదే కావటంచేత గదిలో కూర్చుని ఆలోచిస్తోంది. సరళ గదిలోకి వస్తూ "ఏమిటే ! ఆలోచిస్తున్నావు ?" అంది. "ఏమి లేదక్కా ! చదువుకున్నమ్మాయిలపై నీ అభిప్రాయం ఏమిటి ?" అంది సంధ్య.

"అదేమిటే వింతగా మాట్లాడుతున్నావు ? నేను ఎప్పుడైనా చదువుకున్నవాళ్ళని ఏమైనా అన్నానా ?" అంది సరళ.

"అది కాదక్కా ! నువ్వన్నావని కాదు ! సాధారణంగా చదువుకున్నమ్మాయిలు కాస్త హుషార్‌గా ఉండి చురుకుగా మాట్లాడితే, మన పెద్దవాళ్ళు, "అమ్మ బాబోయ్ ! ఈ చదువుకున్నమ్మాయిలతో మాట్లాడగలమా !" అంటారు. అదే ఏ చదువూ లేనమ్మాయి అయితే నోరుమూసుకొంటారు. అదే ఎందుకని అక్కా ? చదువుకున్నమ్మాయిలుముచ్చటపడి సరదాగా పేరంటానికి వెళితే, "పసుపు రాసుకుంటారా ? కుంకుం పెట్టుకుంటారా ? గంధం పూయమంటారా ? ఎంతైనా చదువుకున్నవాళ్ళు కదా !" అని పదిసార్లయినా అంటారు. ఎంత చదువుకుంటే మాత్రం ఆడవాళ్ళుకదూ ? పసుపు కుంకుం వాడరూ ? అలా పదిసార్లు వాళ్ళని దెప్పితే వాళ్ళ చదువుని అవమానిస్తారని బాధపడతారన్న ఆలోచనన్నైనా ఉండక్కరలేదా !" అంది తీవ్రంగా సంధ్య.

తెల్లబోయి చూస్తున్న సరళ, "ఏమిటే ! ఈరోజు ఇంత తీవ్రంగా మాట్లాడుతున్నావు ! ఏం జరిగింది ?" అంది ఆశ్చర్యంగా ముఖంపెట్టి సరళ.

"కాదక్కా! చదువుకోకపోయినా చాలామంది అమ్మాయిలు ఎక్కువగా విరగబడుతుంటారు. కాని చదువుకున్నవాళ్ళు చదువుకున్నామన్న విజ్ఞానంచేత సరదాగా మాట్లాడినా, పరిసరములబట్టి ప్రవర్తిస్తారు కదా ?"

---

ఒక జైలు అధికారి ఖైదీలను బాదటం మొదలు పెట్టాడు. అదిచూసి ఓ పెద్దమనిషిలా చెప్పాడు.

ఎందుకయ్యా! వాళ్ళనలా బాదటం? వాళ్ళకు, ఆడవాళ్ళు వాడే నైలాన్ దుస్తులు వేసి, తోటివారిముందు పచారు చేయించు. ఛస్తే నీమాట కెదురుతిరగరు.

రంగారావు, (కాకరపల్లి)

---

"పోనీలేవే ! ఒకరితో మనకెందుకు ? పూర్వకాలంలో ఆడవాళ్ళకు చదువులు ఎలాగో లేవుకదా ! ఈ కాలం వాళ్ళకి ఆ భాగ్యం లభించిందని అందరి ఏడ్పానూ ! మీరు చదువుకొని కూడా వాళ్ళనర్థం చేసుకోకపోతే ఎట్లా ?" అంది సరళ.

"అది కాదక్కా ? చదువులేని వాళ్ళు అన్నా అంత బాధగా ఉండదు కాని చదువుకున్న వాళ్ళకు కూడా అలాంటి అభిప్రాయాలు ఎందుకు ? ఎప్పటికైనా చదువుకున్న వారికున్న వినయ విధేయతలు చదువు లేనివారికి ఉండవని తెలిసికుంటే అంతే చాలు. అలాగని చదువుకున్న వారందరిలో మంచివారు ఉండరుఅనుకో ! అలాంటప్పుడు అందరిని కలిపి హేళన చెయ్యటం బాగా లేదక్కా!" అంది విచారంగా సంధ్య. "సరేలేవే ! నాకు పనిఉంది" ! క్రిందకు వెళ్ళాలి" అని మేడదిగి వెళ్ళిపోయింది సరళ.

నిద్రపట్టక అటు, ఇటు కదులుతున్న శేఖర్, అక్కా చెల్లెళ్ళ సంభాషణ విని ఆశ్చర్యపోయాడు. "చదువుకున్న అమ్మాయిలకు ఇంత మంచి అభిప్రాయాలు ఉంటాయా ?" అనుకొని ఎంతైనా చదువుకున్నమ్మాయిలను నమ్మలేంకదా ! ఏమైనా అంటే గట్టిగా వాదిస్తారు ఎంతవాళ్ళనైనా ! అని అనుకొన్నాడు మనస్సులో. ఎందుకో సంధ్యతో మాట్లాడుదామని బుద్ధిపుట్టింది. వెంటనే, సంధ్య—గదిలోకి వెళ్ళాడు, తన వింత ప్రవర్తనకి తనే ఆశ్చర్యపడుతూ. మంచంమీద పడుకొని ఆలోచిస్తున్న సంధ్య, అతని రాక గమనించలేదు. "సంధ్యా" అని పిలిచాడు శేఖర్. త్రుళ్ళిపడి లేచి, అతనిని చూసి, "మీరా ?" అంది నిలుచొని. "నిద్రపోలేదా ? కూర్చోండి ! అక్కయ్య క్రిందికి వెళ్లింది. పిలుస్తాను !" అని అతని జవాబుకోసమైనా ఎదురుచూడకుండా క్రిందికి వెళ్ళిపోయింది సంధ్య. తనంతట తానైఆమెతో మాట్లాడానికి వస్తే, ఆమె ఎంతో పొంగిపోతుందను కున్న శేఖర్, ఆమె వింతప్రవర్తన చూసి ఆశ్చర్య పోయాడు. ఆమెగురించి ఆలోచించసాగాడు శేఖర్. తాను ఎన్నిసార్లు ఇంటికి వచ్చినప్పుడు గాని, వదినతో మాట్లాడుతున్నప్పుడు గాని గుర్తులేదు తనకి ! ఈమె ప్రవర్తన ఎంతైనా వింతగా అనిపించింది వదిన ఎప్పుడో ఒకసారి చెప్పింది. "సంధ్యని స్నేహితు రాళ్ళు వస్తే, ఎవరూ పట్టలేరని, చాలా అల్లరిచేస్తుం దని అబ్బాయిలతోమాత్రం మాట్లాడదని, ఒక వేళ మాట్లాడినా చాలాజాగ్రత్తగా ఉంటుందని". ఎలాగైనా వింతగా ఉందని అనుకొన్నాడు శేఖర్.

సాయంకాలం అయిదుగంటలవరకు ఉండి శేఖర్, కాఫీ టిఫిన్‌లు తీసుకున్నాక హాస్టల్‌కి వెళ్ళిపోతానని లేచాడు. "పండగరోజుకూడా హాస్టల్ చదువూఅని గోలపెడతావేమిరా ? హాయిగా ఏ పిక్చర్‌కో వెళ్దాం ఉండు !" అన్నాడు సుదర్శనం.

ఆ రోజు పిక్చర్‌కి వెళ్ళక తప్పలేదు శేఖర్‌కి సంధ్యకికూడా రావడం ఇష్టంలేకపోయినా, వాళ్ళచే బ్రతిమాలించుకోవడం ఇష్టంలేక బయల్దేరింది సంధ్య చెప్పిన ప్రకారం హిందీ సినిమాకి వెళ్ళారు ఆ సినిమా ఏమిటంటే, అందులో ఒకమ్మాయి ఉంటుంది. ఆ అమ్మాయిని చదివించుకోవడ తండ్రికి ఇష్టంఉండదు. ఎందుకంటే చదువు కుంటే వృద్ధాప్యంలో తనను చూడదని భయం అఖరికి ఆ అమ్మాయి ఇంట్లోంచి వెళ్ళిపోయి, ఎలాగ చదువుకొని 'డాక్టరై' కొడుకుంచేత, ఇంట్లోనుం తరిమివేయబడిన ముసలి తండ్రిని ఆదరిస్తుంది ఇదీ కథ ! సంధ్యకి ఈ కథచాలా నచ్చింది. శేఖర్‌కూడ ఈ పిక్చర్‌కి వచ్చినందుకు చాలా సంతోషించి, ఇ నుంచైనా చదువుకున్న వాళ్ళమీద కాస్త, మం అభిప్రాయంపుట్టి చావదా ? అనుకొంది, మనస్సుల సంధ్య.

మరుసటిరోజు శేఖర్ హాస్టల్‌కి వెళ్ళిపోయాడు అప్పటికి పదిరోజులైంది, శేఖర్, వాళ్ళన్నయ ఇంటికివెళ్ళి; వెళ్ళాలని బయల్దేరాడు. త్రోవల స్నేహితుడు రామం కనిపించి వాళ్ళింటికి తీసుకెళ్ళాడు ఇద్దరూ గదిలో కూర్చుని కాఫీత్రాగుతూ మాట్లాడ తుండగా, రామం చెల్లెలు సునంద, ఇంకెవరో నవ్వు కుంటూ ప్రక్క గదిలోకి వచ్చారు. "అదిసరే గా సునందా! నా వ్యాసాలు రామం అన్నయ్య సరిచేశాడా పాపం అన్నయ్యని శ్రమపెడుతున్నా ! మా ఇం సంగతి నీకు తెలుసుకదా ! బావకి అసలు తీరిక ఉ డదు. ఇంకెవరున్నారు చెప్పు ?" అంది ఆ అమ్మాయి "ఫరవాలేదులే ! అంత ఎక్కువగా తప్పులు లేవట



## పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగామేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ లగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము, ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం). దుష్ట గ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

**Pt. Dev Dutt Shastri, Raj Jyothishi (W. P.) JULLUNDUR CITY**



## ఆహార లోటువల్ల మీరు నీరసించిపోతున్నారా?



## ఆల్‌బో-సాంగ్ సేవించండి

దివ్యమైనది మరియు
సామాన్య పోషక ఆహారమును పొదుపుగాను
వైజ్ఞానికంగాను బలపరచును.

టీ, కాఫీ, పాలు, గంజి, పళ్ల రసం మొదలైనవాటితో కలిపితే ప్రీతికైన రుచిగలది. ఆల్‌బో-సాంగ్, శిశువులకు, ఎదిగే పిల్లలకు, బంటి బిడ్డ తల్లులకు, మెదడునుపయోగించే పనివారికి, వృద్ధులకు, బలహీనతకు, రక్తహీనతకు మరియు రోగ విముక్తులై కోలుకుంటున్న వారికి. దివ్యమైనబలవర్ధక ఆహారము




**జె. అండ్ జె. డిషేన్**
హైదరాబాద్


# పాపం చదువుకొన్న అమ్మాయి

దిద్దేశాడు. ఈ రోజు కాలేజికి తీసుకువద్దామని మరచిపోయాను." అంది సునంద, ఆ కాగితాలు ఆ అమ్మాయికిస్తూ. ఇంతవరకు వాళ్ళ మాటలు వింటున్న రామం, శేఖర్‌తో, "మా చెల్లెలు ఫ్రెండ్ సంధ్య కాబోలు వచ్చింది! అన్నయ్యా! అంటూ ఎంతో ఆప్యాయతతో, కొంచెమైనా గర్వంలేకుండా మాట్లాడుతుందిరా?" అని చెప్పాడు శేఖర్.

"ఎవరోలే" అనుకొని, వెళదామని బయటకు వచ్చిన శేఖర్, అప్పుడే బయటికి వచ్చిన సంధ్యని చూసి ఆశ్చర్యపోయాడు. రామం చెప్పిన అమ్మాయి ఈ సంధ్యేనా? అనుకొన్నాడు. సంధ్య శేఖర్‌ని చూసి తెల్లబోయింది. పలుకరించ పోతే బావుండదని చిరునవ్వు నవ్వాడు శేఖర్. సమాధానమిచ్చింది సంధ్య. శేఖర్‌వంక చూసి, "నీకు తెలుసా! సంధ్యని?" అన్నాడు రామం. "తెలుసురా, మా వదిన చెల్లెలు. ఇప్పుడు నేను వెళ్తుంది అక్కడికే!" అన్నాడు శేఖర్. "అయితే సంధ్యని తెలుసని ఎప్పుడూ చెప్పలేదేమిరా? ఇద్దరూ కలిసి ఇంటికి వెళ్లండి ఏమమ్మా, సంధ్యా!" అన్నాడు రామం. ఏమనాలో అర్థంకాక తల వంచుకొని వింటున్న సంధ్య, "అలాగే అన్నయ్యా!" అంది.

మౌనంగా వెనుకనే తల వంచుకొని నడుస్తున్న సంధ్యని, ఒకటి రెండు సార్లు శేఖర్ చూసినా, సంధ్య మాత్రం అతనివంక చూడలేదు. సరళకి మూడు రోజులనుండి తీవ్రమైన జ్వరం. పాపం సంధ్య ఒకర్తే బావగారికి అన్ని పనులు చేసి, వంట చేసి, తన పనులను అతి చాకచక్యంగా చేస్తోంది. ఆమె చాకచక్యానికి సుదర్శనం ఎంతో ఆశ్చర్యపోయాడు. శేఖర్‌కి చాలా తీవ్రంగా జ్వరం ఉందని, శరీరంమీద తెలివి కూడా లేదని రామం వచ్చి సుదర్శనంతో చెప్పాడు. సరళకి కూడా జ్వరం. అలాంటి పరిస్థితిలో కూడా సంధ్య అంగీకారం తీసుకొని శేఖర్‌ని ఇంటికి తీసుకొచ్చాడు సుదర్శనం. కాలేజీ కూడా మానివేసి పిల్లిద్దరికి శక్తివంచన లేకుండా సేవ చేసింది సంధ్య. సరళకి వారం రోజులలో కొంచెం తగ్గినా శేఖర్‌కి మాత్రం తీవ్రత తగ్గలేదు. సంధ్య చాలా భయపడిపోయింది.

ఆరోజే కండ్లు విప్పి చూశాడు శేఖర్. ప్రక్కనే కూర్చున్న సుదర్శనం అన్నయ్యని, పండ్లరసం తీస్తున్న సంధ్యని నీరసంగా చూసి 'అన్నయ్యా' అన్నాడు నెమ్మదిగా! వెంటనే సంధ్య యిచ్చిన పండ్లరసం నెమ్మదిగా శేఖర్‌చేత త్రాగించాడు సుదర్శనం. నెమ్మదిగా పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు. సరళకి కూడా జ్వరమని తెలుసుకున్నాడు. సరళ లేచి తిరుగుతున్న రెండు రోజులకి శేఖర్ బాగా కోలుకున్నాడు. సంధ్య తనకీ, వదినకి చేసిన అపారమైన సేవను, రామం, సుదర్శనంల ద్వారా తెలుసుకున్నాడు. సరళ అక్కయ్య కాబట్టి ఇంత సేవ చేసినా అర్థం ఉంది కాని తనకు అంత సేవ ఒక చదువుకున్నమ్మాయి చేసిందంటే ఎంతో ఆశ్చర్యపోయాడు. తనే స్వయముగా వంట చేస్తుందని తెలుసుకొని "ఈ చదువుకున్న అమ్మాయిలకు వంట కూడా వచ్చా?"

అనుకొన్నాడు పాపం, ఈ చదువుకొన్న అబ్బాయి.

శేఖర్ ఆ రోజే హాస్టల్‌కి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకొన్నాడు. అందరూ కలిసి భోంచేస్తున్నారు. సంధ్య తనకు చేసిన సేవకు ముగ్ధుడై ఆమెకు మేలుచెయ్యదలుచుకొన్నాడు శేఖర్. సంధ్యవంక చూసి "మీరు రామంకి వ్యాసాలు ఇవ్వడం ఎందుకు ? నాకు ఇవ్వండి! దిద్దుతాను" అన్నాడు.

"నేను ఎప్పుడో చెప్పానురా ! ఈవిడగారు వద్దంది! ఇప్పుడేమంటుందో" అన్నాడు నవ్వుతూ సుదర్శనం.

"అలాగేనండి ! థాంక్స్ !" అంది సంధ్య శేఖర్ వంక చూసి. "మీరు ఎప్పుడూ వంట చెయ్యరు కదా ! ఇంత బాగా చేయడం ఎలా నేర్చుకున్నారు ?" అన్నాడు నవ్వుతూ, సంధ్యవంక చూసి శేఖర్.

"ఏమైనా శేఖర్, మా సంధ్యని చేసుకున్నవాడు, అదృష్టవంతుడయ్యా! సుఖపడతాడు. ఏమండీ ! నిజమేనా ?" అంది. నవ్వుతూ భర్తవంక చూసి సరళ

"ఎవరో సుఖపడటం ఎందుకు ? మా శేఖరే సంధ్యని చేసుకుని సుఖపడతాడు ! ఏం శేఖర్ ?" అన్నాడు సుదర్శనం. "అవునన్నయ్యా! మీ మాట ఎప్పుడు కాదన్నాను !" అన్నాడు నవ్వుతూ శేఖర్. "నిజంగానా! మావంగారు వాళ్ళు మారరనుకున్న నీ మనస్సు మారింది. మా సంధ్య చాలా అదృష్టవంతురాలు. చదువుకున్నమ్మాయిని పెండ్లి చేసుకోనన్న, నిన్ను మార్చేసింది మా సంధ్య." అంది ఆనందంతో సరళ.

"నేను చదువుకున్నమ్మాయిలను నా మనస్సులో ఎంత చెడ్డగా చిత్రించుకున్నానో, దానికి వ్యతిరేకంగా ఉంది సంధ్య ప్రవర్తన. నిజంగా ఈ కాలం చదువుకున్న అమ్మాయిలకు ఇంత మంచి అలవాట్లు, ఇంత ఓర్పు ఉన్నవనుకోలేదు. వదినా!" అన్నాడు నవ్వుతూ, సంధ్యవంక చూసి శేఖర్.

మరునటిరోజు సాయంకాలం సంధ్య కాలేజీ నుండి వచ్చి బట్టలైనా మార్చకుండా కూర్చుని ఏదో ఆలోచించసాగింది. ఆలోచనలో మునిగి తేలుతున్న చెల్లెల్ని చూసి, చిలిపిగా ముసిముసిగానవ్వుతూ కాఫీ పట్టుకువచ్చిన సరళ "ఏం సంధ్యా ! ఇప్పటినుంచే శేఖర్‌మీద ధ్యాస మొదలైనట్టుందే ?" అని వేళాకోళం చేసింది. అక్కయ్య గొంతు విని త్రుళ్ళిపడిన సంధ్య గాబరాగా "ఏమిటి అక్కయ్యా" అని అడిగింది.

"అదేనే ! ఆ మిగిలినది కాస్తా జరిపించేస్తే అసలు నీకు, మేము కనిపిస్తామా ? అయినా శేఖర్ సవాలి విన్నెందుకు ?" అనిన అక్క మాటలు వినగానే సంధ్య మొహం రంగులు మారింది. "అక్కయ్యా ! ఏమిటే అనవసరం మాటలు. నేను శేఖర్‌ను పెండ్లి చేసుకోను !" అంది సంధ్య.

"అరే ! ఎంత కోపం వచ్చిందే ? ఆ అలుకేదో మీ కాబోయే వారి దగ్గర చూపించు, మాదగ్గరెందుకు ?" అనే మాటలకు "అక్కయ్యా ! నేను సీరియస్‌గా చెపుతున్నాను. ఆ శేఖర్‌ను నేను పెండ్లి చేసుకోబోవటం లేదు" అనే గర్జింపు విని తెల్లబోయింది సరళ.

"నిజమే అక్కయ్యా ! ఆడపిల్లలంటే మంచి అభిప్రాయంలేని శేఖర్ని చేసుకుని నే నేం బావుకుంటాను ? అసలు అతని అభిప్రాయాలూ, నా అభిప్రాయాలూ కలవ్వు ! ఈ పెళ్లి అసంభవం !"

"అదేమిటే సంధ్యా ? నిన్ననేగా పాపం శేఖర్, నిజంగా తనకు ఇంతకాలం, ఆడపిల్లలంటే వేరొక భావం ఉండేదని, దాన్ని నీవు పూర్తిగా మార్చేశావని చెప్పింది. పూర్తిగా మారిపోయాడుగా ! ఇక నీ కేం అభ్యంతరం?" అంది సరళ.

"లేదక్కా ! ఆలోచించుకొనే ఈ నిర్ణయానికి వచ్చాను. ఆరు నెలల నా ప్రవర్తనకు, మాటలకు పొంగిపోయి, తనకు చిన్నతనం నుండి కలిగిన భావాలను, అభిప్రాయములను, ఒక్క రోజులో మార్చేసుకున్నాడు శేఖర్. అలాగే ఇకముందు కూడా ఈ అభిప్రాయం నిలకడగా ఉంటుందని గ్యారంటీ ఏమిటి? రేపు ఇంకొకరిని చూస్తే, ఇంకొక అభిప్రాయం కలుగవచ్చుకదా ! ఇలాంటి మనస్సు నిలకడలేని వాళ్ళని చేసుకోవటం నాకు ఈ జన్మలో ఇష్టంలేదు." అంది సంధ్య.

"పాపం శేఖర్ నీమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. నీవు పూర్తిగా తనని ప్రేమిస్తున్నావని పొంగిపోతున్నాడు. అతనికి ఎంత బాధ కలుగుతుందో ఆలోచించు" అని అభ్యర్థించింది సరళ.

"లేదక్కయ్యా ! ఆ అనుభవించేదేదో అతన్నే అనుభవించనీ! 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు లేనిదే జీవించలేను' అని నే నెప్పుడైనా అతని దగ్గర దేబిరించేనా ? ఈ పొరపాటంతా అతనిదే ! అనుభవించాలి ! అయినా, ఎవరైనా జాలి వలనో లేక మానవ కర్తవ్యం తీర్చుకోవటానికో సేవ చేసినా, లేక మాట్లాడినా, ఆ అమ్మాయిలు తమని ప్రేమిస్తున్నారని, తమని హృదయాల్లో పూజిస్తారని అనుకోవటం ఈ చదువుకున్న అబ్బాయిల్లో ఒక అంటు జబ్బు అయిపోయింది" అని విసురుగా మేడమీదికి వెళ్ళిపోయింది సంధ్య.

సాయంకాలం సంధ్యా, తను కలసి బీచ్‌కి వెళ్ళి, అక్కడ సంధ్యకు ఒక మంచి ప్రెజెంట్ ఇచ్చి ఆశ్చర్యపరచాలని ఆశగా ఇంట్లోకి వస్తున్న శేఖర్, సంధ్య ఆఖరి మాటలు విని నీరైపోయాడు. "నిజమే, తను పొరపడ్డాడు. జ్వరంలో తనకి సేవ చేసిందంటే అది జాలి వలనే ! ఆమె ప్రవర్తనను చూసి ప్రేమించిం దనుకోవటం తన భ్రమ.' అని నిరాశగా వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతున్న శేఖర్‌ని చూసి సరళ బాధపడుతూ ఇంట్లో కెళ్ళిపోయింది. మేడమీద కిటికీలో నుండి వెళ్ళిపోతున్న శేఖర్ని చూసి సంధ్య, "అయ్యో! పాపం! చదువుకున్నబ్బాయి" అనుకొంది ★

---

"నీకోసమే! నిన్ను అభినందిస్తున్నారు!" అన్నాడు మాంకియవిట్జ్.

లిజ్ ఒక్క పరుగు తీసింది. తన డ్రెసింగ్ రూమ్‌కి. లోపలికిపోయి, తలుపుతాళం వేసేసుకుంది. అరగంటతర్వాత బయటికి వచ్చినప్పుడు ఆమె ముఖంమీద ఏడ్చిన గుర్తులు కనిపించాయి.

"కన్నీరు ఆగలేదు" అన్నది

వ్యక్తిగత జీవితం ఎలా ఉన్నా, సెట్‌టమీద లిజ్ ధ్యాసంతా ఆమె వృత్తిమీదనే! చాలా గంభీరంగా ఉంటుంది. ఎప్పుడోకాని, చిలిపితనం ప్రకటించదు.

ఒక సీనులో క్లియోపాత్రాని సీజర్ దగ్గరకి ఒక తివాసీలోచుట్టి తీసుకువస్తారు. సీజర్‌ముందు తివాసీ పరవగానే లిజ్ లేచికూర్చుని, "ప్రయాణం చేస్తే ఇలాగే చెయ్యాలి" అంది— అందరూ విరగబడి నవ్వారు. అయితే ఈ హాస్యధోరణి ఎప్పుడో కాని కనిపించదు.

లిజ్ పుట్టిన వూరు లండన్ తమాషాకి ఎప్పుడయినా ఆమె తన చిన్నప్పుడు పెరిగిన వాతావరణంలో వాడుకలోఉన్న 'యాస'తో మాట్లాడేది. అందరూ నవ్వుకునేవారు

'టెంపర్ ప్రణాళిక' కారకురాలు కూడా లిజ్ టేలర్.

## రెండు రూపాల మనిషి

18—వ పేజీ తరువాయి

సినిమా తీస్తున్నకొద్దీ 'స్క్రిప్ట్' మార్చవలసి వచ్చింది. పాపం, ఈ పని కూడా డయిరెక్టర్ మాంకియవిట్ జే చేసేవాడు. రాత్రి పన్నెండుదాకా కూర్చుని పని చేసుకునేవాడు. అయినా ఆలస్యం అయి ఆదివారాలు కూడా పనిచేసేవాడు.

"ప్రతిరోజూ ఒక గంట ఎక్కువ పనిచేద్దాం. ఆవిధంగా మీకు ఆదివారం పనిజేసే అవసరం ఉండదు' అన్నది లిజ్ అతనితో.

వెంటనే వప్పుకున్నాడు.

అంటే లిజ్, సెట్సుమీద రోజుకి పదమూడు గంటలుపనిచేసేదన్నమాట!

కొంతకాలంక్రితం లిజ్ గొంతుక ఆపరేషన్ చెయ్యవలసి వచ్చింది. దాన్ని చిహ్నంగా కంఠంమీద ఒక పొడుగు గీతవంటి మచ్చ మిగిలిపోయింది. కాని, మేకప్‌లో దీనిని కప్పెసేవారుకాదు. శుభ్రంగా కనిపించేది

"కొన్ని సమయాలలో మచ్చ చిటపటలాడుతుంది. మీద మేకప్‌ఉంటే ఇంకా చిటపటలాడుతుంది. డయిరెక్టర్‌గారితో చెప్తే ఫరవాలేదు, అలాగే ఉంచమన్నారు. ఆ గీతపట్టయినా ఇది నేను వేసిన 'క్లియోపాత్రా' అని గుర్తు పట్టగలుగుతారని చెప్పాడు" అన్నది లిజ్ నవ్వుతూ

సెట్సుమీధ లిజ్ ముభావంగా ఉంటుంది. కాని, ఎవరి మనసూ నొప్పించేట్లు ప్రవర్తించదు.

"ఆమెనుచూస్తే ఎవరికీ అయిష్టంలేదు. అయితే, ఇష్టమూలేదు" అన్నా డొక స్టూడియో అధికారి. "మనిషిలో స్వార్థం కనిపించదు. క్లోజప్‌లన్నీ తనకే ఇవ్వాలనదు.

"అందరితోనూ పూర్తిగా సహకరిస్తుంది. డయిరెక్టర్‌తో పోట్లాడటంకాని, అలగటంకాని ఉండదు. డయిరెక్టర్ ఎంత చెప్తే అంత"

లిజ్ బర్‌టన్‌లమధ్య ప్రణయం జన్మించటం అనివార్యమేమో! ఒకసారి అతనే అన్నాడుట· "ఆ కళ్ళతో అలా చూస్తూఉంటే రక్తం పొంగకేం చేస్తుంది?"

"మామూలు కబుర్లు చెప్పినా కవిత్వంలాగే ఉంటుంది" అన్నది లిజ్ అతన్ని గురించి

ఇదంతా ప్రొడ్యూసర్లు ఘటించిన ఏకార్లే అయిఉండవచ్చు. కాని, ఫిడ్ లక్కడ లేకపోవటం, బర్‌టన్ భార్య న్యాయాన్నికి ఎవరినో చూడటానికి

మనోహరమైన మధురసువాసనలు వెదజల్లు



బైకో ప్రాడక్ట్సువారి సెంట్లు
ఆనందమును, ఉల్లాసమును కలిగించును.
• మనోరంజితం. • గంధరాజ్, జాస్మిను.
• ఫాన్సీబకెట్. • రోజ్, లెవెండరు.
మట్టుపల్లి గోపాలకృష్ణమూర్తి, బి.కాం.;
మాన్యుఫాక్చరర్సు రిప్రజెంటెటివ్సు, గుంటూరు-1.

కాల్గేట్ టూత్ బ్రష్
మీ దంతములను ఎక్కువ
శుభ్రపరుచునట్లుగా శక్తివంతముగా
తయారైనది!
సైజులు: ★ పెద్దలకు ★ చిన్నవారికి ★ పిల్లలకు ★ పసిపిల్లలకు
★ గట్టివి ★ ఓమాదిరివి ★ మెత్తనివి
అంతేగాక డీలక్స్ ఆరోగ్యదాయకమైన
ప్లాస్టిక్ పెట్టెలోగూడా లభించును.
శాశ్వతమైన శుద్ధిచేసిన నైలాన్ కుచ్చుల వలన ఇది బాగా మన్నుతుంది!




TB/G/13 T

తల పోటు?
పూర్తిగా విముక్తి పొందండి
'ఆస్ప్రో'
తీసుకొనండి
నొప్పులు బాధలు. తలనొప్పి, పంటిసలుపు, ఋతుస్రావ నొప్పులు. జలుబు, ఫ్లూ, జ్వరం, గొంతునొప్పి. మొదలైన వాటినుంచి పూర్తిగా నివారణ పొందండి.
తిరిగి నిజముగా స్వస్థత పొందండి
నికొలాస్‌వారి N తయారు నాణ్యతకు మరియు శుద్ధతకు పూర్తి గ్యారంటీ కలదు
AG. 139 TEL


వెళ్ళిపోవటం ఈ పుకార్లను బలపరచాయి.

ఒక స్టూడియో అధికారి, "లిజ్ ఒంటరితనం భరించలేదు. ఎడీ లేకపోయేసరికి బర్టన్‌మీద ఆధారపడటం మొదలుపెట్టింది. కేవలం షూటింగ్ కోసమే అయినా, లిజ్ బర్టన్‌లవంటివారు అస్తమానం ఒకరినొకరు కావలించుకుంటూఉంటే స్నేహం బలపడక, ఏమి చేస్తుంది" అన్నాడు.

మైక్‌టాడ్ ఎప్పుడూ ఉత్సాహంతో పొంగిపోతూ ఉండేవాడు బర్టన్ కూడా అంతే. అందుకనే లిజ్‌కి అతనిమీద అభిమానం. ఇద్దరూ నిశితమయిన హాస్య ధోరణికలవారే, ఇద్దరూ స్త్రీల మీద అధికారం చెలాయించే రకమే.

టాడ్ పెద్ద అందగాడుకాదు. అయినా మనుష్యులు నిండా ఉన్న గదిలో అతన్ని నుంచోపెడితే ఆ గదిలో (ప్రతి స్త్రీ) చూపులూ అతనిమీదనే ప్రసరించేవి. బర్టన్ అయినా అంతే.

ఇక ఎడీఫిషర్ సంగతంటారా, మనిషి మంచివాడే, మర్యాదస్తుడే. కాని సాధారణమయినవాడు. లిజ్ మీద అధికారం చెలాయించేవాడనిపించదు. లిజ్‌కి ఇది ఇష్టం.

లిజ్ 'క్లియోపాత్రా' ముగిసేసరికి 1,000,000 డాలర్లకుపైగా 'ఎడ్వాన్సు పుచ్చుకుంది. (కలెక్షన్‌లలో వాటా వేరే ఉంది) అంతేకాక, దుస్తులలో అరవై గవున్‌లు ఉచితంగా ఇచ్చారు.

"అందులో ఒకటి 22 కారట్‌ల బంగారుతో చేశారు. అమూల్యమయినది. నాకిచ్చెయ్యమని అడిగాను. వెంటనే వప్పుకున్నారు."

"మిగతా గవున్‌లన్నీ కొత్త ఫేషన్‌లకు దారితీస్తాయి చూడండి!" అంది లిజ్.

పైన చెప్పినవి 'జమవైపు. ఇక ఖర్చువైపు'; భగ్నమయిన వివాహం ఒకటి, కోల్పోయిన పరువు, అస్వస్థత. అయినా బర్టన్‌తో మరొక చిత్రంలో వేస్తోంది. ఆమె జీవితమంతా ప్రమాదాలకూ అనారోగ్యానికీ గురిఅయింది. నేడు ఆమె పరిస్థితి ఏమీ సంతృప్తికరంగాలేదు.

ఒక వైద్యుడు చెప్పాడు: "ఒక రెండేళ్ళు విశ్రాంతి తీసుకుంటేచాలు, అన్నీ సరిపడతాయి"

లిజ్ మాత్రం అతని సలహా పాటించేట్లులేదు.

ఆర్థికంగా ఆమెకి ఏ ఇబ్బందీలేదు. హాలీవుడ్‌లో ఆమెను మించిన ఐశ్వర్యంకల నటిలేదు. ఒకరెండు సంవత్సరాలు మానివేసినా నష్టమేమీ ఉండదు. అదీకాక, తనపిల్లలకి దగ్గరగా ఉండవచ్చు— తనకి చాలా ఇష్టం అంటుంది.

లిజ్ పెద్దతార. కాని, తారఅయినందుకు పెద్ద శిక్షలే అనుభవించింది.

సినెసిట్టీ స్టూడియో (రోమ్)లో పనిచేసే వందలమంది 'ఎక్‌స్ట్రాల'లో ఇద్దరితో మాట్లాడాను.

వారిలో ఒకపురుషుడు అన్నాడు: "మిస్ టేలర్‌ను చూస్తే ఎప్పుడూ బాధపడుతున్నట్లు కనిపిస్తుంది"

మరొకరు— ఒకయువతి అన్నది : "ప్రపంచంలో ఉన్న డబ్బంతా ఇచ్చినా, ఆమెస్థానం నాకక్కర్లేదు ! నేను చూసిన స్త్రీ లందరిలోనూ విషాదంలో మునిగి ఉన్నామె లిజ్ టేలరే !"

**రాబిన్ లెగాట్.**

# దొంగ

12—వ పేజీ తరువాయి

అరిచాడు చలమయ్యగారు. ఆయన శరీరమంతా చెమటలు కారుతున్నాయి. తాటిచెట్టు చాటున పడుకునిఉన్న ఆకారాన్ని లేపి, నుంచోబెట్టారు. గుబురుగా పెరిగిన గడ్డం; ఎర్రటి కళ్లు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. వాళ్లల్లో కండలు తిరిగిన మనిషి ఒకడు ముందుకు వచ్చి "ఎడా పెడా" వాయించి "ఏదీ! తియ్యి!" అని అరిచాడు.

ఆ మనిషి మాట్లాడే స్థితిలో లేడు; నుంచునే స్థితిలో లేడు. తూలిపోతున్నాడు. "ఏదీ సంచి! వెదకండి. తన్నండి వెధవని!" అరిచాడు చలమయ్యగారు ఆదుర్దాగా. ఇంతలో అసలు సంగతి ఎత్తారు ఎవరో! "ఇందాక అరిచింది ఎవరు? ఏమి లాక్కున్నాడు వీడు!" అన్నారు ఎవరో.

"నేనేనయ్యా! గొంతు పోల్చుకోలేదూ? అసలు సంగతిది. వినండి: నేనూ, ఇంకో పెద్దమనిషి కలిసి పట్నం నుంచి నడిచి వస్తున్నాము. పాపం ఆయన దగ్గర కూడా కొంత సొమ్మంది. నా దగ్గరా ఓ నాలుగువేల దాకా ఉంది. అది రంగయ్య వడ్లు అమ్మిన డబ్బు. ఇద్దరమూ కలిసి ఆమాటా ఈమాటా అనుకుంటూ వస్తున్నాము. ఇంతలో ఈ తోపులోంచి వీడు పెద్ద కర్ర "టక టక" మని కొట్టుకుంటూ మా వైపుకి వస్తున్నాడు. పాపం! ఆయన చాల బలహీన మయిన వాడు ....."

"నువ్వెప్పుడూ ఇంతేనయ్యా! అర్ధాంతరపు పనులు చేస్తావు. రొక్కం చేతిలో ఉంది కదా! తొందరగా పని తెముల్చుకొని రాకూడదూ!" అన్నాడు రంగయ్య; పైకం ఉందో లేదో నన్న ఆదుర్దాతో. "నా ఖర్మ! ఏం చెయ్యను. ఆ మిల్లు వాళ్లు కూర్చోబెట్టి కూర్చోబెట్టి ఇప్పుడు తగ లడ్డారు. రోజూ వాళ్ల కిదో అలవాటయిపోయింది" ఉస్సురన్నాడు చలమయ్య. "ఊఁ తరవాత!" "ఏముంది! వీణ్ణి చూసేటప్పటికి ఆ పెద్దమనిషి బెంబేలు పడిపోయి కేకలు వేశాడు. నేనేమో అలా కూర్చుని వీణ్ణి కనిపెడుతున్నా; మళ్లీ ఎటన్నా పారిపోతాడేమోనని. అయితే ఈ గలభాలో నా సంచీ పడిపోయింది ఎక్కడో. వాడే తీసిఉంటాడు. బాగా వెదకండి." ఆయాసంగా అన్నాడు చలమయ్య.

నలుగురూ కలిసి ఆ మనిషిని కిందా మీదా వెది కారు. అతని నోరు కంపు కొడుతోంది జేబులో చిల్లరడబ్బులూ, బీడీకట్టా మినహాగా మరేం కన బడలేదు.

"ఇలా రండి. ఒకవేళ రోడ్డుమీద పడిపోయిం దేమో చూద్దాం!" అని చలమయ్యగారు రోడ్డు మీదికి దారితీశారు. టార్చిలైటు పెట్టి పావు గంట వెదకగా రోడ్డు ప్రక్కన సెట్టు చాటు మొదట్లో నల్లటి సంచీ కనిపించింది. "ఈ సంచీ వాది." సంతోషంతో అరచాడు చలమయ్యగారు. "దానిలో నాలుగువేలుండాలి. చూడండి ఉందేమో! టార్చిలైటు పెట్టి వెధికారు. "ఏవో కాగితాల్లో చుట్టిన కట్ట ఉంది." అన్నాడు రాఘవులు. "ఉందా! అమ్మయ్య బ్రతికాం!" సంతోషంగా అన్నాడు చలమయ్య.

"ఇంతకీ ఆ పెద్దమనిషి ఏడీ? అతని సంచీ? అడిగా రెవరో. "ఏమో! భయపడి ఎటు పారి పోయాడో? అతని సంచీ, సైకిలు కూడా ఇక్కడే ఎక్కడో పడిఉంటుంది వెదకండి." అన్నాడు చలమయ్య. "అతని పేరేమిటి? ఇక్క డెక్కడయినా ఉన్నాడేమో కేకేద్దాం" అన్నా రెవరో. "అతనా? అతని పేరు రాఘవరావు. చాల మంచివాడు పాపం!" జాలిగా నిట్టూర్చాడు చలమయ్య.

నలుగురూ నాలుగు వైపులకూ వెళ్లి, బిగ్గ రగా కేక వేశారు. "రాఘవరావూ!" అని. ఏమీ ఫలితం లేకపోయింది. అతని సంచీకోసం ఇంకో పావుగంటసేపు వెదికాడు చలమయ్య. ఎక్కడా ఆ మనిషి గానీ, అతని సంచీ గానీ కనపడలేదు. "ఒకవేళ రోడ్డువెంట పరుగెడుతూ ఎక్కడయినా పడిపోయాడేమో" అన్నాడు చలమయ్య. ఇద్దరు మనుషులు వంతెన దగ్గరికి పరిగెత్తి సైకిలుషాపువాణ్ణి లేపి చెరో సైకిలూ తీసుకుని చెరో వైపుకూ వెళ్లారు.

మిగతా జనం దొంగని తీసుకుని ఊళ్లోకి వెళ్లారు తన్నుకుంటూ. ఆ దొంగ బాగా నటిస్తున్న ట్టుంది. నడవలేనట్టున్నాడు. "ఊఁ—ఆఁ" అనటం తప్పించి ఏమీ మాట్లాడలేనట్టున్నాడు. అంతా కచేరికి వెళ్లారు. దొంగని స్తంభానికి కట్టేశారు గట్టిగా.

*　　*　　*

పై సంఘటన జరగటానికి ఓ గంట క్రితం: పట్నం నించి అనేక పల్లెల పక్కగా మరో బస్తీకి పోయే ఆ రోడ్డుమీద భయం భయంగా, చకచకా అంగలు వేస్తున్నాడు చలమయ్యగారు. అతని చేతిలో ఖాకీ సంచి ఉంది. అందులో వెయ్యి రూపాయల పైచిల్లర ఉంది. చలమయ్యగారు కమీషను వ్యాపారస్థుడు. అంటే ఊళ్లో రైతుల వద్ద నుంచి ధాన్యం కొని, అవి మిల్లులకి ఎగుమతి చేసి బస్తాకి ఇంత చొప్పున మిల్లువారు ఇచ్చే కమీషను తీసుకుంటాడు. రైతులకి రావలసిన పైకం మొత్తం మిల్లు యజమానుల నుంచి తెచ్చి, రైతుల కిచ్చేస్తూ ఉంటాడు.

ఎన్నడూ లేనిది నేడు ఆయనకి గుబులు గుబులుగా ఉంది. ఈ మధ్యన ఈ రోడ్డుమీద దొంగ తనాలు ఎక్కువయ్యాయిట. కార్తీకమాసం కావ టంతో పనులు తక్కువయి తిండికి మార్గంలేక ఇలా ఎగబడుతున్నారుట అలగా జనం.

తన సంచీలో ఉన్నది ఇతర్ల సొమ్ము. ఆ మిల్లు వాళ్లు కూర్చోబెట్టి ఇప్పటికిగాని ఇచ్చారుగాదు. "రిక్షా" వాడిని కదిలిద్దామా అంటే రూపాయికి తక్కువకి రానంటాడు. అయినా మధ్యలో ఆపి, వాడే దబాయించి లాక్కుంటే వాణ్ణి మాత్రం చేసేదేముంది గనుక? ఈరోజులు ఎటువంటి వంటే ఎవర్నీ నమ్మటానికి వీలులేదు. చకచకా నడక సాగించాడు చలమయ్యగారు. గుండెలు బిగ బట్టుకొని ఒక ఎల్లె దాటాడు. ఇంకో రెండు పల్లెలు దాటితే తాటితోపు వస్తుంది. తాటితోపు జ్ఞాపకం వచ్చేసరికి చలమయ్యగారి గుండెలు బిగులు బిగులు మన్నాయి. ఆ ఒక్క గండం గడించిం దంటే తనకేం ఫరవాలేదు. ఇవాళ్టికి బయట పడ్డట్టే.

పల్లెలో దూరంగా దీపాలు మినుకు మినుకు మంటున్నాయి. ఊరు మాటుమణుగుతోంది. రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. ఎక్కడా అలి


ఒక ముఖ్యవార్త నవీన తయారి

పిక్‌నిక్ పాకెట్ రేడియో

ధర సగానికి తగ్గింపబడినది.

జపాను పాకెట్ రేడియో. సిగరెట్ కేసుకంటె చిన్నది. తేలికైనది. స్థానికంగా ప్రపంచంలో ప్రతిస్టేషను వినవచ్చును. ఇతర రేడియోలకంటే తక్కువఖర్చు. సులభముగా ఉంచు కొనుటకుఅనువైనది. అందమైనది. లైసెన్సుతో పాటు ఉప యోగమునకు సిద్ధముగా పంపబడును. 3 సం. గ్యారంటి. రిపేరు ఉచితం. ధర. రు. 27/— స్పెషల్ నెం. LR77 ధర రు. 32/—డీలక్స్ రకం నెం. GM 156 ధర. రు. 45—50. వి. పి. పి. చార్జీలు రు. 3—50 అధనం. తోలు కేసు ధర రు.5—50. ఇంగ్లీషులో వ్రాయవలెను



MADRAS TRADERS. (304R)
Post Box 1578, DELHI-6.



తెల్లమచ్చలకు

ఉచిత వైద్యము

అనేక సంవత్సరముల పరిశోధన ఫలితముగా కనిపెట్టబడిన "సోమరాజి" ఆయుర్వేద ఔషధము తెల్లమచ్చలను నివారించును. ఒక చిన్న సీసామందు ఉచితముగా పంపబడును. ఇంగ్లీషులో వ్రాయండి.

Bharat Chikitsa Kendra(B)
P. O. Lal Bigha (Gaya)



వైబ్రో

గర్భాశయ రోగ నివారిణి

సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యమగు సంతాన మును కలుగ జేయును. అన్నిచోట్ల దొరకును.

కృష్ణా లేబరేటరీ బెజవాడ

# వ్యాస రచన పోటీ

## మొదటి బహుమతి: రు. 100
## రెండవ బహుమతి: రు. 75
## మూడవ బహుమతి: రు. 50

**మనదేశం** మొత్తంమీద, ప్రజలందరికీ అందుబాటులోవుండి వినోదాన్ని కలిగించే సాధనాల్లో సినిమా ముఖ్యమైందనే చెప్పాలి. అంతేకాక సినిమా జాతీయ సమైక్యతకు మంచి సాధనమనికూడా చాలామంది అంటున్నారు. హిందీ తదితరమైన ఉత్తరభాషా చిత్రాలు దక్షిణ భారతదేశంలో ప్రదర్శించడం, ప్రదర్శించే చిత్రాలసంఖ్యా, రోజు రోజుకూ ఎక్కువౌతున్నది. చిత్రాల్లో సంగీతంకూడా ఇప్పుడు అన్ని భాషా చిత్రాల్లోను ఒకేరీతిగా, ఒకేస్థాయిలో ఉన్నట్లు కన్పిస్తున్నది. ఒకవిధంగా చిత్రాలు జాతీయ సమైక్యతకు దారితీస్తున్నవని చెప్పవచ్చు.

మరి కొంతమంది, కొన్నిసినిమాలు దేశంలోని వర్గవర్ణ వైషమ్యాలు తదితరమైన అవాంఛనీయమైన విషయాలను రెచ్చగొట్టి, విచ్ఛిన్నకరశక్తులుగా మారిపోతున్నవని అంటున్నారు.

పై రెండు అభిప్రాయాలలోఏది వాస్తవం అన్న విషయంపై పాఠకుల అభిప్రాయాలు తెలుసుకునే ఉద్దేశ్యంతో ఈ పోటీ నడుపుతున్నాము.

తమ అభిప్రాయాలను వ్యాసరూపంలో పొందుపరుస్తూ 28–2–63 లోపుగా మా కార్యాలయానికి అంద జేయవలసిందిగా పోటీలో పాల్గొనే వారిని కోరుతున్నాము.



● వ్యాసాలు 5 అరఠావు పేజీలకుమించి ఉండరాదు. ● కాగితం ఒకవైపుననే రాయాలి. ● కవరుపైన 'సినిమా వ్యాసరచన పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి. ● తుదినిర్ణయం సంపాదకునిదే. దీనిపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. ● త్రిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్ళలు అంటించిన కవర్లు జతపరచి పంపాలి. ● బహుమతి పొందిన వ్యాసాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది సంచికలో ప్రచురిస్తాము.

# దొంగ

కిడి లేదు. రోడ్డు ప్రక్కన కాలవగట్టున చెట్లు దయ్యాల్లా నిలబడి ఉన్నాయి చీకట్లో.

"చలమయ్యగారు చకచకా అడుగు వేస్తున్నారు. ఇంకో పల్లె దాటారు ఆయన. ఏదో ఆలోచిస్తూ నడుస్తున్న చలమయ్యగారు ఓ అరఫర్లాంగు దూరంలో తెల్లగా ఏదో చూసి గతుక్కుమన్నారు. కొంపదీసి దయ్యం కాదుకద ! చలమయ్యగారికి దయ్యాలంటే నమ్మకంలేదు. అందుకనే మొండి ధైర్యంతో నడిచాడు.

"ఎవరది ?" అటువయిపు నుంచి వినిపించింది. "నేను చలమయ్యని. మాది పాలెం. మీ రెవరు ?" అన్నాడు చలమయ్య. "నాపేరు రాఘవరావు. మాది బస్తీ. కలప వ్యాపారం చేస్తుంటాను. ప్రక్క పల్లెలో కొంత పైకం రావల్సి ఉంటే అది వసూలు చేసుకుని వస్తూంటే వెనక టైరులో గాలి పోయింది; రాత్రిపూట. అడవిలో చిక్కు పడ్డాను. ఎలారా భగవంతుడా అనుకుంటూ బిక్కు బిక్కు మంటూ ఉన్నాను. ఇంతలో దేవుడులా మీరు వచ్చారు." అన్నాడు రాఘవరావు. చలమయ్యగారు సంతోషంగా నవ్వారు, "దానికేమి లెండి. ఒకరి కొకరు తోడు. మా ఊరు దగ్గర సైకిలు దుకాణం ఉంది. గాలి కొట్టుకుని వెళ్ల వచ్చు. ఇక్కడికి ఇంకా ఐదు మైళ్ళు ఉంటుంది. లేకపోతే ఈ రాత్రికి మా ఊళ్లో ఉండి ...." "లేదండీ. పైకం చేతిలో ఉంది. అర్జంటుగా వెళ్ళాలి. సేటు వచ్చి కూర్చుంటాడు." అన్నాడు రాఘవరావు.

చలమయ్య రాఘవరావుని పరీక్షగా చూశాడు. వర్షం చినుకులకి నానిన ఇస్త్రీ బట్టలు చీకట్లో తెల్లగా మెరుస్తున్నాయి. మనిషి బెదురుగా ఉన్నాడు చేతికి వాచీ మెరుస్తోంది. నల్లరంగు సంచీ చేతికి మెలిపెట్టి చుట్టగా పట్టుకున్నాడు. బహుశా అందులోనే పైకం ఉండి ఉండాలి. కుర్రవాడులా ఉన్నాడు. అప్పుడే వ్యాపారం చేస్తున్నాడు.

"పరేలెండి. అలాగే వెళ్దురుగాని. మీ కంపెనీ పేరేమిటి ?" అన్నాడు చలమయ్య. "మాదండీ! "మోడరన్ టింబర్స్" అని ఈమధ్యనే నలుగురం కలిసి రెండు లక్షలు పెట్టి పెట్టాము. బస్తీలో మీ రెప్పుడూ చూడలేదా ? ...." "లేదండీ ! మే మెప్పుడూ పట్నం వెళతాము దేనికైనా. దగ్గరకదా !" అన్నాడు చలమయ్య.

ఇద్దరూ కలిసి నడక సాగించారు.

నిశ్శబ్దాన్ని మింగేయడానికి ఇద్దరూ ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకున్నారు. కలప వ్యాపారం నుంచి కమీషను వ్యాపారం వరకూ, మార్కెట్టు 'అప్పా,' 'డౌనూ,' అదీ ఇదీ మాట్లాడుకున్నారు. అలా మాట్లాడుకుంటూ ఇద్దరూ మరో పల్లె దాటారు.

"తరువాత వచ్చేదేగా మీ పల్లె ?" అన్నాడు రాఘవరావు. "అవును ఇంకో మూడు మైళ్ళ నడిచామా, మా ఊరు వచ్చేస్తుంది.

"అయినా ఇంత రాత్రివేళ బస్తీ చేరాలంటే— ఎలా వెడతారండీ ? పైగా పైకం ఉందంటున్నారు ? అందులోనూ దొంగల భయాలూ ఎక్కువయినాయి ఈమధ్య ఈ రోడ్డుమీద" అన్నాడు చలమయ్య.

"అవునండీ. ఏం చేయను ? పరిస్థితి ఇలా తయారయింది ఈ రోజు. ఇవ్వవల్సిన ఆయన అక్కడా ఇక్కడా చూసి ఇప్పటికి తెమిల్చాడు. అక్కడ 'సేటు'కి పాతికవేలు యివ్వాలి. అతడు వచ్చి కూర్చుని ఉంటాడు. ఈయనకి నాలుగు వేలు సర్దేటప్పటికి ప్రళయమయిపోయింది. ఈ నాలుగువేలు గాక ఇంకో రెండు వేలు కలిపితే గాని పాతికవేలవదు. ఛీ ! ఛీ ఈ వ్యాపారమంత ఛండాలపు వ్యాపారం మరోటి లేదండి" అన్నాడు రాఘవరావు.

"అవును దశ ఎత్తుకుంటే ఆకాశానికి; లేక


ఆంధ్రసచిత్రవారపత్రిక

8-2-63

సంచికలో!

'రూపవిచిత్రం!'

ప్రముఖ ఫోటోగ్రాఫర్ రూప

ప్రత్యేక ఛాయాచిత్రం



ఐటెక్స్

బిందీ

కుంకుమ చాదు

అనేక ఆకర్షణీయ రంగులలో లభించును. శాస్త్రీయరీతిగా చేయబడిన సువాసనగల కుంకుమ తిలకం.



అరవింద్
లేబరేటరీస్
పి. బి. నెం. 1415,
మద్రాసు-17.

తెలంగాణా జిల్లాలకు, హైదరాబాద్ మినహా ఆంధ్రప్రదేశ్‌కు ఏజెంట్లు :—

ప్రగతి ఏజెన్సీస్, విజయవాడ-1.



పండిత
డి. గోపాలాచార్యులవారి

అరుణ

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యాలకు

ఆయుర్వేదాశ్రమం
ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు-17



శుక్లనష్టము, అత్యుష్ణము, ధాతుదౌర్బల్యము నరముల బలహీనత, శరీర కృశత్వము, దడ

వాజీప్రభ (బంగారు చేరినది)

హరించి వీర్యవృద్ధి గలిగించు రసాయనం.

సీసా రు. 5/— పోష్టు ఖర్చులు రు. 1-25అదనం.

మకరధ్వజతిల్ల (పై మర్దనకు)

అంగనరములు బలహీనత చెంది సన్నగిల్లినచో

సీసా రు 6/- స్పెషల్ రు. 10/-పోస్టేజి1-25.

చరకాశ్రమం ఫార్మశి (ఫోన్ 2240).

తాలూకాఫీసు ఎదుట—విజయవాడ—3.



డాక్టర్ వృత్తి చేయండి



విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్‌ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిస్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి

ప్రాస్పెక్టస్ ఉచితం. వెంటనే వ్రాయండి.

Indian Homoeopathic College,
(APW), JULLUNDUR CITY

## విషపు కోతగాయములు



## జామ్-బక్ తో త్వరితంగా మానును

కోతలు, పగుళ్లు, కీటక కాటులను. త్వరితంగా నివారించును . . . కాళ్ల వాపులు, వ్రణములు, కాలిన పుండ్లు, విషగాయములను దూధిగా మాన్పును . . . తం గట్టిని నిర్మూలించును. నీబాధ ఏదైననూ జామ్-బక్ వాడ వచ్చును. ఇది చర్మవ్యాధులకు నానావిధ మూలికా గొషధము. చీనా లో జంతు గ్రావ్వలు, మూలెల లేవని గ్యారంటీ చేయబడినది.

**Zam-Buk**

జామ్-బక్
మూలికా బామ్



అని మందుల వ్యాపారు లందరివద్దను దొరుకును.
పి.ఇ. ఫుల్ ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ తొంబాయి.

సోల్ ఏజంట్లు : జాడా & కంపెనీ,
తెక్కి, పైనప్పనాయక వీధి, మద్రాసు-1.



## మహా దవ కాశ ము

అభినందన పరంపరల నందుకొనుచున్న ఆధునిక సచిత్ర అభ్యుదయ నవల "అనాథల అగచాట్లు". రచన: కారంశెట్టి లక్ష్మీనారాయణ. ప్రతి 1 కి రు. 3/– పేజీలు 240. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు నడగండి. లేదా మాకు వ్రాయండి. మీకు పోస్టేజీ ఉచితం. ఈ నవలను చక్కగా సమీక్షించినవారికి రు 100 బహుమతి ఇవ్వబడును ఆలసించినవారికి ప్రతులు అందవు. ప్రతులకు : K. L. Narayana, సానిపాయ (PO) రాయచోటి తా॥ కడపజిల్లా.



## 20 రోజులకు మాత్రము



తగ్గింపు ధరలు. కాశ్మీర్ బ్యూటీ చేనేత చీరలు. ఒక్కొక్కటి ధర రు 7/50. 2 చీరలు రు 14. 3 చీరలు రు. 20. ఒకే తడవ 3 చీరలు కొనువారికి పోస్టేజి, ప్యాకింగు ఉచితం.

బహుమతులు :– 2 చీరలు కొనువారికి ఒక జత ఇయర్ టాప్స్. 3 చీరలు కొనువారికి ఒక బ్లవ్స్, ఒక జత ఇయర్ టాప్స్. మీ ఆర్డరును వెంటనే పంపండి. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

THE ROYAL STORES (APM)
Post Box No. 1774, Delhi-6.



ఫొటోలకు,

డాక్యుమెంటు కాపీలకు

కళ్ళజోళ్ళకు

ఫోన్ నెం. 799 ఇంటి నెం. 2299 గ్రామ్స్: "VEERFILMS"

## వీరన్న స్టుడియో

గవర్నరుపేట - విజయవాడ - 2





## ఉచితము ఉచితము

లైసెన్సు అక్కరలేదు. అమెరికన్ మోడల్ 6 షాట్ రిపీటెడ్ డయల్ దొంగలు, క్రూర మృగములు మొ॥ అన్నిటికి రక్షణ. పిక్‌నిక్, యాత్ర, డ్రామాలలో ఉపయోగించవచ్చును పెద్ద ధ్వనితో, ప్రకాశవంతమైన కాంతినిగలిగించి భయం కల్పించును. పిస్టలుతో 200 షాట్లు ఉచితము. ధర నెం. 555 రు. 6/– నెం. 666 రు. 8/– నెం. 777 రు. 11/- పోస్టేజి రు. 2/– అదనం. మేలురకం తోలుకేసు, బెల్టుతోసహా రు. 5 అదనపు షాట్లు 100 కి రు. 3/– ప్రత్యేక కానుక: ప్రతి పిస్టలుతో ఒక 50 షాట్ పిస్టలు, 50 షాట్లతో ఉచితముగా పంపబడును.




GARRICKS (INDIA) P.F, 2., Mamubhanja, Aligarh.


## దొంగ

పోతే పాతాళానికి. ఈ బిజినెస్సులే అంత" అన్నాడు చలమయ్య.

"కొత్తవాణ్ణి. పైగా ఈ రోడ్డున దొంగల భయం అంటున్నారు. ఎలాగా .... ? నేనీ రాత్రికి బస్సు తప్పక చేరాలి." భయపడ్డాడు రాఘవరావు.

"ఈ రోడ్డున దొంగతనాలు ఇప్పుడే కాదండి. నా చిన్నతనం నుంచి జరిగాయి. చాలా విచిత్రంగా జరిగాయి. చెప్పమంటారా ?" అన్నాడు చలమయ్య. రాఘవరావు మౌనం అంగీకారంగా భావించి చెప్పటం మొదలుపెట్టాడు చలమయ్య:

"నా చిన్నతనంలో ప్రొద్దుగూకిందంటే ఈ రోడ్డున నడవటానికి భయపడేవారు జనం. అప్పటికి మట్టిరోడ్డులెండి. ఎప్పుడయినా "బొమ్మ" చూడటానికి పట్నం బయలుదేరితే, పది బళ్ళు చేసుకుని గాని బయలుదేరేవారుకారు. ముందూ వెనకా మొగవాళ్ళు కూర్చున్న బళ్ళుండేవి. వెనక ఇద్దరూ 'ముందు' ఇద్దరూ నడుస్తుండేవాళ్ళు. అప్పటికీ ఏదో ఒకటి పోతూనే ఉండేది వాళ్ళ దుంపతెగ! ఏం దొంగలండీ వాళ్ళు-దొంగలంటే వాళ్ళనే చెప్పాలి. సైకిళ్ళమీద వచ్చి ఈలలువేసుకుంటూ తిరిగేవారు. క్షణంలో అంతా అయిపోయేది ప్లాను ప్రకారం."

"మనుష్యులు ఎలా ఉండేవాళ్ళో తెలుసా! ఒళ్ళంతా ఆముదం పూసుకుని మొహానికి మసి రాసుకుని, తలకి ఎర్రటి గుడ్డ చుట్టుకుని, తళతళలాడేది కత్తి ! అబ్బ! వాళ్ళని తలుచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది సుమండీ ! ఈ కాలంలో ఎక్కడండీ అటువంటి దొంగలు !"

"అన్నట్టు మరిచాను. ఒకసారేమయిందో తెలుసా? అప్పుడు నేను కొత్తగా కమీషను వ్యాపారంలో ప్రవేశించిన రోజులు. ఒకరాత్రి ఇలాగే వస్తున్నాను! అప్పుడు మొండిధైర్యం ఉండేదిలెండి. శరీరం మాత్రం! ఇప్పుడయితే జారిపోయాయి గాని, నా కండరాలు, వయసులో ఎలాతిరిగి ఉండే వనుకున్నారు...?"

"ఏం ? మాట్లాడటములేదు ? భయపడుతున్నారా ? ఊరికే పొద్దుపోతుందని అంతే. పోనీ ఆపమంటారా ?.... వద్దా! అయితే వినండి."

"అప్పుడేమయిందో తెలుసా! అదుగో చూశారా! తాటితోపు. అక్కడికి వచ్చాను ఈ టయిముకు సరిగ్గా ఇలాగే. జెమాజెట్టీల్లాంటి నలుగురు దొంగలు బాణాకర్రలతో దగ్గరికి వస్తున్నారు అప్పుడు నేనేం చేశాననుకున్నారు?

"వెనక్కితిరిగి పరిగెత్తారా ?" "ఛా ...ఛా! అంత పరిగెత్తలేనిది వాళ్ళేనా ? ఇల్లాగే (అని నాలుక కొరుక్కున్నాడు) అప్పుడూ రొక్కంఉంది నా దగ్గర. వాళ్ళ రాకని పసిగట్టి నేను ఆ డబ్బు సంచీని మెల్లిగా చెట్టు మొదట్లో విడిచి, వాళ్ళని చూడనట్టు నటిస్తూ మెల్లిగా నడవసాగాను. ఆ నలుగురూ నన్ను చుట్టుముట్టారు. నా జేబులు వెతికి చూశారు. కోపంవచ్చి వాళ్ళలో ఒకడు నన్ను చెంపమీద కొట్టాడు. అప్పుడు నాకు భలే కోపం వచ్చింది. నలుగుర్నీ చితక బాదుద్దా మనుకొన్నాను.

కాని అందువలన లాభం ఏమిటి ?.... మెదలకుండా ఊరుకున్నాను. ఎందుకు ? అందువలన నాలుగు తినటంతప్ప లాభంలేదు. నే నేం చేశాననుకున్నారు? అమాంతం ఓ పిచ్చికేకవేసి మొదలు నరికినచెట్టులా పడిపోయాను. వాళ్ళు కంగారుపడ్డారు నేను చచ్చిపోయానేమోనని. గబగబా పరిగెత్తి పారిపోయారు ఎవరైనా చూస్తారేమోనని. అప్పుడు నేను మెల్లిగా జారవిడిచిన నా సంచీ తీసుకుని చక్కా వచ్చేశాను. ఎలా ఉందంటారు ?" చలమయ్య గర్వంగా చూశాడు రాఘవరావువంక.

మాటల సందడిలో చలమయ్య గమనించలేదుగాని వాళ్ళిద్దరూ తాటితోపువద్దకు వచ్చారు. రాఘవరావు వణికిపోతున్నాడు ! ? ? చలమయ్య పట్టుకుని ఆపి వేలితో చూపించాడు. తాటితోపులో చెట్ల చాటున అగ్గిపుల్ల వెలిగి ఆరిపోయింది. "చూశారా ! దొంగలు ?" అన్నాడు రాఘవరావు. చలమయ్య ఎంత తమాయించుకున్నా ఒణుకు ఆగడంలేదు.

"ద్ .. ద్ దొంగలే...." కళ్ళు తేలేశాడు చలమయ్య. బురదలో కాళ్ళు ధబ్‌ధబ్ మని చప్పుడయింది. సందేహంలేదు. ఒకడు కాదు—ముగ్గురు ఇటే వస్తున్నారు. చలమయ్య రాఘవరావుని కావలించుకుని గజగజ వణికిపోయాడు.

"ఇదుగోండి నా సంచీ. రెండూ కలిపి తొందరగా దాయండి. వాళ్ళు వచ్చేస్తున్నారు." రాఘవరావు అన్నాడు. చలమయ్య వణుకుతూ రెండు సంచులూ కలిపి చెట్టుమొదట్లో గిరవాటు వేశాడు

"వాళ్ళు వచ్చేస్తున్నారు అయ్యబాబోయ్ ! చేతుల్లో కత్తులు చూడండి ! తళతళ మెరుస్తున్నాయ్ ! చూశారా ! ఇహ లాభంలేదు. పదండి పరుగెడుదాం ఈ చీకట్లో మనిద్దర్నీ ఖూనీచేస్తే దిక్కెవరు ?" రాఘవరావు అంటూండగానే చలమయ్య అతన్ని ఒదిలిపెట్టి కాలికొద్దీ పరుగెత్తాడు అలా నాలుగునిముషాలు పరుగెత్తాక, అతనికి తన సంచీ జ్ఞాపకంవచ్చింది. వెంటనే పిచ్చిగా అరిచాడు "దొంగలు ! దొంగలు రక్షించండి" అని.

తన వెనకాల ఏం జరిగినదీ అతనికి తెలియదు. అసలు దొంగలు తళతళ మెరిసే కత్తులతో తన వైపు వచ్చిందీ, లేనిదీ అతను చూడలేదు. అయితే ఒకటి. చీకట్లో తాటితోపులో వెలిగిన అగ్గిపుల్లను మాత్రం కళ్ళారా చూశాడు ఇంక సందేహంఎందుకు?.

ఇదీ అసలు జరిగిన సంగతి. కచ్చేరిలో దొంగని స్తంభానికి కట్టి నలుగురూ అడుగుతున్నారు. ఎవరి ఓపికకొద్దీ వాళ్ళు కొడుతున్నారు.

చలమయ్యకి ఈ సంగతి పట్టలేదు. తను అనుకున్నట్టుగానే ఆ హడావిడిలో అతను తన నల్లసంచీ ఒదిలిపెట్టి, తన కాకీసంచి పట్టుకెళ్ళాడు. అయితేఅతన్ని ఏమయినట్టు ? పారిపోతూ భయంకొద్దీ గుండెలు పగిలి ఉండొచ్చు. ఏ చెట్టుకో గుద్దుకుని తల పగిలి ఉండొచ్చు. లేక.... అది ఎవడికి కావాలి? అతని సంచీ ప్రస్తుతం తనది అయింది. తన సంచీలోని వెయ్యి రూపాయలు పోగా, నాలుగువేలలో నికరలాభం మూడువేలు. నల్లసంచీ ! అవును, అదే ! అందులో పెద్దనోట్లకట్ట ! ! !

లాంతరు వెలుతురులో చూశాడు చలమయ్య సంచీ తెరిచి. అవును నోట్లకట్టలే; అన్నీ పదిరూపాయల నోట్లు. అయినా ఉండబట్టలేక కట్టకి ఎన్నినోట్లో లెక్కబెట్టబోయాడు చలమయ్య. .. ! ! ? అంతే తెల్లమొహం వేశాడు. పైనమాత్రం రెండు మామూలు నోట్లు ఉంచి, మధ్యన అన్నీ తెల్లకాగితాలు పెట్టి చక్కగా కట్టారు. ఓ నిముషంసేపు అతని నవనాడులూ స్తంభించాయి. చలమయ్య అలాగే స్తంభానికి చేరగిలబడ్డాడు.

కాస్సేపటికి సైకిళ్ళమీద వెళ్ళినవాళ్ళు రొప్పుకుంటూ తిరిగివచ్చారు. బస్తీవైపుకి వెళ్ళినతనికి ఎవరూ కనబడలేదు. విచారించగా ఎవరూ ఆ దారిన వెళ్ళినట్టు చెప్పలేదు. పట్నంవైపు వెళ్ళిన సుబ్బారావు కధనం ఇది :

అతనికీ రోడ్డుమీద మనిషిగాని, సైకిలుగాని కనబడలేదు. పట్నం శివార్లలో టీ కొట్టతన్ని అడిగితే, ఈ వయిపునుంచి ఓ అరగంటక్రితం ఓ తెల్లబట్టల ఆసామీ సైకిలుమీద పట్నంలోకి వెళ్ళినట్టు చెప్పాడు. ఏ సందుకి వెళ్ళాడో, ఏ ఇంట్లో దూరాడో...." అని సుబ్బారావు చెబుతోంటే చలమయ్య ఆశ్చర్యపోయాడు. కోపంతో ఒణికాడు. నిస్సహాయుడై, అంతచలిలోనూ చమటలు క్రక్కాడు

స్తంభానికి కట్టేసిన దొంగకి దెబ్బలతో మైకం దిగిపోయింది అతనివద్దనుంచి రాబట్టిన సమాచారం ఇది. "అతనిపేరు సుబ్బడు. ప్రక్క ఊరువాస్తవ్యుడు. అతనికి తాగుడు అలవాటుఉంది. ప్రక్క ఊరికి వెళ్ళి త్రాగి వస్తూ, త్రోవలో స్మృతితప్పి పడిపోయాడు. కాస్సేపటికి లేచి అగ్గిపుల్ల వెలిగించి బీడీ ముట్టించుకున్నాడు. తరవాత అతనికీ ఏవో కేకలు వినపడ్డాయి. కాని మత్తులో అతను ఏమీ పట్టించుకోనలేదు. ఆ తరవాత కర్రలూ, లాంతర్లూ మనుషులూ...అంతకు మించి తనకేమీ తెలియదు."

"ఇంతకీ లెక్క సరిపోయిందా ?" రంగయ్య పరామర్శించాడు చలమయ్యని. చలమయ్య ఏమీ మాట్లాడలేదు. "భలేగా ఉందే. ఇంతకీ వాళ్ళ వ్యాపారం ఏమన్నావూ ? కలపవ్యాపారమా? బస్తీలోనా? అయితే మన రంగారావుకి తెలిసుండాలి. కంపెనీ పేరేమిటి ?" అన్నారు మునసబుగారు అప్పుడే ఆ విషయం తెలిసి.

"మోడరన్ టింబర్స్" అన్నాడు చలమయ్యగారు బరువుగా. "నేను నిన్నేగదా బస్తీనుంచి వచ్చింది. బస్తీలో అలాంటి "అడితి" ఎక్కడా పెట్టలేదు ఈ మధ్యన." అన్నాడు రంగారావు. ఉన్న చివరిఆశ కాస్తా ఉడిగిపోయింది చలమయ్యకి.

నిరాశగా "మోసం జరిగింది" అన్నాడు చలమయ్య ఆ మోసం ఏమిటో ఎవరికీ అర్థంకాలేదు.

దొంగని నిలదీసి గట్టిగా అడుగుతున్నారు. విపరీతంగా కొడుతున్నారు. అతను బాధ భరించలేక కూలిపోయాడు. "ఆగండి' అన్నాడు చలమయ్య. గబగబా వెళ్ళి అతని కాళ్ళకీ, చేతులకీ ఉన్న కట్లు విడదీశాడు. అతను చేసిన ఈ పనికి అందరూ ఆశ్చర్యపడిపోయారు. ★


నెలకు రు. 300 నుండి రు. 500 సంపాదించండి —300 జపానీస్ ఇండస్ట్రీస్ గైడ్
తీరిక సమయాలలో, తక్కువ పెట్టుబడితో పెన్సిల్, యింకు బిళ్ళలు, హేరాయిల్, క్రీములు, రబ్బర్ స్టాంపులు. రబ్బర్‌వస్తువులు, ప్లాస్టిక్‌వస్తువులు, సోపులు, కలములు వగైరా 300 పరిశ్రమలలో నేటినైనా ప్రారంభించుటకు సహాయపడు పూర్తి గైడ్. పరిశ్రమకు చెందిన సాంకేతిక మరియు యితర రహస్యములు గలవు. నెలకు రు. 300 నుండి రు. 500 వరకు సంపాదించుటకు ఉపకరించును. ధర రు. 11-50. వి. పి. పి. చార్జీలు రు. 2/- అదనం.
TAGORE VIGYAN MANDIR(A13)
Halka No. 13 - ALIGARH.



క్రమంతప్పక వాడండి
నీమ్ టూత్‌పేస్ట్
ఆధునిక టూత్ పేస్టులో వాడబడు అవసరమైన ఔషధము లన్నింటితో కలసి. వేపలోని శక్తివంతమైన భాగములన్నియు పొందియున్న ఒకే ఒక టూత్ పేస్ట్
Neem TOOTH PASTE CALCHEMICO
కలకత్తా కెమికల్ కలకత్తా-29
NTP 192 TE
దక్షిణ ఇండియా ఆఫీసు :
5/149. బ్రాడ్వే, మద్రాసు-1.

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగ, వ్రేళ్లు పొతుకుపోయి పాదము నేలపై పెట్టలేక రాళ్లు తగిలిన త్రుళ్లిపడువారు పైపూతగా వాడిన వ్రేళ్లతోసహా మాయంచేయగల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4–25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1–50
దాంపత్య రహస్యములు ... రు. 3–00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4–50
పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో
3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.



## తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని అరోజకాలోజ మృత్యువుకు ఆసన్నుని చేయును. ప్రథమదశలో శారీరక, మానసిక శ్రమలకు ఉపక్రమించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడలో తిమ్మిరి, నరముల బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు ఎండుట, దురదలు, కాళ్ళలో పగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పొట్లు, కీళ్ళ నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవించవచ్చును.

"సినస్ ఫారస్" మాత్రలు వాడి అనేక వేలమంది తమ బాధలనుండి నివారణపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి. "సినస్ ఫారస్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యూనాని వైద్యవిధానం ప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమారు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును. కొద్దిరోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "సినస్ ఫారస్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేక పథ్యములేదు. నిరాహారముతోమండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై ఇదివరకటికంటే ఎక్కువరకాల ఆహార పదార్థములు తీసికొనవచ్చును. వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళల ఖరీదు రు. 8–75 న.పై. మాత్రమే. ప్యాకింగ్ మరియు పోస్టేజి ఉచితం.

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
— (W. A. P.)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.




## రాజధాని కబుర్లు

9 వ పేజీ తిరువాయి

నుమాయిష్ అని టూకీగా అనేస్తారు. నలభై రోజులపాటు యీ ప్రదర్శన నిరాఘాటంగా జరిగిపోతూనే ఉంటుంది. అసలు ఉద్దేశం, పారిశ్రామిక చైతన్యం కలగజేయటానికి, సాంస్కృతిక సంబంధాలు యితర రాష్ట్రాలతో పెంపొందించుకోవటానికీను. కొంతమంది ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులు కలిసి 1938 సంవత్సరంలోనే వో చిన్న ప్రదర్శన ఏర్పాటు చేశారు. ప్రజలు చూపిన ఆదరాభిమానాలతో, ప్రతిఏటా ఈ ప్రదర్శన జరుపుకోవటానికి తగిన స్థాయి, స్వాతంత్ర్యత, అంగబలం, అర్థబలం క్రమేపీ సమకూరినాయి. ఇరుగు పొరుగు రాష్ట్రాల్నుంచి రకరకాల పారిశ్రామికులు యీ ప్రదర్శనలో పాల్గొంటారు. తమ రాష్ట్రాల్లో ఉత్పత్తి అయ్యే సామగ్రికి తగిన ప్రచారం లభించటం, తద్వారా, వాటియొక్క డిమాండ్ పెరగటం, ఇవన్నీ చినతరహా పరిశ్రమలకు తగినంత ప్రోత్సాహం ఇచ్చినట్టుగానే భావించాలసి ఉంటుంది. అట్లాగే మన రాష్ట్రంలో తయారయే వస్తువులకు కూడా, యితర రాష్ట్రాలలో తగినంత మార్కెట్టు లభిస్తుందనే సదుద్దేశంతోనే, కొంతమంది పారిశ్రామికులు ముందుకు వస్తున్నారు. బహుమానాలంటూ ఏర్పాటుచేసి, శాస్త్రీయ పారిశ్రామిక రంగాలలో నిర్మాణాత్మక కృషికి ప్రోత్సాహం కూడా యిస్తున్నారు. ఈనాటికి సుమారు 1200 'స్టాల్సు' దాకా ఉన్నాయి. అవే ఈ ప్రదర్శనపట్ల, వ్యాపారస్థులు, వర్తకులు, ప్రజానీకం, చూపిస్తున్న అభిమానానికి తార్కాణం అని చెప్పచ్చు. అయితే మన రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే వస్తువుల జాబితా, ఏటేటా యీ పరిశ్రమలకు లభిస్తున్న సహాయ సహకారాలు, వీరు చేస్తున్న కృషి ఒసారి పరిశీలిస్తే, ముందు ముందు చిన్నతరహా పరిశ్రమదారులకు సహాయకారిగానూ, దోహదకారిగానూ ఉండటానికి ఉపయోగపడుతుంది. ఈ ప్రదర్శన ఎంత సదుద్దేశంతో జరిపినా, కార్యనిర్వాహకులు అనుకుంటున్న, పారిశ్రామిక చైతన్యం, తగినంతగా మన రాష్ట్రంలో ఏర్పడలేదనే చెప్పాలసి వస్తుంది. దీనికి తగిన కారణాలేమిటో తెలుసుకుని, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడాలసిన బాధ్యత, కేవలం ఎగ్జిబిషన్ సొసైటీ మీదే కాక, ప్రభుత్వంవారిమీద, ఆంధ్రా ఛాంబర్ ఆఫ్ కామర్సు లాంటి సంస్థలమీదా ఉంది.

సామాన్య ప్రజానీకానికి మాత్రం, ఈ ప్రదర్శన కాలక్షేపానికి, ఎక్కువ డబ్బుతో తక్కువ వస్తువులు కొనుక్కోవటానికే ఉపయోగపడుతోంది. సాయంత్రంపూట వచ్చే పోయే జనాభా చూస్తూ, అలాగే పురవీధులనిండా కన్నార్పకుండా నిలబడే నిర్వ్యాపారులు నిరుద్యోగులు, యింకా ఇతర తరహా మనుష్యులు, ఈ ప్రదర్శన నిండా కొల్లలు కొల్లలుగా కనిపిస్తారు. పన్నెండు నయా పైసల టిక్కెట్టు కొని లోపలికి వెళితే, నాలుగైదు గంటలు, చిత్ర విచిత్రాలు కన్నుల పండువగా చూడచ్చు!

ఈ స్టాల్సుమీద వచ్చే ఆదాయం, టిక్కెట్ల ద్వారా వసూళ్ళయిన మొత్తం, ఖర్చులు పోను మిగతాది చాలవరకు సద్వినియోగం అవటం, చెప్పుకోతగ్గ విశేషం. గరల్స్ పాలీటెక్నిక్ కాలేజీ, వనితా మహా విద్యాలయ మొకటి, ఈ ఆదాయంతో ఏర్పాటయిన విద్యాసంస్థలు. ఆడపిల్లలకు టెక్నికల్ కాలేజంటూ హిందూదేశం మొత్తంమీద లేదు. ప్రప్రథమంగా యిలాంటిది స్థాపించే గౌరవం, యీ సొసైటీ వారికే దక్కింది. ఈ కాలేజీలో ఇంజనీరింగ్ కోర్సెస్ అన్నీ ఉన్నాయి. దీనికయ్యే ఖర్చులో కొంత భాగం, కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కూడా భరిస్తుంది. విద్యార్థినులకు జీతం కట్టాలనే బెడద లేదు. ఉచిత విద్యా విధానం ఈ కాలేజీలో ప్రవేశపెట్టబడింది. పైపెచ్చు కొంతమందికి స్టయిఫండ్ కూడా యిస్తున్నారు. ఈ కాలేజీలో సుమారు 300 లకు పైగా విద్యార్థినులున్నారంటే పారిశ్రామిక రంగంలో, మన రాష్ట్రంలో స్త్రీలు ఎంత ముందుకు వస్తున్నారో తెలుస్తోంది. సాధారణంగా యిలాంటి ప్రదర్శనలు దేశంలో ఎన్నోచోట్ల పెడుతూనే ఉంటారు. అయితే యిక్కడ ప్రత్యేకత, యేటేటా ఈ ప్రదర్శనలు జరపటం. ఈ పద్ధతి హిందూదేశం మొత్తం మీద ఎక్కడా కూడా లేదని చెప్పచ్చు.

అటు విద్యా సంస్థలకు ఆదాయాన్ని సమకూరుస్తూ, ఎంతోమంది ప్రజలకు ఆహ్లాదకరంగా ఉంటూ, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడాలనే అభిలాషతో ఏర్పాటయిన ఈ ప్రదర్శనపట్ల, ఈ ఏడాది కొంచెం వ్యతిరేక ప్రదర్శన కూడా జరిగింది. దేశమంతా అత్యవసర పరిస్థితుల్లో చిక్కుకుపోయి, కమ్యూనిస్టు చైనా దురాక్రమణ పట్ల తీవ్ర అధిక్షేపణ తెలియపరుస్తూ ఉన్న సమయంలో, ఇలాంటి వినోద కార్యక్రమాల్లో నిమగ్నులవటం ఎంతవరకు సమంజసం అనేదే ఈ విమర్శకుల ముఖ్య ఆక్షేపణ. నిజమే ఆమాట. అయితే ఎగ్జిబిషన్ సొసైటీవారు అయిదువేలు రూపాయల్ని జాతీయ రక్షణ నిధికి సమర్పించటమే కాకుండా రోజుకు 5 వందల రూపాయలు కూడా ఈ నలభై రోజులపాటు రక్షణ నిధికి సమర్పిస్తామని ప్రకటించి ఉన్నారు. ఇది హర్షించదగ్గ విషయమే! మిగతా రాష్ట్రాలలో యిలాంటి ప్రదర్శనలు రద్దుచేసినప్పటికీ, యీ రాష్ట్రం సంగతి వేరు. ఏటేటా జరుగుతున్న ప్రదర్శన. రెండో భాగంలో విద్యుచ్ఛక్తి కొరతగా ఉండగా యిలాంటి ప్రదర్శనను అనుమతించట మెందుకూ అనే ప్రశ్న. అయితే ఈ ప్రశ్నకు సరియైన సమాధానం ప్రభుత్వంవారు కాని, సొసైటీవారు కాని చెప్పలేకపోయారు. నూటికి ఇరవై అయిదు వంతులు విద్యుచ్ఛక్తి వాడకాన్ని ఈ ప్రదర్శన నిర్వాహకులు తగ్గిస్తామని చెప్పిన మాట వాస్తవమే కాని, అదెంతవరకు కార్యరూపంలో సాధ్యమవుతుం దనేదే ప్రశ్న. ఈ కొరత ఏర్పడటానికి కారణం కేంద్ర ప్రభుత్వానిదే అని మనం సర్దుకున్నా, అవస్థపడుతున్నది మనమేగా! దీనికి తక్షణం తీసుకోవలసిన చర్యలేమిటో ఆలోచించి కార్యరంగంలోకి దూకటం ఎంతైనా అవసరం.

ఐ. ఎల్. ఎన్. ☆

# పన్నీరు-కన్నీరు

8 వ పేజీ తరువాయి

పైగా ఐపీసు కుటుంబీకుడూ, ఎక్కువ జాగ్రత్త పడనివాడూ అవటంవల్ల సమయానికి సుబ్బారావు కష్టాలకి ఆదుకోలేకపోయాడు; ఏదో అడపా దడపా సాయంచేస్తూ వచ్చినామా. ఏదో వాళ్ల కడుపులూ వీళ్ల కడుపులూ పట్టుకుని ఒక కంపెనీలో గుమాస్తాగా వేయించారు. సుబ్బారావుకి మళ్లీ మకాం మార్చాల్సొచ్చింది.

జీతం నెలకు ఏభై రూపాయలు. అది పెళ్లాం బిడ్డలకి కడుపునిండా తిండికేనా పూర్తిగా సరిపోయేది కాదు. తన కొడుకు చురుకైనవాడు; పైకొస్తాడు చెప్పించగలిగితే. తన బ్రతుకిలాగా బండ లయింది. చదువు చిన్నప్పుడు శ్రద్ధగా చదువుకుంటే తన బ్రతుకు వేరుగా ఉండేదని ఇప్పు డనుకుని లాభమేమిటీ? ఏకష్టమైనా పడి, ఏ గడ్డయినా కరిచి వీణ్ణి పైకి తీసుకొస్తే తనకి అవసానకాలంలో చింత లేకుండా వెడుతుంది. ఇంతవరకూ జీవితం వ్యర్థమైనా ఈ ఒక్కటే నాపని కొచ్చే పని చెయ్యాలి.

మామగార్ని కదిపిచూశాడు. ఆయన "ఏం చెయ్యను నాయనా, నాకు మాత్రం నూరిగాడంటే ఏంతో ఇదిలేదూ. నేను వెన కింత ఉన్నవాణ్ణి కానని తెలుసునుగా. ఇప్పుడు నాలుగోదాని పెళ్లోటి చెయ్యాలిగదా. రిటైరైనవాడి కేం వరపతి చెప్పు" అన్నారు. తన బావగార్నీ చెల్లెల్నీ చూసి చాలరోజు లయిందని వాళ్లింటికి వెళ్లాడు. ఈమధ్యన చెల్లెలు ఎక్కువ రావడం మానేసింది. తనింటికి వచ్చినా ఏ మూడు నాలుగు రోజులో కంటె ఎక్కువ ఉండేదికాదు. బావగారు అసలే రావటం లేదు. వాళ్లందరికీ ఆవిడ పుట్టిల్లంటే చులకన. ఉన్నప్పుడు మరీ అంత పొంగి బోర్లపడ్డమా! అనే వారు. ఆవిడ మనసులో ఎంత బాధపడ్డా పైకి ఏమీ అనేదికాదు. సుబ్బారావు బావగార్ని అడగడానికి జంకుతూనే తప్పనిసరిగా అడిగాడు. కొడుకు జీవితం పాడయిపోతుందని, తెలివైనవాడు కనక చదువు చెప్పిస్తే పైకొస్తాడనీ, వచ్చి వాడే తీరుస్తాడనీ అన్నాడు. "నా దగ్గిర ఇప్పుడు డబ్బు లేదు. ఒక వేళ ఉన్నా నేను ఇలా ఇవ్వడాలు మానుకున్నాను. ఇదివరకు ఒకటి రెండు మాట్లు దెబ్బతిని ఉన్నాను" అన్నా డాయన.

సుబ్బారావు మానం చంపుకుని అడిగాడు మళ్లీ. "పోనీ ఎవరిదగ్గిరేనా ఇప్పించండి. ప్రస్తుతం కాలేజీలో జేర్పించేందుకైనా. నోటు రాసిస్తాను. ఎలాగోలాగా రెండేళ్లలో తీర్చుకుంటాను."

బావగారు నవ్వి "నీలాటివాడి నోటు నాలిగ్గీసుకోడానిక్కూడా పనికిరాదోయి. ఎవరిస్తారు నిన్ను నమ్మి డబ్బు."

"చురుకైన కుర్రాడు పాడైపోతాడని ప్రాధేయపడుతున్నాను!"

"ఏమిటి మహా అంటున్నావు. ఆమాత్రం తెలివైన పిల్లలు అందరికీ ఉన్నారు. ఏదో క్లాసులో నాలుగు మార్కు లెక్కువ రాగానే మీవాడు బృహస్పతి అనుకుంటున్నావే."

సుబ్బారావు ముఖంమీద గుద్దేసుకుని ఇంటి కొచ్చాడు. ఇంటి కొచ్చేటప్పటికి నరసింహంగారు రున్నా రక్కడ. ఆయన అడక్కుండానే పరిస్థితులు పసిగట్టాడు.

సూర్యానికి రాజమండ్రీ కాలేజీలో సీటు వచ్చింది. ఆ కాలేజీలో సీటు దొరకడమే అదృష్టమని అనుకునే రోజుల్లో. వరసింహంగారు సుబ్బారావుకి ధైర్యం చెప్పి సూర్యాన్ని తీసుకెళ్లి కాలేజీలో చేర్పించారు. నరసింహంగారి సహాయాన్ని వద్దనే ఏ అభిమానం ఆనాటికి మిగల్లేదు సుబ్బారావులో. రాజమండ్రి కాలేజీలో చదువుకునే కుర్రాళ్లలో నియ్యోగుల పిల్లలికి, లేనివాళ్లయితే ఒక సదుపాయ ముంది. ఒక స్కాలర్ షిప్ దొరికితే చదువు నిరపాయంగా సాగడానికి అవకాశం చిక్కినట్టే. ఎందుకంటే అక్కడ కాలేజీ జీతం కట్టడమే కాకుండా స్కాలర్‌షిప్ పిల్లలికి ఒక హాస్టలులో నివాసమిచ్చి ఉచితంగా భోజనం కూడా పెట్టేవారు. అయితే ఈ స్కాలర్‌షిప్‌కి కూడా మన సమాజంలో పేదలకోసం చేసే అనేక సదుపాయాల్లాగే రికమెండేషన్లూ, ఎరుగున్నవాళ్ల చేత చెప్పించడాలూ అవసరమయ్యాయి. ఎలాగైతేనేం వెనకటి రోజుల వైభవంలోంచి మిగిలిన కొద్ది పలుకుబడినీ ఉపయోగించి సూర్యానికి ఓ స్కాలర్‌షిప్పు సంపాయించాడు సుబ్బారావు.

## 14

## కాలేజీ

ఆనాటి ఆర్ట్సు కాలేజీ ఇంకా గోదావరి గట్టునే, కూర్ల్డ్రీహంటర్ వంటి ప్రిన్సిపాల్సు, అడవి

వాళ్ల నాన్న: మా అమ్మాయి బంగారం అనుకో.

వాళ్ళ బావ: అయితే రక్షణ నిధికి ఇచ్చేయమనగలదు మొరార్జీ గారు.

కృష్ణానంద్

కవికొండలా, దామెర్లా మొదలైన స్టూడెంట్సు తిరిగిన భవనాల్లోనే ఉండేది. పూర్వపు కట్టుబాట్లు కొంచెం సడలి రకరకాల వాళ్లకి ప్రవేశమిచ్చి కాలేజీని విస్తృతం చేస్తున్న రోజులవి. సూట్లేసుకు రావాలి, తలగుడ్డలు కావాలి అన్న నియమాలు సడలాయి. అయినా ఎవరేనా కొత్త వారు వస్తే "ఇది కళాశాల సుమా. ఇది జ్ఞాన దీపం జాగ్రత్త." అని అనిపించే ఒక వాతావరణం అక్కడుండేది. కాలేజీ లోపలికి వెళ్లడానికి కొంచెం బెరుగ్గానే ఉండేది. దొరలు ప్రిన్సిపాల్సుగానూ లెక్చరర్సుగానూ ఉండే కాలం వెళ్లిపోయి దాక్షిణాత్యులు నిండి ఉండేవారు స్టాఫ్‌రూమ్సులో. కాని, వాళ్లు కూడా కొంచెం సరసత, సమయజ్ఞత కలిగిన సరుకవడంతో కాలేజీ కెప్పుడూ ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఉండేది. ఊళ్లో ఉన్న ముగ్గురు ప్రముఖ వక్తల్లోనూ ఇద్దరు కాలేజీలో చాలాకాలంగా లెక్చరర్సుగా ఉన్నవాళ్లే.

సూర్యం కాలేజీలో చేరిన మొదటిరోజున ఇంగ్లీషు లెక్చరరుగారు పాఠం మొదలెట్టారు.

"Just for a hand full of silver he left us Just for a Ribbon to stick on his coat."

అది ఎక్కడ ఎంత ఒత్తి పలకాలో చూపించి చెపుతూంటే సూర్యం ముగ్ధుడై విన్నాడు. కాని తరవాత ఏ క్లాసుకి వెళ్లినా అందరూ ఇంగ్లీషులోనే చెప్పుతున్నారు. అందులో తను పది రోజులు ఆలస్యంగా చేరాడు కాలేజీలో. తన స్కూలు జీవితంలో ఎప్పుడూ ఎవ్వరూ ఇంగ్లీషులో ఇంత ధారాళంగా మాట్లాడ్డం వినలేదు. అప్పుడప్పుడు ఫిఫ్తుఫారం చదివే రోజుల్లో కొన్నాళ్లు ఇంగ్లీషు చెప్పిన రామారావు మేష్టారు తప్పించి, తన స్కూల్లో ఇంగ్లీషు పాఠం కూడా తెలుగులోనే చెప్పేవారు. ఇక్కడ తెలుగు మాష్టారు కూడా పాఠం తప్పించి మిగిలినవన్నీ ఇంగ్లీషులోనే. సూర్యానికి కొన్నాళ్లు కంగారైపోయింది. చెప్పేవి సగంపైగా అర్థమయ్యేవి కావు. లెక్చరరు ఎప్పుడేనా ప్రశ్నవేస్తే ఒకవేళ సమాధానం తెలిసినా ఇంగ్లీషులో ధారాళంగా చెప్పగలనని ధైర్యం లేక వూరికే ఉండిపోయేవాడు. తనంత తాను ఇంగ్లీషులో మాట్లాడ్డం ఎప్పుడూ ఇదివరకు అవసరం కలగలేదు. అలా మాట్లాడ్డం అవసరమని ఏ టీచర్లూ, పైవాళ్లూ ఎంకరేజ్ చెయ్యలేదు. ఈ ఒక్క లోటు మూలంగా సూర్యం అంతవరకూ క్లాసు ఫస్టుగా ఎప్పుడూ వస్తున్నవాడల్లా కాలేజీకి రాగానే మొదటి అయిదారు నెలల్లోనూ చిన్నచిన్న పరీక్షల్లో సాధారణ మార్కులు తెచ్చుకున్నాడు.

కాలేజీలో సాధారణంగా సగంమందికి పైగా చక్కగా దుస్తులు వేసుకొని వచ్చేవారు. కొద్దిమంది ఎప్పుడూ సూటు వేసుకుని వచ్చేవారు. మిగిలిన జనాభా అంతా కూడా ఉన్నదాంట్లోనే కాస్త మడత నలక్కుండా వేసుకుని వచ్చేందుకు ప్రయత్నించేవారు. ఏ కొద్దిమదో ఉండేవారు సూర్యంలాంటివాళ్లు. అతనికి ఉన్నవే మూడు నాలుగు జతలు. అవే ఉతికి వేసుకునేవాడు. అస్తమానం ఇస్త్రీ చేయించి వేసుకోడం సాధ్యమయ్యేది కాదు. అప్పటి కాలేజీ కుర్రాళ్లు సాధారణంగా పొడుగు పాంట్లు, పొడుగు చేతుల చొక్కా మోకాళ్లదాకా వేసుకొని చొక్కా చేతులు మోచేతుల్దాకా మడిచి కాబూలీ చెప్పులు వేసుకుని తిరిగేవారు. ఇది సూట్లు వెయ్యని జాతి వాళ్ల సంగతి. సూర్యానికి అన్నీ పొట్టి చొక్కాలే. అప్పుడప్పుడు పొట్టి లాగులు కూడా వేసేవాడు. కాలేజీలో అలాంటివాళ్లని అనాగరికులుగా లెక్క కట్టి ఏడిపించేవారు.

సూర్యం తరుగుతూన్న కలిమీ పెరుగుతూన్న లేమిలోను పెరిగాడు. అందుకని ఎప్పుడూ బాగా ఉన్నవాళ్ల పిల్లలకుండే ధీమా, చొచ్చుకుపోయే లక్షణాలు అవీ లేవు. పోని అంటే లేనివాళ్ల పిల్లల కుండే దుడుకుతనం కూడా లేదు. కొంత బెరుకూ, ఎవళ్లేమనుకుంటారో నని భయం, కొంచెం తక్కువతనం ఫీల్ అవటం అలవాటయ్యాయి. స్కాలర్‌షిప్ మీద చదువుకుంటున్నవాడంటేనే అందరికీ ఉండే ఒక న్యూనతా భావాన్ని బట్టి తనకి కూడా వాళ్లంతా తనకంటే గొప్పవాళ్లనే భావం కలిగేది.

పోనీ కాలేజీలో అన్ని రకాలవాళ్లుంటారు. తనది స్కాలర్‌షిప్‌వాళ్ల హాస్టలు గదా అంతా తనలాంటివాళ్లే ఉంటారని ఆశించాడు. కాని

## శ్రీబాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలించిన సొమ్ము, పోయిన భార్య మీరు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలము. రూ. 2 ఎం.ఒ. చేయండి. నెలల వారీగా 12 నెలలకు 1 సం॥రం జాతకం రూ 2. పూర్తి పేరు, జాబు వ్రాసినటైము తెలిపినచాలును

**హనుమాన్ జ్యోతిషాలయము,**

10వ లైను, అరండల్‌పేట, గుంటూరు-2



'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనలు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు ప్రతి వారం పడుతూ ఉంటాయి.



## నాకాస్

నేటినుండి ఉబ్బసపు వ్యాధితో బాధపడ నవసరం లేదు ఈ వ్యాధి నిర్మూలనకుగాను 30 సం॥ల పరిశోధనా ఫలితంగా లభ్యపరచుకొనబడి, పరమహంస క్రియలగు గూళికలతో తయారైన అయుర్వేద ఔషధం. ఎంత మొండి వ్యాధికైనను తక్షణమే బాధ నివారింపజేయుటయేగాక కొంతకాలము సేవించిన తిరిగి చూపెట్టదు

8 ఔ. రు. 3–75. పోస్టేజి ప్రత్యేకం.

ఇండియన్ మెడిసన్ హౌస్, విజయవాడ-2.





పెప్స్ గొంతు మరియు గుండె బిళ్లలను మీరు సేవించేయడం మీ దగ్గు త్వరితంగా పోవును



రొమ్ము పడిశెములు, గొంతు నొప్పి, పడిశెము, అధిక కఫము జలుబులు, దగ్గులను త్వరితంగా నివారించును

సి. జె. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY.34 TEL.

సోల్ ఏజంట్లు దాదా & కంపెనీ,
86, వెంకటనారాయణ నాయకన్ వీధి మద్రాసు—3





స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు

**లోధ్ర**



**కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్**

రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ . సికిందరాబాదు . మధుర . బరహంపురం . బెంగుళూరు


# పన్నీరు - కన్నీరు

చేరిన కొద్ది రోజుల్లోనే తెలిసింది వీళ్లకి కాలేజీలో మిగిలినవాళ్లకీ ఆట్టే తేడా లేదని. అక్కడ ఉండేవాళ్లలో సగం మందికి పైగా నిజంగా లెక్క అక్కడ కొచ్చినవాళ్లలా కనపడలేదు. చాలామంది కాఫీహోటళ్లకీ, సిగరెట్లకీ సినిమాలకీ లెక్క లేకుండా ఖర్చు పెట్టేవారు. ఖర్చు పెట్టుకోడానికి తగినంత ఉండి స్కాలర్‌షిప్ కోసం ఎందుకు ప్రయాస పడతారా వీళ్లు అని అనిపించేది సూర్యానికి. అందులో ఒకతను సీనియర్ బి. ఏ చదువుతుండేవాడు. సూర్యం అంటే కొంచెం ఇంటరెస్టు చూపెట్టేవాడు. ఒకమాటు "ఎప్పుడేనా సదిరూపోయులుండి ఖర్చుపెట్టడం చేతకాకపోతే నాతోరా చూపిస్తాను" అన్నాడు. ఆ ప్రమాదం రాదులే అనుకుని వూరుకున్నాడు సూర్యం.

తనమీదున్న బాధ్యతను గుర్తించుకుని తను పైకి వస్తేనే తమ కుటుంబానికి ముక్తి అని తెలుసుకుని సూర్యం మొదటినుంచే కాలేజీలో చెప్పిన పాఠాలు శ్రద్ధగా వింటూ రూముకొచ్చి మళ్లీ చదువుకునేవాడు. భాష కష్టంవల్ల కూడా ఇంకొంచెం చదవడం అవసరమయింది అతనికి కాలేజీలో పూర్తిగా అర్థమవక కొన్నాళ్లు. సాధారణంగా కాలేజీ హాస్టల్సులో రోజూ శ్రద్ధగా చదువుకునేవాళ్లకి ఒక విధమైన చెడ్డపేరొస్తుంది. వాళ్లకు బుర్ర తక్కువనీ, అందుకని ఎంతసేపూ అలా చదువుతుంటే గాని ఎక్కదనీ మిగిలినవాళ్ల అభిప్రాయం. దీన్ని రుబ్బడం అంటారు. అలా శ్రద్ధగా చదివే వాళ్లని రుబ్బిష్టులు అంటారు. పరీక్షల కై మొచ్చేదాకా జల్సాగా గడిపేవాళ్లు సాధారణంగా ఎవరి మట్టుకు వాళ్లు "నేను చాలా తెలివైనవాణ్ణి. ఒకమాటు చదివితే వస్తుంది ఏదో అనేక ఏక్టివిటీస్ వల్ల టైం దొరక్క చదవటానికి, మార్కులు రావటం లేదంతే పెద్దపరీక్షలో దంచిపారెయ్యనూ" అని లోలోపల ఉంటుంది. ఇందులో ఏ కొంచమో నిజముండే అవకాశం లేకపోలేదు. కాని నిజానికి స్వతహాగా తెలివైనవాడికి ఏదైనా సబ్జెక్టులో ఇంటరెస్టు కలిగి చదవ నారంభిస్తే దానంతటదే వచ్చేస్తుంది. ఇంక రుబ్బడ మేమిటి. అయితే స్టూడెంట్సుది సాధారణంగా మూక సైకాలజీ. తెలివైన కుర్రాడు పరీక్షల ముందు వారం రోజులు టీ తాగి చదివి ఫస్టు క్లాసులో ప్యాసవుతాడని అలాంటివాడే గొప్పవాడని ఆంధ్ర దేశపు కాలేజీల్లో తరతరాలుగా వస్తున్న సాంప్రదాయికమైన నమ్మకం. రుబ్బడం తప్పు అనుకుంటారు. శ్రద్ధగా చదువుకునేవాడు తప్పకుండా నవ్వుల పాలవుతాడు. ఈ బుర్ర లేదనిపించుకునేవాళ్లే చూస్తుండగానే మెట్లు మెట్లుగా పైకెక్కి మన దేశ పరిపాలనాయంత్ర చోదకు లవడం, తెలివైనవాళ్లు ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే నన్నట్లుగా ఉండిపోడం చూస్తున్నా, మన కాలేజీల్లో సంప్రదాయాలు మాత్రం మారడంలేదు ఒకవేళ నిజంగానే కొంచెం తక్కువస్థాయి మేధ కలిగిన కుర్రాడు అది గ్రహించుకుని కష్టపడి పని చెయ్యడం ద్వారా ఆలోచన కనుకోగలిగితే అది మెచ్చుకోవలసింది పెంపు పకపకలూ వికవికలూ మిసులుతున్నాయి.


## సినిమాలు - కథలు సచిత్ర ద్వైమాసపత్రిక

తొలి సంచిక వెలువడింది!

ఇందులో | * ఆత్మబంధువు పూర్తి వెండితెర నవల * కథలు, పుస్తక పరిచయం * సినిమా ఫోటోలు * సినీ వార్తలు * వ్యంగ్య చిత్రాలు * అన్యభాషా సినీకథ * ఎన్నో ఆకర్షణలు

పంచరంగుల ముఖచిత్రం - 140 పేజీలు వెల ఒక రూపాయి మాత్రమే!

ప్రతిచోటా ఏజెంటు కావలెను

వివరాలకు కేయూన్ పబ్లికేషన్, విజయవాడ 2.

పంపిణీదారులు: మినర్వ బుక్ హౌస్, విజయవాడ 2

# 15
## సాహిత్య పరిచయం

పుస్తకం పుచ్చుకుంటే దీక్షగా కూర్చోడం చుట్టూ ఉన్న వాతావరణాన్ని పూర్తిగా మర్చిపోడం సూర్యానికి చిన్నప్పుడే అలవాటైన జబ్బు. చదువుతుంటే భోజనానికైనా సరే అతన్ని లేపాలంటే ఇంట్లో అందరికీ విసుగొచ్చేది. స్కూలు పుస్తకాలమీద దృష్టి మెల్లిగా ఇతర పుస్తకాల మీదికి వెళ్ళింది. కాశీమజిలీలూ, భోజ కాళిదాసు కథలూ, విక్రమార్కుడి కథలూ, సరిత్సాగరం అలాంటివన్నీ అయ్యాక ఒకటీ అరా డిటెక్టివ్ నవలలు చదివాడు. అప్పటికి తెలుగులో ఇప్పుడున్నంత డిటెక్టివు సాహిత్యం (?) లేకపోయినానూ. రెండువందల అరవైనాలుగు, మాయామంయి లాంటి పుస్తకాలు చదివి రాత్రిళ్ళు ఒణికిపోతూ పడుకునేవాడు. ఇంకా కొన్నాళ్ళకి పెద్దవాళ్ళకి తెలియకుండా అక్కడా అక్కడా కొవ్వలివారి నవలలు కూడా చదివాడు.

కాలేజీ కొచ్చేనాటికి ఇంగ్లీషులో క్లాసు పుస్తకాలు కాక పైనేమి చదవలేదు చెప్పుకోతగినంత. చేరిన కొత్తలో వాళ్ళ దగ్గిరా వీళ్ళదగ్గిరా సెక్స్టన్ బ్లేక్‌లూ మిస్టరీలూ చదివాడు. నచ్చలేదు. తనని జీవితం ఒత్తిడి చేస్తోంది. తన లేమి తనకి నామోషీగా ఉంటోంది. ఈ పస్థితుల్లో తనకేమన్నా దారిచూపే పుస్తకాల కోసం చూశాడు. వాళ్ళ ఇంగ్లీషు లెక్చరర్నడిగాడు. ఆయన "మొదట చదివేటప్పుడు జేన్ ఆస్టిన్, డికెన్సు, స్కాట్ లాంటి వాళ్ళ పుస్తకాలు చదివితే పుస్తకాలమీద దృష్టి నిలుస్తుంది. తరవాత నీ ఇంటరెస్టు ఏవిధంగా అభివృద్ధి అయితే అలా ఏరుకోవచ్చు పుస్తకాలని. ఇది ఒక రత్నాల గని. నువ్వు ఏరుకున్నకొద్దీ ఇంకా ఉంటాయి." అని అన్నాడు.

మొట్టమొదటి పుస్తకం ఆలివర్ ట్విస్ట్. దాంతో పది రోజులు పట్టింది అది పూర్తి చెయ్యడానికి, ఇంగ్లీషు నవలలు చదవడం ఎక్కువ అలవాటులేక. బాగా ఆకర్షించింది ఆ కథ సూర్యాన్ని. హాస్టల్లో భోజనం చేస్తుంటే ఒక్కొక్కప్పుడు సర్! బివాంట్ సంమోర్ అన్న సంఘటన జ్ఞాపకంవచ్చేది. ఇంటిదగ్గర అమ్మాత్రమేనా తింటానికి లేక సగం పస్తులే ఉంటూన్న తల్లీ తండ్రీ తమ్ముడూ చెల్లీ జ్ఞాపకం వచ్చి భోజనం సగంలో లేచిపోయేవాడు.

తరవాత డేవిడ్ కాపర్ ఫీల్డ్ చదివాడు. ఇది సూర్యాన్ని బాగా కదిపేసింది. అదే పుస్తకం ఇంకోమాటు చదివాడు. అందులో ఒక్కొక్క వ్యక్తీ ఒక్కొక్క దృశ్యం, ఎదురుగా ఉన్నట్లు జరుగుతునట్లు కనపడేవి.

డికెన్స్ వంటి రచయిత ఇంతకుముందు పుట్టలేదు. ఇక పుట్టబోడు అనుకున్నాడు. ఆ పదహారు పదిహేడేళ్ల వయస్సులో సాహిత్యం రుచి మెల్లిమెల్లిగా చూడ్డం మొదలెట్టిన రోజుల్లో అభిప్రాయాలు అంత తీవ్రంగానే కలుగుతాయి. పరిమిత దృష్టిలో చదివిన ఒకటీ అరా పుస్తకం. పరిచయమైన రచయితా కొండంత ఎత్తుగా కనిపిస్తాయి. నిజానికి కూడా ఆ రచయిత, రచనా ఎత్తయినవాళ్ళే కావచ్చు. అయితే అలాంటి కొండలు, వాటిని మించిన మహానగరాలు సాహిత్య ప్రపంచంలో లెక్కలేనన్ని అనీ, అవన్నీ మన స్వంతం చేసుకోడానికి మన జీవితాలు చాలవనీ తెలియదు. డికెన్స్ పుస్తకాలన్నీ లైబ్రరీ నుంచి తెచ్చుకుని చదివేశాడు. ఆ రోజుల్లో కొంతవరకూ కాలేజీ పాఠాలు కూడా వెనక పెట్టేశాడు.

మెల్లిగా తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా దొరికిన పుస్తకాలన్నీ చదవడం మొదలెట్టాడు. అయితే ఒక పద్ధతిలో చదవకుండా ఎప్పుడూ ఏదిదొరికితే అది పుచ్చుకుకూర్చునేవాడు. అందుకని ఒక్కొక్కప్పుడు ఒకటీ అరా మామ్, మొపాసా లాంటి నవీనుల కథలూ, షెర్లాక్‌హోమ్స్, ఫాదర్ బ్రవున్ లూ మోలియర్ ప్రహసనాలూ కూడా వెళ్ళిపోతుండేవి. అదొక ఆకలిలాంటిది. ఆ ఆకలి కలిగాక ఏదో ఒక్కటి, పాలు మీగడలో, మిరియాల చారులన్నమో, గడ్డి గాదమో, ఏదో ఒకటిపడుతూనే ఉండాలి. తెలుగులో కూడా దొరికినపుస్తకాలు చదివేవాడు. చిన్నప్పుడు పద్యాలు రాగాలుతీసి చదవడం అంటే సరదా ఉండేది. ఆ సరదాకోసమని ముఖ్యంగా భాగవతంలో సప్తమ, దశమ, ఏకాదశ స్కంధాలు చదువుతుండేవాడు. అక్కడక్కడ భారతం తిరగేశాడు. ప్రబంధాల తెల్లో పారిజాతాపహరణం ఒక్కటి చదివాడు. కాలేజీకొచ్చాక మొదట భమిడిపాటి వారి ప్రహసనాలు రెండుమూడు కొన్ని కాలేజీలో నాటకాలువేస్తుంటే చూశాడు. సాక్షి పుస్తకాల దొంతరలు కనబడ్డాయి. ఒకదాని తరవాత ఒకటితెచ్చి చదివేవాడు. జంఘాల శాస్త్రి మంచి స్నేహితుడయ్యాడు.

జనార్దనమని ఒక స్నేహితుడని చెప్పుకోదగిన వ్యక్తి ఉండేవాడు హాస్టల్లో. అతనికి సిగరెట్లు కాఫీ అలవాట్లు బాగాఉన్నా, మిగిలిన దుర్గుణాలులేవు, ముఖ్యంగా ఒకళ్ళని నొప్పించే గుణంలేదు. అతనికీ సూర్యం స్థితిజాలితోకూడిన ఆదరం కలగడానికి కారణమయ్యింది. తనమట్టుకు తనూ పెద్దచెప్పుకోతగ్గ ఆర్థికపరిస్థితుల్లోఉన్న కుటుంబానికి చెందినవాడు కానప్పటికీను. అతనెప్పుడూ ఏవో పుస్తకాలు చదివేవాడు. కాలేజీలో అట్టే మార్కులు వచ్చేవి కాదు. ఒకనాడు అతని చేతిలో ఒకపుస్తకం చూశాడు సూర్యం. అది 'చరిత్రహీనులు'.చదవటానికి ఇమ్మని తీసుకున్నాడు. ఆరోజురాత్రి తెల్లవారిపోయింది. పుస్తకం చేతిలో ఉండగానే. తెలుగులో ఇంత మంచి పుస్తకాలున్నాయని చెప్పలేదేం అని అడిగాడు జనార్దనాన్ని మర్నాడు. అతమనన్నా ఇది తెలుగులోదికాదు. బెంగాలీభాషలో రాసినకథకి అనువాదం అన్నాడు. ఇది నచ్చినట్లయితే శరత్ పుస్తకాలు ఇంకా ఉన్నాయి పట్టితెల్లి చదవమని గృహదహనం, దేవదాసూ, వాగ్దత్త ఇచ్చాడు. అవన్నీ రోజుకొకటి లెక్కని చదివేశాడు. సూర్యాన్ని ఇప్పుడు శరత్ ఆవహించాడు. ఆ రోజుల్లోనే అతనికి కొంచెం కొంచెం దేవుణ్ణి గురించి, మన ప్రాచీన సంప్రదాయాల గొప్పతనాన్ని గురించీ సందేహాలు ప్రశ్నలు బాధిస్తుండేవి. మొదట్నుంచీ పెట్టిన వరవడి, పాతుకుపోయిన నమ్మకాలేమో, చాలామటుకు ఆ సందేహాల్ని పైకిరానీకుండా ఉండేవాడు. కాని "శేషప్రశ్న" చదివిన తర్వాత అలా ఉండటం సాధ్యం కాకపోయింది. రెండు మూడురోజులు కాలేజీలో పాఠాలు కూడా వినలేదు. ఒకమాటు "శివానీ"అని పైకి అనేశాడు. పక్కని కూచున్నవాడు "ఏమిటి శివనామజపం చేస్తున్నావ్ పాఠం వినకుండా" అన్నాడు.

(సశేషం)



## దేశ రక్షణకై ఆయుధాలు
## ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!




ఇంట్లో బట్టలను ఉతుకుటలో సర్ఫును మించింది లేదు ! మీ బట్టలు సర్ఫుయొక్క ఉతికే అధిక శక్తి వల్ల, ఎంతో సులభంగా, అమిత తెల్లగాను, పరిశుభ్రంగాను, వుంటాయి...షర్టులు, చీరలు, పిల్లల బట్టలు. అన్నిటికీ నేడే సర్ఫును వాడి చూడండి.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

(హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి)

(SU. 25-X52 TL

## న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీతిరువాయి

ముఖ్యోద్దేశం. చైనా తంత్రాంగంలో ఇలాంటి శాంతియుత పరిష్కారాలకు తావులేదు మరి!

సెప్టెంబరు మధ్యభాగంలో, భారత్, భూటాన్, టిబెట్ సంధి ప్రాంతంలో చైనీయులు చేసిన దండయాత్ర, పశ్చిమభాగంపై పెకింగ్‌లో సంప్రదింపులు కొనసాగించాలనుకున్న భారతదేశం ఒప్పుదలకు తీరని ఆఘాతం కలిగించింది. అక్టోబరు 15 వ తేదీసీ బహిరంగంగా చైనా, మనదేశం తూర్పు సరిహద్దులో సైనికమైన వత్తిడిచేసి, భారత ప్రజాస్వామ్య ప్రభుత్వానికి, రాజీ సంప్రదింపులకు విరిచేందుకే వీలులేని పరిస్థితి కల్గించింది.

భారతదేశంపై దండయాత్రకు దారితీసిన భారత చైనా సరిహద్దు సమస్యలు, ఒక్క విషయాన్ని ఋజువు చేశాయి. అదేమిటంటే; చైనీయులకు అంగీకారయోగ్యమయిన ఏ తీర్మానమైనాసరే — చైనాను, ఆసియాలో అగ్రశక్తిమంతదేశంగా, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోట్లాడే ఆసియా ఆఫ్రికా రాజ్యాల ప్రతినిధిగా, విప్లవ వాదానికి నిజమైన ఆచరితమార్గంగా, రూపొందించేట్లు ఉండాలన్నమాట. సరిహద్దు సంబంధమైన విషయాల్లో, సింకియాంగ్ టిబెట్ రహదారి తమకు రావాలని, అందుకు ఒప్పందం జరగాలని చైనాస్పష్టం చేసింది. ఈ రహదారి భారతదేశంలోపోతూ, తరతరాలుగా, సంప్రదాయసిద్ధంగా భారతదేశానికి చెందిందిగానే పరిగణింపబడుతున్నది.

భారతదేశంపై దురాక్రమణ ఆపుకుంటూ చైనా ప్రకటించటం సరిగ్గా యుద్ధం ప్రారంభించినప్పటి తంత్రం ప్రకారమే జరిగింది. అయితే సాధారణంగా ప్రతి నియంత్రత్వ దండయాత్రలోను జరిగే శీఘ్ర విజయాలు, అధికారం, చాలా ప్రాంతాలపై అదుపులకు బదులుగా, చాలాకొద్ది ప్రాంతాలపైనే అదుపు తెచ్చుకోగలిగారు చైనీయులు. అందువల్లనే త్వరగా యుద్ధ విరమణకు కూడా వీలైంది. నవంబర్‌న జరిగిన ఈ యుద్ధ విరమణ ఉత్తరువు, అన్ని ప్రాంతాల్లోను పూర్తిగా యుద్ధం మానెయ్యాలనుకునేందుకు ముందుగానే వచ్చి ఉండాలి.

నవంబరు 19 నాటికి చైనీయుల సైన్యం అస్సాంలోని పర్వత ప్రాంతాలకు దిగువగా, బోండిల్లా భూటాన్ తూర్పుభాగం మీదుగా, సీలాకనుమ వద్ద భారత రక్షణ స్థావరాలను కూలదోసి వచ్చింది. రెండోప్రక్క భారత—బర్మా సరిహద్దు మెక్‌మాహన్‌రేఖల కూడలి మీదుగా వాలాంగ్ దాటి వచ్చారు. అయితే, లఢక్ ప్రాంతంలో భారత సైన్యాలు, భారీ దండయాత్రలకోర్చి ఛుసూల్‌ను రక్షించుకున్నాయి. కమ్యూనిస్టులుగా చైనీయులు క్రమాక్రమ, హింస, అహింస, ప్రజాస్వామ్య, ప్రజాస్వామ్య వ్యతిరేక, రాజకీయ, ఆదర్శాత్మక, సైనిక — ఒకటేమిటి అన్ని పద్ధతులను పూర్తిగా వినియోగించారు! గత మూడేళ్ళుగా చైనీయులు హిమాలయా ప్రాంతంలో అనుసరించిన సిద్ధాంతాల్లో ముఖ్యమైనవి — భారత దౌత్యవిధానాన్ని సైనికంగా ప్రతిఘటించటం అనుకున్న పద్ధతులపై శాంతియుత పరిష్కారానికి సిద్ధమని భారతదేశం వెంబడి పడటం, శత్రుత్వం కొనితెచ్చుకుంటున్నదని భారతదేశాన్ని [illegible]


మీ పొలాల నుంచి
సాధ్యమైనంత ఎక్కువ పండించండి

మీ అరికాళ్ళయందలి, అరిచేతులందలి
చర్మపు పగుళ్లకు, పొక్కులకు
చిడుమునకు, దురదలకు




సపట్ మలామ్
వాడండి
ఇది మీ చర్మమును నునుపుగా, ఆరోగ్యంగా వుంచును.
ప్రతిచోట అమ్మబడును.

తయారుచేయువారు సపట్ & కంపెనీ, బొంబాయి-2.



కొఠారి వారి
సూపర్ ఫాస్ఫేటు

అధికోత్పత్తికి-భూసారాన్ని అభివృద్ధిపరచుటకు వాడండి!

నూతన పద్ధతులలో టి. వి. ఎ. (T. V. A.) మరియు మాంటికాటినీ(Monticatini)ల ఆధారాలుగా తయారవుతూంది
16% ఫాస్ఫారిక్ ఆమ్లముకలిగి, నీటిలో సులభముగా కరుగగల మా సూపర్ ఫాస్ఫేటును వాడి మీ భూమిని సారవంతము చేసుకొని ఫలసాయాన్ని వృద్ధి చేయటానికి పూనుకోండి!
వాగు శీఘ్రంగా పెరగడానికి, వేళ్ళను బలపరచడానికి, మొక్క త్వరగా, ఏపుగా పెరిగి అధిక ఫలసాయ మిచ్చేందుకు ఇది అద్వితీయమైనది

ఎకరానికి 100 కిలోగ్రాముల బస్తా ఒకటి చాలును

తయారుచేయువారు
బ్లూ మౌంటెన్ ఎస్టేట్సు & ఇండస్ట్రీస్ లిమిటెడ్, మద్రాసు.

మ్యానేజింగ్ ఏజెంట్సు.
కొఠారి & సన్సు ఏజెన్సీస్ (ప్రైవేట్) లిమిటెడ్, మద్రాసు.

కర్నూలు, కడప, అనంతపురం, మహబూబ్‌నగర్ జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్సు.
కర్నూలు ఫెర్టిలైజర్స్ కంపెనీ, 17/32, కోట, కర్నూలు:

గుంటూరు జిల్లా డిస్ట్రిబ్యూటరు:
పి. వి. సుబ్బారావు & సన్సు, మెయిన్ రోడ్, బాపట్ల.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రాబోయే ఆకర్షణలు!

'హా అను...

15-2-'63 సంచిక నుంచి ప్రారంభం!

మొదటి వ్యాసం

'పట్టపగలు హత్య!'

ఇన్‌స్పెక్టర్ ఇబ్రహీంగాజీ

(డామస్కస్ – సిరియా)

●

'తెర...

ఒక సరికొత్త సినిమా శీర్షిక

వివరాలకు ఎదురు చూడండి!

●

'బొంబా... ...మా

తార...

– వివరాలు త్వరలో!


# న్యూఢిల్లీ లేఖ

చటమే ఈ వ్యవహారం ముఖ్యోద్దేశ్యం. ఉదాహరణ కు విషయం తీసుకోవచ్చు. లడక్‌లోని కోంకా కనుమ దగ్గర జరపగల దౌర్జన్యమంతా జరిపినతరవాతనే 1959లో చౌ ఎన్—లై 20కిలోమీటర్ల ఉపసంహారణ ప్రతిపాదన వచ్చింది. లడక్ విషయంలో మాట్లాడాల్సింది చాలా ఉందని మన ప్రధానమంత్రి పార్లమెంటులో చెప్పిన తర్వాత మళ్ళీ పై ప్రతిపాదన వచ్చింది.

అందువల్ల చైనీయులు సైనికబలంవల్ల ఇతరుల నెత్తిమీద రుద్దేదాన్ని, పేరే శాంతియుత పరిష్కారమని చెప్పవాల్సివుంటుంది. నవంబరు 20 వ వచ్చిన యుద్ధ విరమణ ప్రతిపాదనలు సహజంగా అనుమానంగావున్న భారతదేశాన్ని, తమ అస్పష్టత ద్వారా మరింత అసందిగ్ధ స్థితిలో పెట్టాయి. ఈ ప్రతిపాదనల ప్రకారం లడక్ ప్రాంతంలో చైనా సైన్యాలు సుమారు 5200 చదరపు కిలోమీటర్లదూరం వెనక్కు వెళ్ళుతాయి. నిజానికి ప్రాంతంపైన సెప్టెంబరు 1962 నాటికి చైనాకు ఎలాంటి అధికారం లేదు. అయితే చైనా చేసిన ఈ ఉపసంహారణ ప్రకటన భారత ప్రభుత్వం పేర్కొన్న 'సెప్టెంబరు 8' ప్రతిపాదనలోకన్న ఎక్కువదూరం ఉపసంహరిస్తున్నట్లు రూపం కల్పించుకోవటంవల్ల తామేదో పెద్ద ఉదార పురుషులమనే భావాన్ని కూడా కలిగేట్లు చేసింది అందుకే నవంబరు 27వ తేదీన భారత ప్రతినిధి ఒకరు చైనా ప్రకటన నిజ (అంత ఉదారంగా ఉన్నట్లయితే) మైతే "భారత ప్రతిపాదనలు అంగీకరించటం చైనాకు చాలా తేలికై ఉండాలి" అన్నారు.

తనకున్న కారణాలు ఏవేవో పురస్కరించుకొని, చైనా తన సైనిక శక్తి, సామర్థ్యాలు ప్రదర్శించినప్పటికీ ఆదేశం అనుకున్న ఆశయం నెరవేరనే లేదు. భారత ప్రభుత్వం ఈ దండయాత్రవల్ల ఎలాంటి సంచలనము, ఆందోళన చూపలేదు. ప్రజలంతా దురాక్రమణదార్లనుతరిమి కొట్టేందుకు ఐక్యకంఠంతో సంసిద్ధతను ప్రకటించారు. చైనా, సోవియట్ ఉపగ్రహం కాదన్నట్లు ఆదేశం చెప్పు చేతల్లో లేనట్లు ప్రచారం జరపుకోగల్గిందేమో గాని, 'సభ్యతగల ఆసియాదేశం' మాత్రం కాలేక పోయింది. ఇప్పుడు ప్రారంభించిన 'శాంతికోసం బెదిరింపు' తంత్రం భారత సైనికులు పాశ్చాత్య ఆయుధాల సహాయం పొందకముందు చేసివుంటే, పరిస్థితి కొంత మెరుగ్గా ఉండేదేమో. అర్ధాంతరంగా వచ్చిపడ్డ యుద్ధాన్ని, హిత రాజ్యాల సహాయ సంపత్తితో ఎదుర్కొగలమనే స్థిర విశ్వయాన్ని భారత ప్రభుత్వం, ప్రజలు వెలిపరచారు. నవంబరు 15 న ఆసియా—ఆఫ్రికా రాజ్యాలకు చౌ—ఎన్—లై వ్రాసిన లేఖలో "ఈ సంఘర్షణ ఇంతటితో ఆగక, భారీఎత్తున జరిగే సూచనలు కన్పిస్తున్నాయని" పేర్కొన్నారు. కానీ, ఓ ఐదు రోజుల తర్వాత, పెకింగ్‌లో, హడావిడిగా పత్రికాప్రతినిధులను విదేశాంగ కార్యాలయానికి పిలిపించి, యుద్ధ విరమణ ప్రకటన చేయటం జరిగింది. 


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra PatrikaPress 6 & 7, Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

20s
24s
26s
హాంక్సు
S.A.T.LTD
కోను
40s
60s
80s




# శ్రీ అక్కమాంబ టెక్స్‌టైల్సు లిమిటెడ్

వెంకటరాయపురం తణుకు

ఆంధ్రప్రదేశ్